# రాజభక్తి నాటకము.



గ్రంథకర్త.

ఆర్. మదనగోపాల నాయుడు.

బి. ఏ., బి. ఎల్.

శ్రీ, సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

ట్రిప్లికేన్, మదరాసు.

1937.

# ఈ నాటకమున వచ్చుపాత్రలు.



పురుషులు.

1. మేఘనాదుఁడు }
2. సారంగుఁడు } చెఱసాలకావలివారు. (రుద్రమండలి)

3. విక్రాంతుఁడు. విక్రమాదిత్యుని మధ్యముఁడు. చంద్రశేఖరుంగాపాడి చక్రవర్తింగావించినవాఁడు.

4. కోదండుఁడు. మదాలస సేనాపతి.

5. దుర్జయుఁడు. కూర్మదుర్గనాయకుఁడు. సరోజినిభర్త. సుధీరుఁడను మాఱువేసమునఁ జంద్రశేఖరుంజంప యత్నించినవాఁడు.

6. కందనుఁడు. విక్రాంతునిసేవకుఁడు. చంద్రశేఖర రక్షకుఁడు.

7. కొత్వాలు. ఇతఁడు మదాలసా రక్షకభటాధ్యక్షుఁడు

8. వసంతుఁడు. దేవాంగనా విక్రాంతుల కుమారుఁడు.

9. చంద్రశేఖరుఁడు, విక్రమాదిత్యుని కుమారుఁడు. బ్రహ్మావర్త సామ్రాజ్య చక్రవర్తి.

10. ఉగ్రసేనుఁడు. సరోజినిసేనాధిపతి.

11. ఇంకనుగొందఱు సిపాయీలు, సర్దారులు, పౌరులు, గోసాయీలు నచ్చటచ్చట వచ్చువారు.

స్త్రీలు

1. మదాలస. విక్రమాదిత్యునిసోదరి. బ్రహ్మావర్తము నక్రమముగా నాక్రమించినది.

2. దేవాంగన. విక్రాంతునిభార్య. చంద్రశేఖరునిపెదతల్లి.

3. మృణాళిని. విక్రాంతునికూఁతురు.

4. సరోజిని. కూర్మదుర్గపురాణి. దుర్జయునిభార్య.

5. కుముద, }
6. కమల, } మృణాళిని చెలికత్తెలు.
7. సరోజిని. }

8. మఱికొందఱు దాసీజనులు.

# పీఠిక



ఇయ్యది ప్రాచీనాధునాతనోభయమార్గ సంకలితమగు నొకయభినవ నాటకము. ఇయ్యది భక్తిరసప్రధానము, భక్తియనం బ్రీతియగును. ఈ భక్తియ శృంగారస్థాయీభావమగు రతియగును. "రతిదానాయక స్థాయికౌది పరతఁ రంజిల్లు శృంగారమై, క్షితిలో దేవగురు ద్విజాది పరతం జెన్నొందు సద్భక్తియై." రసాభరణము, ఆ. 2. పైకారణములచే శృంగారవీరాన్యతర మగు నాటకలక్షణ మిటలేదన నవకాశములేదు. మఱియు విష్కంభ ప్రవేశకాదులం బేర్కొనక కేవలము స్థలనిర్దేశముగావించుటచే నిందట్టివిలేవని తలంపరాదు, అంకము 1. రంగము 2. మృణాళినియు, నామెచెలులును సంభాషించుట విష్కంభమయగును; అంకము 2. రంగము 2, కోదండుని సిపాయీలు చచ్చువఱకుఁగల కథాభాగము ప్రవేశకమగును, పరిశీలనాదృష్టి నాలోచించిన నిట్టి నాటకలక్షణము లెల్లనిందుఁగన్పట్టును. రాజభక్తిరూపబీజము ప్రథమాంకమునన యుద్భవిల్లి, మదాలసా దుష్కృత్యముల వలనను, మృణాళిని వలపువలను నానావిధములం బ్రకీర్ణమై కడను నొక్కట చేరుచున్నది. కడపటిరంగమునఁ జంద్రశేఖరుఁడు మదాలస సమాధిపైఁ గిరీటముంచి యామెపేరంబాలించునట్లు చెప్పుటచే సంతోషాంతమయినదగును. ఇట్లుపంచసంధు లిటనిమిడి యున్నవి. రసజ్ఞులిట్టి విషయములెల్లం దెలిసికొనక పోవరనియే నిర్దేశింపలేదు కాని వానింబరిత్యజింపలేదు. ఇట్లు ప్రాచీన నాటకపద్ధతులం బేర్కొనక యిమిడ్చి నూతననాటక సంవిధానములచే నలంకరించి యుండుట నిదియభినవ మగుచున్నది.

ప్రాచీనములవలెఁ బాఠయోగ్యతా మాత్రపర్యవసాయి గాకయు, నాధునికములవలె లక్షణహీనముగాకయు నుండునట్లు రచియింపఁబడియున్నది. ఒక్కొక్క రంగమునకును నడును, కాలవ్యవధి గల్గుచుఁ బ్రేక్షకుల మానసములకు విసుగుజనించులాగున నొనర్పక వాని యమరిక బాగుగ సంఘటింపఁబడియున్నది. ఇదియేతక్కిన నాటకములకంటె దీనియందుఁగల విశేషము.

సూచ్యార్థ సూచకములు, ధ్వనులు విశేషముగ నిందిమిడియున్నవి. అట్లు ధ్వనిప్రధానమగుటచే నియ్యది యుత్తమకావ్య లక్షణసంయుతమగుట నిర్వివాదాంశము.

ఈ నాటకము మహారాష్ట్ర భాషనుండి పరివర్తింపఁబడెను. ఆసమయమున నాకుఁదోడ్పడిన మ, రా, రా, (శ్రీ), గోపీనాథరావు గారికిని, ఈ నాటక మచ్చొత్తించుటకుఁ బూర్వముకొంచి సంతసించి ముద్రింపనన్ను బ్రేరేపించి నాకుత్సాహము గల్గించిన నామిత్రులెల్లరకును నేను గృతజ్ఞతాభివందనము లర్పించువాఁడను.

ఇట్లు,

గ్రంథకర్త.

శ్రీ

# రాజభక్తి నాటకము

అంకము—1 రంగము—1.

రుద్రమండలియందు రాజగృహమున బంధితులకొఱకు కేర్పరుపఁబడిన భూగర్భస్థమగు చెఱసాల.

మహారాజ్ఞి మదాలసయొక్క సైనికాధికారు లిరువురు-సారంగుఁడు, మేఘనాదుఁడు నశ్వారూఢులై ప్రవేశించుచున్నారు.

మేఘ. సారంగా! అంతయు నాశమైనది. దుర్జయుఁడు మోసగించెను.

సా. అట్లనిన?

మేఘ. కోదండుఁడు వానికేదో లాభముకలిగించునట్లు బోధించినందున వాఁడు మదాలసపక్షము నవలంబించెను.

సా. ఏమీ? స్వలాభమునకై స్వామి ద్రోహమొనరింప దుర్జయుఁడు సంసిద్ధుఁడాయెనా?

మేఘ. అవును. మదాలస యధికారము నంగీకరించి చంద్రశేఖర మహారాజును, బంధితునింజేసి యామెకప్పగించుటకు వాగ్దానమొనరించెను.

సా. అయ్యయ్యో! విక్రాంత మహారాజున కియ్యది యెంతటిదుఃఖము కలిగించును. తనప్రయత్నములన్నియుఁ గొనసాగించుకొనుటకై ముఖ్యాధారముగా నెన్నుచుండిన దుర్జయుఁడే యీరీతి నాచరించిన నతని హృదయము కుమిలిపోవునుగదా?

మేఘ. అట్లయిన నిది గొప్ప సంకటసమయమే. దీనినుండి విముక్తిఁజెందుటెట్లు?

సా. మన కేవిపత్తు సంభవించినను, విక్రాంతమహారాజు, నతిశీఘ్రముగఁ జెఱనుండి తప్పింపవలయును.

మేఘ. అవును! అట్లుచేయుటయేసరి. ఉపాయాంతర మేదియు లేదు.

[లోపల ధ్వని] ఆగుఁడాగుఁడు మహారాజ్ఞి సపరివారముగా వచ్చుచున్నది.

(మదాలస సపరివారముగఁ బ్రవేశించుచున్నది.)

మదా. సారంగా! విక్రాంతుని పట్టుదల ఇంకను చలనమొందకయున్నదా?

సా. మహారాజ్ఞీ! విక్రాంతుఁడు తమకు వశుఁడగుట యసాధ్యము.

మదా. అసాధ్యమా! ఈ మదాలసకు నసాధ్యమా? అసాధ్యమనునది మదాలస యెఱుఁగని విషయము. ఈ విక్రాంతుఁడు నాకేమాత్రము! వాఁడే నాచరణ దాసుఁడైనంగావలయును, లేనిచో నేను వాని శిరమునఁ బాదతాడన మొన రించి వాని పొగరణఁగఁ ద్రొక్కుదును. మేఘనాదా! దుర్జయుఁడేమను చున్నాఁడు?

మేఘ. మహారాజ్ఞియొక్క చరణములకు దాసానుదాసుఁడై యుండుటకు సిద్ధముగా నున్నాఁడు

మదా. మంచిది. వానింగొనిరమ్ము నా సముఖమునకు—(మేఘనాదుఁడు పోవుచు న్నాఁడు) (సారంగుని చూచి) కావరముచేఁ గన్నులెఱుంగని శ్వానమును వెలుపలికిఁ దీసికొనిరమ్ము. (సారంగుఁడు కృపాణహస్తులగు నల్వురు భటుల తో శృంఖలాబద్ధుఁడగు విక్రాంతునిం దెచ్చును.) ఏమి! విక్రాంతా! అన్ని కార్యములు బాగుగ జరుగుచున్నవా?

విక్రాం. అవును బాగుగనే జరుగుచున్నవి.

మదా. అయిన నీ రాజమందిరమున స్వేచ్ఛగా విలాసయుతుఁడవై చరించుటవలన నీకానందము కల్గునని చెప్పుట యసమంజసము కాదుగదా?

విక్రాం. రణరంగమునఁ జరించుకాలమున ననేకదినము లాహారాదులు లేకయుం డినను సుఖముగనుండినవాఁడును, విషమూలికలచేతను విషజంతువులచేతను, నిండిన స్థలములను శయ్యాతలముగ నొనరించుకొని గాఢనిద్ర చెందిన వాఁడును, భయంకర మృగములతో సహజముగ చరించుచుండినవాఁడును, లోకమున నాపదలతో నెల్లప్పుడు నాటలాడుచుండుటయే వృత్తిగఁగైకొని నవాఁడును, మృత్యుదేవతను దన ప్రియ మిత్రముగ నొనరించుకొను వాఁడునగు నాకు రుద్రమండలియందలి చెఱసాలయందు జరుగు కష్టములు తృణప్రాయములు.

మదా. అయిననీవుపడుచుండు నిడుమలు నీ మనోనిశ్చయము నింకను భేదింపకయే యున్నవా?

విక్రాం. వస్త్రమునందు నూలిపోగులెట్లొకటి వెంబడి నొకటి యుండునో అటుల నే మానవజీవితమునందు మంచి చెడుగులు సంభవించుచుండును. మంచి కలిగినపుడెట్లానంద మొందుదుమో యారీతిగనే చెడుగు వచ్చినపుడును స్వీకరింపవలయును. పురుషుఁడు సుఖదుఃఖములను భేదభావముతోనుపల క్షించెనేని పౌరుషరహితుఁడగును.

మదా. అట్లయిన నా సార్వభౌమత్వమును ధిక్కరించి చంద్రశేఖరుని నాయధీనము చేయఁగూడదను సంకల్పమును నెఱవేర్ప నిశ్చయించియున్నావా?

విక్రాం. నిస్సందేహముగ నీ దేహమున రక్తబిందు వొకటియైననుండువఱకీ విక్రాంతుని శిరము నీచరణము చెంత నమ్రభావము వహించుట, ప్రాణముకన్న మిన్నయు, ననాథుఁడును, నసహాయుఁడును నగునాస్వామియొక్క పుత్ర రత్నమును నీకు సమర్పించుటయు ననునీ యాశల నొందకుము.

మదా. రాజకీయవిషయములలో నొక చక్రవర్తి కుండవలసిన సృష్టించుట, సంహరించుట, మార్చుట యను గుణములు నాయందండగొని యున్నవని నీ వెఱుంగవో ?

విక్రాం. అవును. ఎఱుఁగుదును. నీ చక్రవర్తినీత్వ సామర్థ్యమును నేను సంపూర్ణముగ నెఱుఁగుదును. అయిన మఱియొక్క విషయముకూడ నేనెఱుఁగుదును. నీ సామర్థ్యములు బుద్బురప్రాయములు, ఉన్నతత ,నొందియుండు చక్రాధిపత్యము నొక నిముసమున రసాతలమునకుఁ ద్రోసి గర్విష్ఠుల మదమణఁచి వేయు రాజాధిరాజు స్వర్గమం దుచ్చతమసింహాసనాసీనుఁడై యున్న వాఁడు. అతఁడొకఁడే సర్వ శక్తియుతుఁడు. ఇతరులు పామరులు. విషయమిట్లుండ మనవంటి హీనశక్తులు వాని మఱచి ధిక్కరించి మనక్షుద్ర బలమును వ్యర్థముగఁ బొగడుకొనుటలో నేమి ప్రయోజనము ?

మదా. విక్రాంతా ! నాయిష్టానుసారముగ నీవు ప్రవర్తించిన యెడల నీ కళింగ దేశమకుటము నీ శిరముపై శోభిల్లును.

విక్రాం. (ముఖమును ద్రిప్పుకొని) చాలు చాలును. నీ ప్రేమ సంతతితో నిలుపుము. ఛీ! మూర్ఖురాలా ! ఈ మకుటమునందలి యాశచే నేశీలబాహ్యుఁడగుదునని యెంచితివా ? ఇట్టి మకుటము చే నాశిరము నలంకరించుకొను నాస కలిగియుండిన, కళింగ దేశముయొక్క యంతగొప్పవిలువలేని మకుటము మాట యటుండ నేరాజమకుట మిదివఱలో విఖ్యాతమైన సూర్య వంశమునం దుద్భవించిన మహాభాగులును, పుణ్య శ్లోకులు నయిన రాజుల శిరముల నలంకరించెనో ప్రస్తుతము దురదృష్టవశమున నీవంటి యధమ చండాలియొక్క శిరస్స్పర్శముచేతఁ గళంకయుతమాయెనో యా యమూల్య రత్నఖచిత దేదీప్యమాన సామ్రాజ్యమకుట మీ భాగ్యశాలి శిరముపై నెప్పుడో శోభించియుండ వచ్చును. ఎవనియొక్క యపార పరాక్రమమునకు లోఁబడియీ బ్రహ్మాసప్త సామ్రాజ్యలక్ష్మి ముమ్మాఱు శరణాగతి నొనర్చెనో? అయినను మదాలసా ! ఎవఁడు తన పూర్వులయొక్క నిష్కళంకశీలమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని యద్దానిం దిరస్కరించెనో యట్టి, యీ విక్రాంతునికిం గళింగ దేశముయొక్క యల్పమకుటమును జూచి సన్మార్గమునుండి తొలఁగు నాశకలుగునని నీ వెటులఁ దోఁచెను ?

మదా. ముమ్మాటికి నీమూర్ఖతను జూపితివి. అంతయేచాలును. స్వార్థత్యాగమను వేషమును విసర్జింపుము. నా చరణముల నాశ్రయింపుము. రాజ్యలక్ష్మి నంగీకరింపుము దీన నీకు నిజమగుహితము కలుగును.

విక్రాం. సకల కల్యాణధాముఁడగు పురుషుని సత్వగుణమువలనఁ గలిగిన కృపను నిరాకరించిన పిమ్మట ఆత్మలాభమునకై యాశనొందుట యనవసరము.

మదా. సత్వము సత్వము అని ప్రేలెదవేల? సత్వమనునొక ముఖ్యవస్తువు లోకమున నున్నదని నాకు స్ఫురించలేదు. అది మూర్ఖులయొక్క క్రుళ్లిపోయిన మస్తకమునుండి బయలు వెడలిన యొక దుర్గంధము. అది బుద్ధిహీనత. చిత్తభ్రమ నొందిన ధర్మాన్వేషకులయొక్క భయంకర రోగము. ఆ హాలాహల విషము నమృతమని తలఁచి దానికొఱకు నీవంటి రాజ్య పరిపాలనా యోగ్యతగల పురుషుఁడు, తనయొక్క పరాక్రమమును వదలి యుదాసీన భావము వహించుట సంపూర్ణమతిభ్రమ.

విక్రాం. చాలును. నిలుపుము నీపాండిత్యమును వెల్లడించుటయందలి సామర్థ్యము. ఏల వృథాశ్రమకు లోనగుచున్నావు? నీవంటి మర్కటాంగనలకు మణుల పరీక్ష యేమి తెలియును?

(ప్రవేశము కోదండుఁడు, మేఘనాదుఁడు దుర్జయునితో)

మదా. దుర్జయా!

దుర్జ. మహారాజ్ఞీ!

విక్రాం. ఏమి యాశ్చర్యము! దుర్జయరాజు నోటినుండియా మహారాజ్ఞీయను మాట వినఁబడుచున్నది!

మదా. దుర్జయా! నాకోపాగ్నికిఁ బాత్రమగుటచే నీకుఁ బ్రాణాపద గలుగ వచ్చును. నీవో తరుణవయస్కుఁడవు. నీ కతిసౌందర్యవతియగు భార్య గలదు. ఆ యమ్మకు నీయెడలఁ గల ప్రేమాతిశయమునకు నిదర్శనముగా నీకు శీఘ్రకాలముననే ఒక పుత్రరత్నము నొసంగ నున్నది. ప్రేమాస్పదయగు సుందర యువతియుఁ గోమల పుత్రరత్నమును వీరియొక్క సహవాస సంతోషమునకు సమాన మీ యిలయందేదియు లేదు. ఈ విషయములెల్ల నాలోచించి నీ యభిప్రాయమును దెలుపుము.

దుర్జ. మహారాజ్ఞీ! నేను మీ కనన్య శరణాగతుఁడను.

విక్రాం. దుర్జయా! దుర్జయా! నీవు చేయునదేమి? నీ విట్లొనరించుటచే రౌరవ నరకమును సంపాదించుకొనుచున్నావను జ్ఞానము నీకు లేదా?

దుర్జ. విక్రాంతా! రౌరవ నరకము వచ్చునపుడు రానిమ్ము. ప్రస్తుతమున స్వర్గతుల్యమగు సరోజని సహవాసమునే మాన నొల్ల.

విక్రాం. దుర్జయా! ఆలోచింపుము. ఈ పిచ్చితలంపు మానుము. ఈశ్వరసాక్షిగ నీవు చేసిన రాజనిష్ఠాసంకల్పమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము, విక్రమాదిత్యుఁడు హతుఁడైనందులకుఁ దత్ప్రజల యశ్రుధార లింకను నింకకున్నవే. మనసర్వాపదలకు దుఃఖమునకుఁ గారణమైన పరమ పవిత్రమగు సూర్యకుల శ్రేష్ఠ సింహాసనమును భ్రష్టము కావించిన యీ చండాలికి, ఈ పాపినికి శరణాగతులమనుట సూర్యకులము యొక్క యుప్పుతినిన మనకు మిక్కిలి తగని కార్యము. దుర్జయా! నీవు బుద్ధిశాలివి, ధైర్యమునువదలి యీ దుష్కార్యములొనరింపకుము. ఇహలోకమున నపకీర్తియుఁ బరలోకమున దుర్గతియు నొందకుము.

దుర్జ. నేను సంపూర్ణ విచారపూర్వకముగనే యీ నిశ్చయము చేసియున్నాను. నాకుఁ బ్రాణరక్షణమే ముఖ్యము. అందులకై ఎంత యపకీర్తికిని దుర్గతికిని లోనగుట నాకు లక్ష్యముకాదు. ఇదియే నీకును నేను జెప్పఁదగిన విషయము.

విక్రాం. చాలును. నిలుపుము. ఇఁక మీమాటలవిననొల్ల. నన్నిటనుండి తీసికొని పొండు. నేనుండు కారాగృహమునందలి కల్మషదుర్గంధము లిచ్చటి మనుజుల మానసములయందలి కల్మష దుర్గంధముల కన్న నెంతయో మేలు. ఇట్టి వారి ముఖావలోకముచేయుటకు నాకు మనసొప్పకున్నది. కొనిపొండు నన్నులోనికి.

మదా. వలదు. ఇచ్చటనేయుండి నీవు జరుగువిషయముల వీక్షించుచుండవలయును. (దుర్జయుని జూచి) దుర్జయా! నా సార్వభౌమత్వమును నీ వంగీకరించుచున్నావా?

దుర్జ. మహారాజ్ఞీ కృపావలోకనము నన్ను జెందసలయును. మీ చరణములకు దాసాను దాసుఁడుగ నుండ సిద్ధుఁడనై యున్నాను. (మోకాలొడ్డి భూమిని ముద్దిడును).

విక్రాం. దుర్జయా! దుర్జయా! ఆలోచించుము. ఆగుము. మోకాలొడ్డకుము. శిరమును వంపకుము. (మరల దుర్జయుఁడు పైరీతి నొనర్చును) పొమ్ము. పొమ్ము. పొమ్ము. నీ యిష్టము వచ్చినట్లు రౌరవ నరకమునఁబడుము. అతి నీచపాతకముల పాల్గొనుము. పొండు నన్ను దీసికొని పొండు. ఈ పిశాచము యొక్క సహవాసము నే సహింపలేను.

మదా. దుర్జయా! లెమ్ము. నీవు నా సార్వభౌమత్వము నంగీకరించెదనని యుచిత మర్యాదా పూర్వకముగ శపథ మొనర్చిన నిన్ను బంధవిముక్తుఁగాఁ జేయ నాజ్ఞాపించెదను. (విక్రాంతుని జూచి) విక్రాంతా! నీకు సైదోడులుగ నున్న వారు పగదాయలైరి. అట్లుండ నిప్పుడైనను నీవు నాచరణములకు మ్రొక్కుదువా? లేదా?

విక్రాం. ఈ శిరము నీచరణముల చెంతన ప్రమభావము వహించునా ?

మదా. అవును. ఈ బ్రహ్మావర్తమున మహాప్రతాప శాలినియగు మహారాజ్ఞి యొక్క చరణముల చెంత ?

విక్రాం. ఏ గౌరవహీనుఁడు నీపాదధూళిని దన శిరమున గొప్ప భూషణముగ ధరించునో, వానికి నీ చక్రవర్తి నీత్వము యొక్క గొప్ప తనమును జూపుము. అయిన సూర్యవంశము వారి యుప్పు తినిన నావంటి సేవకులయెడ నీ గొప్పతనము చెల్లదు. నీవు మృత్యు దేవతయొక్క సహోదరివి. పాతకములకు జననివి. నీ పాప కృత్యములను గౌరవనీయుఁడగు పురుషుఁ డెవఁడు నంగీకరింపఁడు. నే నింకను జెప్పునదేమనఁగా ? నీవు నా రాణివి కావు. నేను నీప్రజలలోని వాఁడనుగాను. కావున నా శిరము నీ చరణములయందు నమ్రతవహింపదు.

మదా. ఇంత కావరమా ! కానీ ! ఈ రుద్రమండలి చెఱసాలయందు నీవు యావజ్జీవము ఘోర సంకటముల పాలై యుండవలయు. ఈవిషయము చక్కఁగఁ దెలిసికొనుము.

విక్రాం. నీవంటి న్యాయహీనురాలికి, ద్రోహురాలికి, పాపినికి దాసుఁడై లజ్జలేక జగమున సంచరించుటకంటె ఈ రుద్రమండలిలోని చెఱసాలయందుఁ గలుగు కష్టము లను నేను మిక్కిలి యానందముతో ననుభవింతును.

సీ. దురిత పంకకళంక భరమున నీమోము గనుకంటెఁ జెఱనుండి మనుట మేలు
త్వద్దాస్యమునఁ గల్గు స్వచ్ఛందమునకంటె సంకెళ్ల కట్టులోఁ జావు మేలు
నినుఁగొల్వ లభియించు నెఱవాయిసముకంటెఁ గడకలభించెడు గంజి మేలు
నీసేవఁ జేయుచు నృపపుత్రుఁడై మనుకంటె నొకనికి భృత్యుఁడై యుంట మేలు

గీ. గాన నీమోము నిఁక నీజగానఁ గాన
భూమి క్రుంగినఁ దారలు భువిఁ బడినఁ
జంద్ర సూర్యులు తమ తమ సరణి విడినఁ
గామిని! నీచ! దుర్జాత! కఠిన చిత్త!

మదా. నీచ ! దుర్జాత ! నిరసించితా నేను ?

కో. విక్రాంతా ! నీవు ఇట్టి యవమానకరమైన మాట లెవరి సన్నిధానమున నాడుచున్నావని తెలియలేదా ?

విక్రాం. నాకుఁ దెలియును. సంపూర్ణముగఁ దెలియును. దుష్టకామవాసనకు లోఁబడి యే స్త్రీ దేవునితో సమానుఁడును బూజ్యుఁడు నగు తన పతి తన యంకమునందు శిరమునుంచి నిదురపోవునపుడు గాఢనిద్రా సమయమున స్వహస్తముచే నతని ప్రాణముల నపహరించెనో, యే స్త్రీ సామ్రాజ్యపదవికొఱకు దారస్వభావుఁడగు సహోదరునకు విషము నిప్పించి పాతకమొనర్చెనో,

మఱియు నెవతె యిపుడు చిఱుత ప్రాయముగల వాఁడును గోమలగాత్రుఁడును సహోదర పుత్రుఁడును నగు వాని రక్తమునందుఁ దన హస్తమును దోచి పతి హత్యయనుపునాదిపైనుండు భ్రాతృహత్యయను మందిరమునకు బాలహత్య యను కలశమును నిర్మించుటకై సిద్ధముగ నున్నదో యట్టి యొక క్రూరురాలు నధమాధమయునగు నీ రాక్షసి యెదుట నేను మాట్లాడుచున్నాను. ఇది నాకు బాగుగఁ దెలియును.

మదా. చాలు. నోరు మూయుము. ఇట్టికఠోర వార్తల నుచ్చరించునాలుకను ఛేదించి తుండె తుండెములగ నొనర్తును.

> క. పలువా? ఎంతటిగుండియ గలవాఁడవు రాజ్ఞి యెదుట గర్వము మీఱఁగ
> బలికెదు మర్యాదలు విడి పలుతునియలు సేతునాల్కపదిలంబారా!

సా. విక్రాంతా! ఈ మర్యాదా హీనత యుచితము కాదు.

విక్రాం. హృదయమున నగ్ని ప్రజ్వరిల్లుచుండునపుడు నోట శీతల వాక్యములెట్లు వెలువడును?

మదా. అట్టివాని హృదయపుటభేదన మొనర్పక మానను.

విక్రాం. సమరరంగమునఁ గృపాణములయొక్క ఖణఖణ శబ్దముల లోను తుపాకుల యొక్క గడగడ శబ్దములలోను భయలేశములేక యలక్ష్యముగ సంచరించు వానికి ఒక స్త్రీ యొక్క గురు గురు చప్పుడు వలన భయముకలుగునని యెన్నవలదు. నీ విరోధము సన్నేమి చేయఁగలదు?

మదా. విరోధము. విరోధము. ఎవరితో విరోధము? మహాగౌరవయుతయగు మదాల సతో నా విరోధము! పంచభూతములపై నధికారముగల యీమహారాజ్ఞితో నా విరోధము! యముని దంతముల రాల్చు శక్తిగల మహాకాళితో నా విరోధము! విక్రాంతా! చూడుము. చూడుము. ఈ నిప్పులుడల యీరీతి తినింకొక దినముండిన నున్నతతనొందిన నమభావము వహింపని నీశిరమును ఛేదింపక వదలను. గర్వయుతుని శిరమునకట్టి గతికలిగిన నది యసమంజసము కానేరదు.

విక్రాం. ఈ శరీరమునుండి యీ శిరము ఛేదింపఁబడినను మంచిదే. ఈ శరీర వియోగము సంభవింపఁగూడదను నాశగల్పించిన నతి ఘోరపాపమగు భయంకర రాజద్రోహమునకు లోనగువానిఁగ నొనర్పఁ గాలత్రయమునందును నివలనఁ గానేరదు. ఈ మాటను దృఢముగ నమ్ముము.

మదా. అయిననో కోదండా! రేపు సూర్యాస్తమయమునకులోగ నీ గర్వితుని శిరమును నా చరణముల యెడఁ బడునట్లు నీవు చేయవలయును.

కో. మహారాజ్ఞిగారి యాజ్ఞ.

రంగము ముగియును.

శ్రీ

# రాజభక్తి నాటకము



అంకము 1. రంగము 2.

స్థలము. మృణాళినియొక్క స్వర్ణప్రాసాదము.

ప్రవేశము - మృణాళిని, సరోజని, కుముద, కమల మొదలగువారు అనుబంధము.

కమ. అమ్మా! మనమందఱ మీయారామమున విహరించుచున్నను, నీయొక్క మన సన్యాయత్తమైయున్నది.

మృ. ఇట్టి క్రీడలయందు నా కిటీవల విరక్తి కలిగియున్నది.

కుము. ఈ యనకొక విషయమునందుఁగాక ప్రపంచముమీఁదనే విరక్తి జనించియున్నది.

మృ. అవును. నీ వనునది నిజము. నాకీ ప్రపంచము శుష్కించిన పుష్కరిణివలె నీరసముగఁ దోఁచుచున్నది.

సరో. ప్రపంచము పై విరక్తినొంది యేమి సేయనెంచియున్నావు? దీనివదలి యెచటికిఁ బోయెదవు?

మృ. నిజముగ నెచటికిఁ బోవలయును? స్వర్గమునకుఁ బోవుదమన్న నదియు నొక లోకమేకదా! అదియునుగాక ప్రియవస్తు సమాగమము లేనియెడల స్వర్గము నందైన సుఖమెక్కడిది? సుఖము స్వర్గమునందైనను పృథ్వియందైనను లేదు. అయ్యది ప్రియవస్తువుయొక్క సమాగమముచేఁ గలుగుచున్నది. అట్టి సమాగమ మదృష్టవశమునఁ గలిగిన యెడల రౌరవమును స్వర్గమునకంటె నధిక సుఖదాయకమగును. సరోజని! అత్యంతశ్రేష్ఠమైన పదార్థముయొక్క యభిలాష మనకుఁ గలిగినందున దాని నందుట కనేక కష్టముల నొందవలసియున్నను నందులకై ప్రయత్నము తీవ్రముగఁ జేసినయెడల నది స్వల్పశ్రమతో సులభసాధ్యమగుచున్నది. అఖండభక్తివలనఁ బరమేశ్వరుని ప్రత్యక్ష సాన్నిధ్యము కలుగుచున్నదికదా?

కమ. అమ్మా! పరమేశ్వరప్రాప్తికై చేయు ప్రయత్నమునందు సర్వసంగ పరిత్యాగము చేయవలయును. ఇట్టి చిఱుతప్రాయమున నట్టి సర్వసంగ పరిత్యాగమును నీవు చేయనున్నావా?

కుము. తక్కిన విషయములు గోచరింపకున్నను నీ యమయోగినీ దీక్షమాత్రము ప్రత్యక్షమగుచున్నది.

మృ. అవును. కుముదా! నీవు వచించునది యసత్యము కాదు. ఏదే నొక శ్రేష్ఠ వస్తువుయొక్క ప్రాప్తికొఱకు మిక్కిలి శ్రమతోఁ బ్రయత్నము చేయవలయునే గద ?

కమ. ఈ రీతిగ నొక్కొక్క యాఁడుదియుఁ దన ప్రియవస్తు ప్రాప్తికై సకల వ్యవహారములను వదలి యోగినియయిన జగమునకు గొప్ప సంకటమగునని తలంప వలయును.

మృ. కమలా! నీకు వెఱ్ఱి పట్టియున్నది. ఇట్లు శ్రేష్ఠమైన వస్తువుపైఁ బ్రేమకలిగి దాని ప్రాప్తికొఱకు యోగినియగుట యెల్లరకును గలుగు భాగ్యముకాదు.

> మ. అతివా! దాఁపగనేల కోరమది యత్యంతంబు సచ్ఛీలు సం
> తత సత్కార్యధురంధరుఁ సుజన సంత్రాణానురక్తాత్ముని౦
> దత బాహాబలశాలి, సుందరుని, బ్రత్యర్థి స్వాంతగర్వాంతకుం
> బతిగా దైవముగా మనోహరునిగా భావించి యెల్లప్పుడున్.

విక్రాంత మహారాజనెడి లోకోత్తరనిధిపై నా మనసు చెల్లియున్నది. అయ్యది నేఁజేసిన గొప్పభాగ్యమని తోఁచుచున్నది. ఇతర తరుణీమణులయొక్క మహత్త్వాకాంక్షాదృష్టి కగోచరుఁడు. నా మనమతఁ డాకర్షించియున్నాఁడు. ఇట్టి యానందము నభిమానమును నొసంగు విషయ మింకొకటిలేదు. అట్టి గొప్ప మహాత్ముని చరణములపైఁ బ్రేమవహించుటయో, యతని స్మరించుచుఁ గాలము గడపుటయో, అతని గుణగణములఁగూర్చి గానము కావించుటయో వీనికంటె వేఱు పవిత్రమగు నుద్యోగము నాకిపు డీ జగమునఁ గానరాదు.

సరో. అట్టి మహాపురుషుని యెడ నాదరభావము వహించుటయందో, యతనిపైఁ బ్రేమయుంచుటయందో, యతని గుణగణములఁగూర్చి గానము కావించుట యందో నీపై నెవరు దోషమారోపింతురు?

కమ. అయిన, వెఱ్ఱిదానివలె నతనిపైఁ బ్రేమవహించి యనేకవిధ సుఖవిలాసములచే నిండియుండు నీ జగమునఁ దరుణియు నాగర్భ శ్రీమంతునియొక్క కుమార్తెయు స్వాతంత్ర్యము కల్గియుండుదానవు నగు నీవు నిట్టి తీవ్రతాపసవ్రతము నవలంబించియుండునదిమాత్రము దుఃఖకరముగనే తోఁచుచున్నది.

మృ. దుఃఖకరముగఁ గనఁబడుచున్నదా? మీకు నేఁ జేయునది వింతగఁ దోఁచినను నాకు స్వాభావికముగనే తోఁచుచున్నది. విక్రాంత మహారాజుఁబోలు మహాత్ముని ప్రాప్తికొఱకొకటికాక పదిజన్మములందేని యోగినిగఁ దపస్సుచేయవలసినను నటు లొనరించుటకు సిద్ధముగ నున్నదానను.

సరో. మృణాళినీ! అయిన నీ వాకేవోటునఁ దపస్సు చేసికొనుచుండిన నతని ప్రాప్తి నీ కెటుల లభించును?

కమ. అతనిపై నీకుఁ బ్రేమకలిగియుండుట నిజమే. ఆ సంగతి యతనికిఁ దెలియునా?

మృ. అతని ప్రేమకు నే నాస్పదురాలనగుటకును నా ప్రేమ యతనికిఁ దెలియ చేయుటవలన నేమి ప్రయోజనము?

కమ. ఎందులకుఁ బ్రయోజనము లేద నెదవు? ఈరీతి నొక స్త్రీ నిన్ను బ్రేమించియున్న దని నుడివినఁ జాలదా? అట్లు నుడివినమాత్రమున నతనికి నీపైఁ బ్రేమకలుగును. సమవయస్కులు కాకపోయినను బ్రేమయొక్క భ్రాంతిచేఁ బురుషులు స్త్రీలపైఁ గామావిష్టులుగారా? నిజమైన ప్రేమమాత్రము కలిగియున్నఁ గమలమునొద్ద భ్రమరము పరుగెత్తుకొనుచు రాకయుండునా?

మృ. అవును. అటులనే యనుకొనుము.

కమ. విక్రాంత మహారాజు నివలె నవివాహితుఁడు కాఁడు.

కుము. మఱియు నతనికిఁ దనభార్యపై నత్యంత ప్రేమకలదు.

సరో. అటులుండ దేవి దేవాంగననువదలి యతనిప్రేమ నిన్నెటుల నాశ్రయించును?

మృ. దేవాంగనా దేవి యందలి ప్రేమ తగ్గి నన్ను బ్రేమింపవలయునని నా కోరిక గాదు. ఆమె యోగ్యత నా కెన్నటికిని గలుగదని తెలియును. ఆ బిడ ప్రేమయను నుద్యానవనమున విహరించుచున్న చో నందు నా కొకమూలఁ గొంచెము స్థలము లభించినఁ జాలునను నదియే నా యభిలాష. దాన నా కత్యంత సంతోషము కలుగును.

కమ. విక్రాంతునిమెడ నీ కత్యంత ప్రేమయున్నను నతనిప్రేమ నీకుదుర్లభము.

మృ. నా ప్రేమ యతనిపాదముల వదలఁగూడదను నదియే. ఇదియే నే నీశ్వరునిం బ్రార్థించునది.

సరో. ఈశ్వరుని కృప నీకుఁ గలుగనిమ్ము. అతని చరణముల నీప్రేమ వదలకుండనిమ్ము.

(లోపల, కందనుఁడు "వదలుఁడు, వదలుఁడు, నన్ను లోనికిఁ బోవనిండు, మహారాజ్ఞిని జూడనిండు")

సేవకులు. పొమ్ము. మరలుము. పోనియెడల మెడపట్టి నెట్టుదుము.

కంద. వలదు. వలదు. ఇట్టి బుద్ధిహీనకార్యము నొనర్పకుఁడు. నన్ను దొలుత మహారాజ్ఞి యెడకుఁ గొనిపొండు. ఆ యమ నన్ను రాఁగూడదనిన వెలుపలికిఁ ద్రోసివేయుఁడు.

మృ. ఇదేమి కలకలము? ఈ కలహ మేమి?

(రక్తసిక్త సర్వాంగుఁడగు కందనుఁ డొక పేటిక శిరముపై నుంచుకొని ప్రవేశించును. అపుడు మృణాళిని సేవకులు వానితోఁ బోరుచు వానిని వెంబడింతురు.)

కంద. (పేటికను మృణాళిని యెదుటనుంచి) మహారాజ్ఞీ ! శరణాగతుని రక్షింపుఁడు. నా కిచట నాశ్రయము నొసంగుఁడు. విక్రాంతమహారాజు నామము కొఱకైనను నా యెడ దయచూపుఁడు.

మృ. విక్రాంతమహారాజుయొక్క నామమా? ఈ విషయమున విక్రాంతమహారాజున కేమి సంబంధముకలదు ?

మొ-సే. సంబంధాసంబంధముల మాట యటుండనిండు. అంతయు నసత్యమని తోఁచెడిని.

రెం-సే. వీఁ డెవఁడో గొప్ప మోసగాఁడుగను జోరుఁడుగను గన్పడుచున్నాఁడు.

కంద. కాదు. కాదు.

నేను విక్రాంతమహారాజుయొక్క సేవకుఁడను, విక్రమాదిత్య మహారాజుయొక్క యమూల్యమైన రత్నరాశి యిందు నిండియున్నది. మదాలసయొక్క నౌకరులు దీని నపహరింపనెంచుచున్నారు. వారు నన్ను వెంబడించుచున్నారు. నా సామర్థ్యమువలన వారిని జయించి వారివలనఁ దప్పి యీ రాజగృహమున మీ యాశ్రయమును గోరివచ్చియున్నాను. కనుక నన్నుం గాపాడుఁడు. అటుచేయకపోయిన విక్రాంతమహారాజునకుఁ గల్గు గొప్ప కష్టమునకును నష్టమునకును త్తరవాదులగుదురు.

మృ. (సేవకులను జూచి) మీరు మొట్టమొదటఁబోయి రాజగృహద్వారములను బంధింపుఁడు. ఎవరైన నిచటికి శోధించుటకై వచ్చిన నిచటి కేవారును రాలేదని నుడువుఁడు. ఈ విషయము బహిర్గతము కాఁ గూడదు. అందులకు మీరే యుత్తరవాదులు. జాగ్రత్త. పొండు. మీరందఱు నీచోటువదలి. (సేవకులు వెడలిపోపుచున్నారు). (కందనుని జూచి) కూర్చుండుము. ఒక క్షణము కూర్చుండుము. నీ శరీరమంతయు రక్తమయముగా నున్నది. దీని వలన నీకును రాణియొక్క సేవకులకును గలహము జరిగినదని తోఁచెడిని.

కంద. అవును. మహారాజ్ఞీ ! వారిలోఁ గొందఱు నా కృపాణమున కెఱ యయిరి. నాకును గాయములు తగిలియున్నవి. అవి యంత గొప్పవి కావు.

మృ. నీవు విక్రాంతమహారాజుయొక్క సేవకుఁడని యంటివి. కాఁబట్టియే నీ కిచట నాశ్రయ మొసంగియున్నాను. నీ వందు వారిన శిరోజములను జూడ నీ వసత్యమాడవని నాకు నిశ్చయము కలుగుచున్నది. అయినను నా యూహ కల్లనై విషయము వేఱువిధముగఁ బరిణమించి మోసముకలిగిన నెట్లు ?

కంద. అట్లయిన మహారాజ్ఞి యొక్క చరణములయెడ నా ప్రాణమువదల సిద్ధముగ నున్నవాఁడ. (నేపథ్యమునఁ "తలుపు తీయుఁడు మమ్ముఁగింపకుఁడు తలుపులు తీయుఁడు" అను శబ్దము వినఁబడుచున్నది.) ఇదిగో చూడుఁడు. మహారాజ్ఞి సేవకులిందుఁ బ్రవేశించుచున్నారు.

(ఒక సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సేవ. మహారాజ్ఞీ! మదాలసా మహారాజ్ఞియొక్క సేవకులిచటఁ బ్రవేశించి కేకలిడుచున్నారు. (నేపథ్యమున "పరుగెత్తరాయెను మోసగాఁడు పరుగెత్తిపోయెను. ద్రోహి

మృ. ఈ నగరి కవాటములన్నియు నేల బంధింపలేదు?

మొ-సే. కవాటముల బంధింపకమున్నే వారు లోఁబ్రవేశించిరి.

(ప్రవేశము దాసి)

దాసి. మహారాజ్ఞీ! అట్లు ప్రవేశించినవారితనినే వెదుకుచు నిచటికే వచ్చుచున్నారు.

మృ. అట్లయిన, నా కొరిక నిచట నునిచి దానిపై నొక వస్త్రము వేయుఁడు. (సేవకుఁడును కందనుఁడును కోరికను దంపుచున్నారు. మృదాళిని దాసి చెవిలో నేమియో చెప్పఁగా లోనికి వెళ్ళి యొక చీరఁ దెచ్చుచున్నది.) (కందనుని జూచి) నీ పేరేమి?

కంద. కందనుఁడు.

మృ. కందనా! ఈ సందర్భము మిక్కిలి కఠినము. దీనినుండి విముక్తి గాంచుటయు సమయోచితముగ నీ కుపాయముల బోధించుట నాశక్తిని మీఱినది. అయిన నాకొక యుపాయము తోఁచినది. ఈ చీరను ధరించి మా చెలికత్తెలలో ని యూరాభుములు నొకవైపున నుండుటయే. దీనికంటె నుపాయాంతరము కన్పింపదు. ఇందులకై సన్నద్ధమున్నాఁడము.

కంద. మీరు చింతనొందకుఁడు. ఆ చీర నాచేతనిడుఁడు (చెలికత్తెయలు కందనునికిఁ జీరకట్టుదురు. పైఁ గనిన ధ్వనులు మరల వినఁబడును.)

మృ. త్వరగఁ గానింపుఁడు. ఇచటనే నిలువుఁడు. కమలా! నీవు నచటికిఁ బొమ్ము. మీరు మువ్వురితనికేదో యుపచారమొనర్చునట్లు నటింపుఁడు. సరోజినీ! నీవు నాయొద్ద నుండుము.

కొత్వా. ఇక వారి గత్యంతరము లేదు. చట్టము ననుసరించి మీ సేవకుల సమక్షమున మీ గృహమంతయుఁ బరిశోధింపవలసియున్నది. మీరందఱు పోయి పరిశోధించిరండు. నే నిచటనే యుండెదను.

మృ. (తన సేవకులను జూచి) మీ రిరువురు నీ సిపాయిలను దీసికొనిపోయి యీ గృహమునంతయుఁ జూపి రండు. కొత్వాల్! కూర్చుండుము. ఇదేమి విషయము? సంగ్రహముగ నాకుఁ దెలుపుము. కూర్చుండుము.

కొత్వా. (కూర్చుండి) నాకుఁ జేసిన సత్కారములకై నేను గృతజ్ఞుఁడను. రెండు గడియలకుఁ బూర్వము గొందఱు కొన్నివస్తువుల నొక పెద్ద పేటికయును నెత్తికొని రాజగృహము ద్వారమునవైపునఁ బోవుదారియందుఁ బోవుచుండిరి. అచట రక్షకభటులు వారిని విచారించుటకై ప్రారంభించిరి. వారివలనఁ దృప్తికరమగు బదులురాకుండె. వారియందు సందేహముఁ గలిగి వారియొద్దనుండు వస్తువులఁ బరిశోధింపఁ బ్రారంభించిరి. వారు దాని కంగీకరింపలేదు. దానిపై వాగ్వాదమును బిమ్మటఁ బోరును సంభవించెను. పోరతి ఘోరమాయెను. ఇట్లు రచ్చలు జరుగుచుండునపు డాచోరులలో ముదుసలి యొకఁడితర వస్తువులను వదలి పేటికనెత్తుకొని నగర బహిఃప్రదేశమునకుఁ బలాయితుఁడయ్యెను. నా సేవకులు వాని వెంబడించిరి. వెంబడించిన వారిలో నిద్దఱిని జంపి మువ్వురకు వాఁడు గాయములు కల్గించెను. పిమ్మట నా ముదుసలి పేటికతోఁ బరుగెత్తెను. ఇట్లు పరుగెత్తుచుండు వాని నేత్రములకు మీ నగరి ద్వారము కనఁబడెను. అపుడు వాఁడు మీ రాజగృహమును బ్రవేశించెను.

మృ. వానితో వచ్చినవార లేమైరి?

కొత్వా. వారు నా భటులలోఁ గొందఱిని జంపియుఁ గొందఱను గాయపరచియు నలుదెసలఁ బాఱిపోయిరి. వారి నన్వేషించుటకై సేవకులను బంపియున్నాను. ఈ రాత్రివేళయం దీ చీఁకటిని వారు పట్టువడుదురో లేదో తెలియఁజాల.

(సిపాయీలు గృహశోధనచేసి వచ్చుచున్నారు.)

మొ-సి. దేవా! రాజగృహము నంతయు వెదకినను వానిజాడ కానరాకున్నది.

కొత్వా. ఏమి! జాడ తెలియలేదా?

రెం-సి. లేదు. స్వామీ! ఇంచుకైనను దెలియలేదు.

కొత్వా. మీరు చక్కఁగఁ బరిశీలింపలేదు. పరిశీలించియుండిన నా దోసకారి కనుబడియే యుండును.

మృ. ఇందులేనివానిని వెదకిన నెట్లగపడును?

కొత్వా. హా! ఇందుననే మనసామర్థ్యమును వెల్లడింపవగును. ఉండుచోటఁ గని పెట్టుటయందు సామర్థ్యమేమున్నది? అది యందఱికిని సులభసాధ్యము.

లేనిచోటఁ జోరుని గనిపెట్టుట యొక గొప్ప విద్య. (అటు నిటు తిరుగుచు వెదకుచుండును.) ఇంతవెదకియుఁ జిక్కకుండువాఁ డెచ్చటనుండును? గొప్ప మోసగాఁడుగానున్నాఁడు. ఇతఁడు చిక్కకపోయినను బోనిమ్ము. ఇతఁడు నితనితోఁ జేరినవారును మిక్కిలి చాతుర్యముగలవారుగ నున్నారు. రక్షకోద్యోగమున మేముండినను వీరి కలత్యముగ నున్నది. ఈ రాత్రివేళ వారిని వెదక నవసరములేదు.

మొ-సి. వెదకవలసినదియే లేదు. నిజ మాలోచించిన రాత్రికాల మిట్టి నేరములు చేయుటకే యేర్పడియున్నది. కాని నేరములను గనిపెట్టుట యసాధ్యమగును. మీరు చెప్పునదియే సరి.

కొత్వా. మహారాజ్ఞీ! మీకు మిక్కిలి శ్రమనొసంగితిని. అందులకై నన్ను మన్నింపుఁడు.

మృ. దీన మన్నించుటకేమిగలదు? మీకుఁ గర్తవ్యమగుదానిని మీరొనరించితిరి.

కొత్వా. ఇంత వివేకముగలవాఁడు చిక్కువడుట యెట్లు? అమ్మా! నేను సెలవుగైకొనియెదను. కాని నేను జెప్పునదేమనిన? ఒకవేళ నే పుదయమునమగల శోధన చేయవలసియుండిన నుండును (సిపాయీలతోఁ బోవుచున్నాఁడు.)

మృ. (సేవకులను జూచి) పొండు. వారిని వెంబడించి పొండు. వారేమిచేసెదరో వాని నంతయు జాగ్రత్తగ నెఱిఁగి నాకుఁ దెలియఁజేయుఁడు. (సేవకులు పోవుచున్నారు.)

(కందన - కమల - కుముద - దాసి మొదలగువారు వచ్చుచున్నారు.)

కుముదా! నీవు లోనికిఁబొమ్ము. ఈ యారామమున నెవ్వరును బ్రవేశింపకుండు నట్లు జాగ్రత్తగ నుండుము. (కుముదయు దాసియు లోనికిఁ బోవుచున్నారు.) ఈ సమయమున మన మతిచమత్కారముతోఁ జరియించి సంకటమునుండి తప్పితిమి. ముందుఁ జేయవలసిన యేర్పాటు లేవి?

కంద. మీరు చేసిన యుపకారముయొక్క మహోన్నత్యము వర్ణనాతీతము. మహారాజ్ఞీ! నాకు మీరు మహోపకార మొనరించితిరి.

మృ. దీన నుపకార మేమున్నది?

కంద. ఉపకారము చేయలేదా! ఇట్టి యుపకార మొనర్పకుండిన నాకెంతటి విపత్తు సంభవించియుండునొ మీ రెఱుంగకయున్నారు. ఈ పేటికయందున్న విక్రమాదిత్య మహారాజుయొక్క ధనసంచయపు విలువ మీరు చూచినఁగాని మీరు చేసిన యుపకారముయొక్క ప్రభావ మెఱుఁగ నేరరు.

మృ. అది యట్లుండనిమ్ము. ముందు మనము చేయవలసిన దేమి? నీకు సంకోచమేమి యువలదు. వీరందఱు నా బాల్య స్నేహితురాండ్రు. వారి యెదుట నీవు నిరాక్షేపముగ మాటలాడవచ్చును. వీరివలన నెట్టి రహస్యమైనను వెలువడదు.

కంద. మీరిటు సమ్మతముగాఁ జెప్పునపుడు నాకే యాక్షేపణయులేదు. మహారాజ్ఞీ! ఈ పేటికలోని ధనసంచయము నొకమాఱు మీరు తిలకింపవలయును. అటు చూచినవెనుక ముందుఁ జేయవలసిన కార్యములనుగూర్చి నూతనాభిప్రాయము లంకురింపవచ్చును.

మృ. సరి. ఆ యమూల్య వస్తుదర్శనమును నాకు లభింపఁజేయుము.

కంద. చూడుఁడు. చూడుఁడు. ఇదిగో చూడుఁ డమూల్యనిధిని (పేటిక తెఱచి స్మృతితప్పిన చంద్రశేఖరుని వెలుపల నెత్తుచున్నాఁడు.)

సరో-మృ-కమ. (ఆశ్చర్యచకితలై) ఆహా; ఇదియేమి? [స్తబ్ధలై నిలుచుచున్నారు].

కంద. మహారాజ్ఞీ! దివంగతుఁడైన విక్రమాదిత్య మహారాజుయొక్క పుత్రుఁడగు చంద్రశేఖరమహారాజితఁడు.

మృ. ఎవఁడు! చంద్రశేఖరుఁడా?

సరో. ఇట్టి యవస్థయం దేలయున్నాఁడు?

కంద. భయమువలదు. అతనిప్రాణమున కేమాత్రము నపాయముకలుగలేదు. స్మృతి తొలఁగుటకై యియ్యఁబడిన యౌషధమువలన నిశ్చేష్టితుఁడై యున్నాఁడు.

మృ. ఇట్టి యవస్థ కల్పించుటకుఁ గారణమేమి?

కంద. మదాలసనుండి యితని రక్షించుటకై యొక గుప్తస్థలమున విక్రాంత మహారాజు దాఁచియుంచెను. రాణి సేవకు లన్వేషించుచు నెట్లో నాకుఁ దెలియకుండురీతి నాగుప్తస్థలమును గనిపెట్టిరి. వారినుండి యితనిని గాపాడుటకై దేవాంగనా దేవియొక్క యాజ్ఞానుసార మితనిని పేటికయందుంచి నా యనుచరులతో మఱియొక్క సురక్షితమగు చోటికిఁ దీసికొనిపోవు సమయమునఁ ద్రోవలో నీ విపత్తు సంభవించినది. మీ కృపవలన నీ సంకటము తొలఁగినది. లేనియెడల గొప్ప యాపద సంభవించి యుండును.

మృ. ఇందు నేఁ జేసిన దేమియున్నది? పరమేశ్వరుని కృపయుండినందున మీరీ సంకటమునుండి తప్పితిరి. చెలులారా? ఇతనిని లోనికిఁ గొనిపొండు.

కంద. ఈ విషయము వెలుపలికుబ్బరాదు.

మృ. ఈ విషయమున నీవు నిశ్చింతగనుండుము.

రంగము ముగియుచున్నది.

---

# రాజభక్తి నాటకము

అంకము 1.—రంగము 3.

స్థలము:— చంద్రశేఖరుని దాఁచియుంచిన గుప్తస్థలము.

(దేవాంగన తనలో నాలోచించుకొనుచుఁ బ్రవేశించుచున్నది.)

దేవా. (స్వగతము) మనసా! శాంతినొందుము. నీ మనోనిశ్చయమును మాటి
మాటకి మార్పవలదు. నీ నిశ్చయము కఠినపరీక్షకు లోనగు సమయ
మాసన్నమయినది. పతియొక్క నిర్మలయశ మొకప్రక్క, ప్రియతముఁడగు
నేకపుత్రునిపైఁ బ్రేమ మఱియొక ప్రక్కని న్నీడ్చుచుండ నీ రెంట
మొట్టమొదటి విషయము గాపాడుటయే నీకుఁ గర్తవ్యము—రెండ
వదానిం గైకొని మొదటిదానికి వెన్నుఁ జూపిన నీశ్వరునియెడ నేర
మొనర్చిన దానికై శాశ్వత సుఖమును గోల్పోవుదువు. ఈ విషయమును
బాగుగ నెఱుఁగుము. వీఁడు నా కన్న బిడ్డఁడుగాఁడె! నేను వీనిని శత్రు
కరవాలముల కెట్లప్పగింతును? ఇదివఱలో నే తల్లియైనను దన బిడ్డ
నిటుచేయ సాహసించెనా? ఛీ! ఏది యెటులయినను, నీ కార్యమును నే నో
నర్చియే తీఱవలయును. యశము కోరువారు పుత్రవాత్సల్యాదులకుఁ దిలో
దకమువిడువ సంసిద్ధులై యుండవలయును. నేను నా మనస్సునొక తీరునఁద్రిప్పి
యీ ప్రకారము కార్యమొనర్పఁ బ్రయత్నించు సమయమున క్షుద్రములగు
నాలోచనలు తఱచుగ నన్ను నిరోధించుచున్నవి. అటుకాదు. వానినంత
యుఁ దొలఁగఁద్రోసి నేఁ బూననిశ్చయించినమార్గమునే యవలంబింతును.
విక్రాంతమహారాజు పత్నియగు నేను బుత్రస్నేహమను వికారమునకు
లోఁబడి రాజఘాతుకురాలగుటకు సిద్ధనైతినను దుర్యశము నెట్లు సహింతును?
అట్లు చేయుట యనుచితము. చలనము నొందుచుండు నోయాలోచన
లారా! నన్ను వదలి తొలఁగిపొండు. నాకు దైవికమగు పురుషార్థము నాచ
రించుటకు దారి నొసంగుఁడు మీకు లోనైనా పతికీర్తి మందిరమును మంటఁ
గలుపుటకు నేనే నాటికిని సిద్ధురాలనుగాను. "ఏమయినఁ జేయుము. చంద్ర
శేఖరునిమాత్రము కాపాడుము." అనునతని ప్రత్యుత్తరరహితమగు నాజ్ఞారూ
పమగు మాటలు నా చెవిని వినఁబడుచుండ నేనెట్లు నిరాకరింతును? పదునెని
మిది దినములుగ రుద్రమండలియం దమానుషయాతనలకు లోనగుచు
న్నను దన శరీరమును వదలలేదు. అట్టి విక్రాంతుని పూర్ణవిశ్వాసపాత్రు

రాలయిన పత్నినగు నేను నాబిడ్డకొఱకై విశ్వాసము నెట్లు మఱతును ? సత్య పరిపాలనమునకై నేడు నాచిన్నికొమారుని ప్రాణముల నర్పింపవలసినదే.

(వసంతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దేవా. (వసంతుని జూచి) కుమారా! వసంతా! నీవు క్షత్రియ కుమారుఁడవు కావా!

వసం. అందులకు సందేహ మేమి ?

దేవా. నీ తండ్రి శీలముయొక్క మహాత్మ్యము నీకుఁ దెలియునా ?

వసం. ఆహా! బాగుగ నెఱుఁగుదును. జనులెల్లరును నా తండ్రి విక్రాంత మహారాజునకు "జయ జయ" ఘోషము లిడుచున్నారు.

దేవా. అది యెందులకుఁ దెలియునా ?

వసం. అందులకుఁ గారణ మతని పరాక్రమము.

దేవా. అట్టి పరాక్రమవంతుఁడును గీర్తిమంతుఁడు నగు తండ్రియొక్క పుత్రుఁడవగు నీ వతని పేరునకు శోభకలుగునట్లు చరించవలయును.

వసం. నే నటులనే చరింతును. నా తండ్రివలెనేను గొప్ప యుద్ధములలోఁ బోరి, ఎల్ల రాజుల నా పాదాక్రాంతులుగ నొనర్చి, చంద్రశేఖర మహారాజుయొక్క వైభవమును వర్ధిల్లఁజేయుదునని చంద్రశేఖర మహారాజునకు వాగ్దానము సహితా మొనర్చియున్నాను.

దేవా. యుద్ధమున శత్రువులచే నికు మరణము కలిగిన ?

వసం. దానవిశేష మేమున్నది? రాజునకై ప్రాణమువదలిన నిహలోకమున సత్కీర్తియుఁ బరలోకమున సద్గతియుఁ గలుగును.

దేవా. నీ రాజుకొఱకు యుద్ధమునఁగాక వేఱుమార్గమున మరణము కలిగిన ?

వసం. ఆ విషయమునుగూర్చియాలోచింపనేల ? రాజుకొఱకుఁ జావవలసినదే కదా ! అది యుద్ధమునందైనను మఱి వేఱువిధమునందైనను గలిగిన భేదము లేదు. ఈ రెండు మార్గముల దేనిచేనైనను మనసంకల్పము నెఱవేరును.

క. ఎట్టుల భూమింబుట్టితి, మట్టులె భువిగిట్టమొకొ్క యట్లొటను నే
నెట్టనఁ బరోపకారముఁ, బట్టి ప్రాణములనిత్తుఁ బ్రబిమలకీర్తిన్.

దేవా. కాని, నీవు తెలిసికొనవలసిన సంగతి యేమన? మదాలస చంద్రశేఖరుఁ డుంకు గుప్తస్థలము తెలిసికొనెను. ఆయుమ భటులు చంద్రశేఖరుని గ్రహింప నిచటికి రానున్నవారు. ఆ సమయమున నతని ప్రాణమును గాపాడుటకై నీవు చావవలసివచ్చును. అందులకు సిద్ధముగ నున్నావా?

వసం. సిద్ధముగ నున్నాను. నన్ను బరిశోధింపవలయునని యభిప్రాయపడుచున్నావా? ఆగుము. నా కరవాలము నెత్తికొనివచ్చెదను. అందుపై నా పరాక్రమమును జూడుము. (వసంతుఁడు పోవనున్నాఁడు.)

దేవా. క్షాత్రమే మూర్తిమంతమైనట్లు శోభిల్లుచున్నావు. కొంచె మాగుము: నేఁ జెప్పున దేమనిన? కరవాలము కైకొనకయే చావవలసివచ్చిన?

వసం. కరవాలము కైకొనకయే యనిన నెట్లు?

దేవా. (ఒక యౌషధపు సీసాను జూపి) ఇటులు. దీనియందు స్మృతిని దప్పించు మందున్నది. దీనిని సేవించి శయ్యపై బాగుగ నిద్రింపవలయును.

వసం. కాని నిదురయందుఁ జచ్చుటెట్లు?

దేవా. ఆ రాణియొక్క దూతలిటువచ్చినపుడు వారికి నిన్నుజూపి నీవే చంద్రశేఖరుఁడవని నుడువుదును. అపుడు వారు నిన్ను జంపివేయుదురు.

వసం. అట్లే నాటికి నియ్యకొనను. పౌరుషహీనునివలె నిదురించునపుడా చంపఁబడుట!

దేవా. అట్లయినఁ జంద్రశేఖర మహారాజును గాపాడు టెట్లు?

వసం. ఎందులకు వీలుకాదు?

దేవా. నేను చెప్పునట్లు నీవు చరియించనియెడలఁ జంద్రశేఖరమహారాజు జీవితుఁడుగ నిచట నున్నాఁడని తెలిసికొనిన రీతిగనే రేపు వాని నాపదల పాలగు నట్లొనరించును. ఆవల గొప్ప సంకటములు సంభవించును. కాని, యీ యుక్తివలన మదాలస యేమఱి చంద్రశేఖరుని వెదుకుట మానును. అపుడతనిం గాపాడుట మిక్కిలి సులభమగును.

వసం. (ఆలోచించుచుండును.)

దేవా. నీవు చచ్చుటకు భయపడుచున్నావా?

వసం. ఛీ! కాదు. నేను విక్రాంతమహారాజుయొక్క కుమారుఁడను. మృత్యుదేవతకును నన్ను భయపెట్టునంతటి సామర్థ్యములేదు.

దేవా. నీకు నీ తల్లిదండ్రులయందలి వ్యామోహము వదలలేదా?

వసం. నేను బాలుఁడనగుటచే నిట్లు తోఁచుట సహజమే. నేను శుద్ధక్షత్రియుఁడను. శుద్ధక్షత్రియుని చిత్తవృత్తి కర్తవ్యము సంభవించునపుడెట్టి విషయమునందైనను వ్యామోహ మొందదు.

దేవా. మఱి నీ వాలోచించునదేమి?

వసం. నే నా రాణి దూతల కలవాలములకు నిదురించు సమయమున నెఱయగుటకు

సిద్ధుఁడనుగాను.

దేవా. అట్లు చేయుట తప్ప మార్గాంతర మేదియులేదు.

వసం. ఏల లేదు ? నిదురించు సమయమునఁ జంద్రశేఖరునివలె నగపడుటకు శక్తుఁడనుగానుండినవాఁడు జాగ్రదవస్థయందు మాత్ర మట్లేలయుండరాదు.

దేవా. ఏమి ?

వసం. అమ్మా! వినుము. ఆ రాణియొక్క భటులు వచ్చునపుడు నన్నుఁ జంద్రశేఖరుఁడని నుడివి, నీ యిష్టానుసారము వారి కప్పగింపుము. నేనే చంద్రశేఖరుఁడని వారికిఁ జెప్పుదును. ఇం దాటంక మేమున్నది ?

దేవా. (వానిం గౌఁగిలించి ముద్దాడి) ఏమి నీ బుద్ధి సూక్ష్మత ! దేవా ? నా ప్రియపుత్రుని (కన్నీరు కార్చుచున్నది)

వసం. అమ్మా! కన్నీరు వదలకుము. ఇప్పుడేకదా తల్లిదండ్రులపై వ్యామోహము నాకుఁ గలిగియున్నదని నాపై దోష మారోపించితివి ?

దేవా. కాదు నాయనా! ఈ యశ్రుధారలు నీ భావి వియోగమువలనఁ గలుగు దుఃఖసూచకములు గావు. నీ బుద్ధినిజూచినందునఁ గలిగిన కౌతుక మీయానందాశ్రువులకుఁ గారణము (కౌఁగిలించుచున్నది) (నేపథ్యమున "దేవాంగనాదేవిగారెచటనున్నారు? తలుపులు తీయుఁడు" అను శబ్దము వినఁబడుచున్నది) అయ్యో ! ఆ చండాలురాయమదూతలువచ్చిరని తోఁచుచున్నది. బాలకా ! ఇపుడు ప్రాణమును వదలుటకై సిద్ధపడుము.

వసం. ఆహా ! ఇదె నేను సిద్ధముగ నున్నాను (లోనికిఁ బోవుచున్నాఁడు)

దేవా. (వాని నడ్డగించి) కాని, కొంచెమాగుము. ఈ యౌషధమును నీవు భుజించుటయే మంచిదని నాకుఁ దోఁచుచున్నది.

వసం. కాదు ! ఔషధము నే భుజింపను.

దేవా. ఈ వేషమును ధరించుట నీకు సహాయకారి కానేరదు.

వసం. దానిగూర్చి నీవు నిశ్చింతగ నుండుము.

దేవా. కాదు కాదు. నీ వీ యౌషధమును భుజింపనే వలయు.

వసం. అటు చేయను. (నేపథ్యమున ముందటివలెఁగలకలము)

దేవా. అది యెన్నటికిని గాదు. నేను దానిని నీచే బలాత్కారమునఁ ద్రావింతును. (బలాత్కారమున నౌషధమును వానికిఁ ద్రావింప యత్నించునపుడు వాఁడు దానింగైకొని దూరముగఁ బాఱవేయుచున్నాఁడు. నేపథ్యమునఁ బూర్వోక్తముగఁ గలకలము.)

వసం. (వదలించుకొని) నన్ను వదలుము. నేను గరవాలము గైకొని వచ్చెదను. నీవు కొంచెమైనను భయమునొందకుము. నేను వీరకుమారుఁడను. నిన్ను వీరమాతగ నొనర్చి మరణించెదను. నీవు చెప్పుమార్గమునఁ జచ్చువాఁడను గాను. (పోఁ బోవుచున్నాఁడు. నేపథ్యమునఁ బూర్వోక్త కలకలము)

దేవా. కొంచె మాగుము. నిన్నాలింగనము చేసికొననిమ్ము. నిన్ను గడసారి ముద్దిడనిమ్ము. (ముద్దిడుచున్నది) ఒకటి (మరల ముద్దిడుచున్నది) ఇంకొకటి (మరల రెండు మూఁడుమాఱులు ముద్దిడుచున్నది. నేఁపథ్యమునఁ గలకలము. వసంతుఁడు లోనికిఁ బోవుచున్నాఁడు. దేవాంగన వానిని జూచుచుఁ గవాటమును దాఁటి వెలుపలికి వచ్చుచున్నది. ఇంతలోఁ గోదండుఁడు వాని సైనికులును ద్వారములు పెకలించి గోడలపైనెక్కి నలుదెసలనుండి యట్టహాసము సేయుచు లోనికిఁ బ్రవేశించి దేవాంగనను జుట్టుకొనుచున్నారు).

కో. విక్రాంతుని పత్ని దేవాంగన యెచట నున్నది?

దేవా. ఎందులకు?

కో. ఆ యమ్మతో నాకుఁ గొంచెము పని కలిగియున్నది.

దేవా. దేవాంగనను నేనే. మీ రెవరు? ఈ యర్ధరాత్రమున నిచటి కేల వచ్చితిరి? ఈ సిపాయీలు, నీ యొరనుండి తీయఁబడిన ఖడ్గములు, నీ యట్టహాసమును వీని యర్థ మేమి?

కో. నేను మదాలసా మహారాజ్ఞి యొక్క సేనాధిపతి కోదండుఁడను. ఆ మహారాజ్ఞి యాజ్ఞానుసారము చంద్రశేఖరు నిచటినుండి కొనిపోవుటకై యిచటికి వచ్చియున్నవాఁడను.

దేవా. చంద్రశేఖరుఁ డిచట నున్నాఁడని యెవరు మీకుఁ జెప్పిరి?

కో. ఎవరును జెప్పలేదు. చంద్రశేఖరుఁడు నిక్కముగ నిచటనున్నాఁడు. మీరు వానికిఁ జెంగతల్లి యగుటచే వానిపై నత్యంత ప్రేమకలిగియుండుటవలన వాని తల్లి దివికేగిన నాటినుండి విక్రమాదిత్యుఁడు వానిని మీ యధీనము చేసిన దండటికి బాగుగఁ దెలిసినదియే కద?

దేవా. కాని వాఁ డిపుడిచట నున్నాఁడని నీ వేకారణమునఁ జెప్పుచున్నావు?

కోదం. ఏది యెట్లున్న నేమి? నేఁ జెప్పునది నిశ్చయము. నిస్సందేహము. కాన మహారాజ్ఞి యాజ్ఞను గౌరవించి వానిని నా కప్పగింపుఁడు.

దేవా. మహారాజ్ఞికి వాని విషయమున నింత తృష్ణయేల?

కోదం. వానిరక్తము మిక్కిలి రుచ్యమని యామె వినియున్నది.

దేవా. కోదండా! ఎవరి యెదుట నెవరి విషయమును బ్రసంగించుచున్నావనునది బాగుగ విచారింపుము.

కోదం. ఈ విషయమునుగూర్చి మీ రింతకుమున్నే యాలోచించి యుండవలయును. ఆ వాదమిపుడు వలదు. చంద్రశేఖరుఁ డెచ్చట నున్నాఁడు? చూపుఁడు. వాని రక్తముకొఱకు మహారాజ్ఞి యత్యాతురపడుచున్నది.

దేవా. కాని యామె తన జీవితకాలమంతయు నీ తృష్ణకులోనై యుండవలయును. చంద్రశేఖరునే నాటికిని మీ కప్పగింపవలను పడదు.

కోదం. ఈ హఠము వ్యర్థము. చంద్రశేఖరుని బలాత్కారమున మీ వలననుండి కొనిపోవుదుము.

దేవా. ఈ శరీరమునఁ బ్రాణముండువఱకా మాటను మఱచిపొండు.

కోదం. వాని శిరమును మేము మహారాజ్ఞి చరణముల కర్పింపవలసియున్నది. ఆ కార్యము తప్పక చేయుదుము. ఇది సత్యమని నమ్ముఁడు.

దేవా. నీ శిరముపై నాశనువదలిన పిమ్మట వాని శిరమునుగూర్చి మాటలాడుము.

కోదం. చాలును. వృధాకాలయాపనవలదు. ఆ రాజకుమారుఁ డెచటనున్నాఁడో చూపుఁడు. మహారాజ్ఞి జిహ్వాకంబె నా యసిధార వాని మధురమగు రక్తము ద్రాఁగుటకు మిక్కిలి యుత్సాహము చెందియున్నది. సామమున మీరు వాని నప్పగింపరేని మారాజ్ఞి యాజ్ఞను నెఱవేర్తుము

దేవా. ఏమి! మదాలస యాజ్ఞయే.

కోదం. ఔను. రాణిగారి యాజ్ఞయే.

దేవా. సరియే. నెఱవేర్పుఁడు మీ యిష్టానుసారము. మీ రాజ్ఞియొక్క యాజ్ఞ నెఱవేర్పుఁడు. ఈ బెదరులకు భయపడుదానను గాను (పోనఁ బ్రయత్నించును).

కోదం. నిలువుఁడు. ఒక్క యడుగైన నావల నిడఁగూడదు. మీరు రాజ్ఞియాజ్ఞ చొప్పున బంధితలు.

దేవా. ఈ విక్రాంతుని పత్ని యెప్పటికిని బంధితురాలు కానేరదు.

కోదం. సేవకులారా! ఈమెను బంధింపుఁడు. లోనికిఁబోయి చంద్రశేఖరుని వెదకి పట్టుఁడు.

దేవా. (ద్వారమున కడ్డముగ నిలిచి) నేను మిమ్ము లోనికిఁ బోనియ్యను.

కోదం. ఆమెనుబట్టి యచటనుండి తొలఁగించి మీరు లోనఁబ్రవేశింపుఁడు.

దేవా. నా ప్రేతమునుదాఁటిపోవచ్చునుగాని ప్రస్తుతమున నిది కానిపని.

కోదం. అటులనా! మీ ప్రేతమును దాఁటియే పోవుదును. (కోదండుఁడు దేవాంగన

చేయిపట్టి యీడ్వ వా రిరువురికిఁ బోరుజరుగునపుడు వసంతుఁడు మఱియొక కవాట ద్వారమున నిలుచుచున్నాఁడు).

వసం. జాగ్రత్త! ఎవరైన లోనఁ గాలిడిన—పొండు. మరలిపొండు. (సిపాయీలు వెనుకకుఁ బోవుదురు. కోదండుని జూచి) మీరు చేయునదేమి?

కోదం. ఏమి! చిఱుతా! నన్ను భయపెట్టెదవు.

వసం. నోరు మూయుము. ఇచ్చటఁ జంద్రశేఖరున కవమానకరమును బ్రతికూలమునగువిషయములు జరుగనేరవు. పొండు. దేవాంగనా దేవిని వదలుఁడు. చంద్రశేఖరమహారాజు నాజ్ఞ నతిక్రమించిన, నీ కరవాలము ప్రయోగింప నాతఁడు ముందు వెనుక లాలోచింపఁడు.

కోదం. సేవకులారా! వీఁడే చంద్రశేఖరుఁడు. మనకాహారము కాఁదగువాఁడు.

దేవా. (సిపాయీలు ఖడ్గహస్తులై వసంతునిపైఁబడ దేవాంగన వారి నడుమఁబ్రవేశించి) ముందు మీ కరవాలముల నాపైఁ బ్రయోగించి, పిమ్మట ప్రియకుమారుఁడగు చంద్రశేఖరునిపై—

[కోదండుఁడు సిపాయీలును వసంతునిపైఁబడుచున్నారు. కొందఱు దేవాంగననుబట్టి దూరముగఁ గొనిపోవుచున్నారు. వసంతుఁడు యుద్ధ మొనర్చుచున్నాఁడు. కోదండుఁడు వానిని జంపుచున్నాఁడు. వాని శిరమును ఛేదించి చేతులనెత్తికొని, దేవాంగనను బంధించి కొనిపోవుచున్నాఁడు.]

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము



అంకము 2. రంగము 1.

స్థలము.—మదాలసయొక్క దర్బారు.

(ప్రవేశము. మదాలస - కోదండ - దుర్జయ - సర్దారులు నౌకరులు మొదలగువారు.)

మదా. వీరి నందఱిని బ్రహ్మ కాలకూట విషముతో నింపి సృజించెనా యేమి? ఈమె చంద్రశేఖరునిం గాపాడుటకై తనపుత్రునేల చంపుకొనవలయును?

దుర్జ. దేవీ! ఇది గొప్ప వెఱ్ఱితనము.

కోదం. ఈ వెఱ్ఱితనము స్త్రీలకు, శిశువులకు నేల కలిగెనో తెలియకున్నది. ఆ బాలుఁడు చంద్రశేఖరునివలె వీరికిఁ దెలియకుండురీతి ,నటించెను. వాని కపట మెంతవంతమైనను నాకు సంశయము కలిగింపలేదు.

మదా. శత్రువులకు సహితము సందేహము కలిగింపని రాజద్రోహమె సరియైనది. ఆ యోగ్యతలేనివారు మనకు సందేహము కలుగకుండునట్లు నటించుట మిక్కిలి సామర్థ్యమే. రాజద్రోహమునకు జన్మస్థానమగు నా ముఖమునకు మసిపూసిరే. దేవాంగనా విక్రాంతుల రక్తముతోనే నిందులకుఁ బ్రతీకార మొనరింతును. సేవకులారా! ఏల యింకను దానిని నా యెదుటకుఁ దీసికొని రాక యున్నారు? (దేవాంగనను దీసికొనివత్తురు) తీసికొనిరండు. తీసికొని రండు. ఆ దుర్మార్గురాలిని నా సముఖమునకుఁ దీసికొనిరండు. దాని నొక సారి బాగుగఁ జూడనిండు. నా నేత్రానల జ్వాలలచే దాని నిచటనే దహించి వైతును. (దేవాంగనను మదాలస యెదుట సేవకులు నిలుపుదురు.) ఓసీ! అయోగ్యురాలా! నన్ను నీవు మోసగించితివి గాదే?

దేవా. మోసమా?

కోదం. అవును. మోసము.

దుర్జ. కపటము. రాజద్రోహము. విశ్వాసఘాతుకత.

కోదం. మనలను మోసగించి తప్పించుకొనుటకై చేసిన కపటప్రయత్నము.

దుర్జ. మహారాజ్ఞియొక్క శత్రువును గాపాడుటయను భయంకరాపరాధము. (దేవాంగన నిశ్చేష్టితురాలై యుండును.)

మదా. ఏమి! ఇట్లు మూఁగవలె మాటలాడక నిలఁబడియున్నదానవు? చెప్పుము. చెప్పుము. ఈ రక్తసిక్తమగు శిరమేయధముల పుత్రునిదో చెప్పుము. బాగుగఁ జూడుము.

దేవా. (ఆ తలను జూచి స్వగతము) అశ్రులారా! వెనుదీయుఁడు. అంతఃకరణమా! కలవరింపకుము. కొంచెమైన నాలోచింపక బదులొసంగుము.

మదా. చెప్పుము. దేవునిపై నాన. ఈ శిర మెవరిదో చెప్పుము.

దేవా. ఇది చంద్రశేఖరమహారాజు శిరము.

మదా. (సేవకుల చేతిలోనున్న శిరమును గోపముచే దేవాంగన పాదముల చెంతఁ బడఁద్రోసి) అసత్యము! అసత్యము! అంతయు నసత్యము. ఇది ఎంతటి దుర్మార్గురాలు. (దుర్జయుని జూచి) దుర్జయా! ఈ శిరమును నీ వెఱుఁగుదువా?

దుర్జ. ఎఱుఁగుదును. దేవీ!

దేవా. (స్వగతము) ఔరా! ఏమి వీని విశ్వాసఘాతుకత!

మదా. ఇది యెవని శిరము?

దుర్జ. దేవీ! ఇది విక్రాంతునికి కుమారుఁడైన వసంతునిది.

దేవా. (స్వగతము) వీని నాలుక తెగి ఖండఖండములు గాఁ జాలదా?

మదా. చంద్రశేఖరు నిదికాదా!

దేవా. కాగు. ముమ్మాటికిని గాదు.

మదా. ఓ దుర్మార్గురాలా! ఇది నీ కుమారుని శిరముకాదా? చెప్పుము.

దేవా. చంద్రశేఖరుఁడు నా కుమారుఁడనియే నే భావించియున్నాను. కాన నిది నా కుమారుని శిరమని చెప్పుట కభ్యంతర మేమున్నది?

మదా. ఎట్టి యనృతవాదినివి? ఆ బాలుఁడొక రాక్షసుఁడు. నీ వొక రాక్షసివి. ఓ దుర్మార్గురాలా! ఈ కపటవిద్య నెచట నభ్యసించితివి?

దేవా. ఇది నిక్కముగఁ గపటమేయైన నందులకు గురువు నీవే?

కోదం. ఇటు మాటమాటకుఁ బ్రత్యుత్తరమిచ్చిన మీ యనృతము మఱఁగిపోవునని తలఁపవలదు. మహారాజ్ఞి మీరు చేయునదెల్ల నెఱిఁగియున్నది.

దుర్జ. కావున నీవు వృథా యబద్ధములాఁడుచు హఠము పూనియున్నావు. దాని వలన నేమి ప్రయోజనము? హఠమును వదలి యీ సంకటమునుండి తొలఁగు మార్గము నవలంబింపుము.

దేవా. కపట మెక్కడిది? ఒప్పుకొనవలసిన దేమున్నది? ఈ శిరము చంద్రశేఖర మహారాజు శిరము. ఈ సంగతి మీ కింతకుఁ బూర్వమే చెప్పియున్నాను:

కోదం. ఇది యసత్యము.

దుర్జ. ఇది సంపూర్ణాసత్యము.

దేవా. ఇది సత్యముగఁ దోఁచినను, నసత్యముగఁ దోఁచినను మీ యిష్టము.

మదా. ఇట్టి యనుచితమైనమాట నేనాఁటికి నాడనీయను, కోదండా! ఇప్పుడే రుద్రమండలికిఁ బొమ్ము. అయోగ్యుఁడగు విక్రాంతునిం దక్షణమే యిచటికిఁ దీసికొనిరమ్ము. వానిచే నీ శిరమును గుర్తింపఁజేసి దీనికి శిక్ష విధింతును.

దేవా. నాకు శిక్షవిధించుటయా! నీకుఁ దగుశిక్ష కలుగకుండునట్లు కాపాడుకొనుము.

మదా. కోదండా! ఇంక నాలస్యము చేయకపొమ్ము. (కోదండుఁడు పోవుచున్నాఁడు.)

దుర్జ. మహారాజ్ఞి కల్లనిజముల వెల్లడించుటకు మంచి యుపాయము చేసియున్నది.

దేవా. (స్వగతము) ఓ దేవా! ఇది యేమి గొప్ప యాటంకము సంభవించినది! ఇపుడేమి చేయుదాన? మహారాజువచ్చి వసంతుని శిరమని నుడివిన నేనిదివఱకుఁ జేసినకార్యములన్నియు నిష్ఫలములగునుగదా? (భ్రమ చెందినట్లుండును.)

దుర్జ. దేవాంగనా! ఈ భ్రాంతి నీకు వలదు. ఇప్పుడైన నిది చంద్రశేఖరుని శిరము కాదు. వసంతునిది యని యొప్పుకొనుము. విక్రాంతుఁ డిచటికి వచ్చెనేని నీకుఁ గలుగఁగల యవమానమునకు మితిలేకుండును.

దేవా. ఇంత త్వరయేల? విక్రాంతమహారాజు రానిమ్ము. ఆవల నెవరి కవమానము కలుగనున్నదో చూడనగును. మీ సత్యధ్వజమును నాటుటకింత తొందరయేల? అనేక దోషసహితమగు నీ కలియుగమున సత్యమును నిర్ధారణచేయుటకై ధర్మరాజునకుఁ బిమ్మట నీ దుర్జయుఁడే యవతారమెత్తియున్నాఁడని నాకు బాగుగఁ దెలియును.

దుర్జ. కావున నామాట వినుము. అసత్యములాడి పాపము సంపాదించుకొనకుము.

దేవా. పాపపుణ్యములఁగూర్చి నాతో నీవు ప్రసంగించుటకంటె దాని నీ వెఱింగి చరించిన లోకమునకు గొప్ప యుపకారము చేసినవాఁడ వగుదువు.

దుర్జ. ఛీ! విక్రాంతునివలననే నీకు గొప్ప శిక్ష జరుగఁగలదు.

దేవా. (స్వగతము) అతఁడు వచ్చిన నేనేరీతి నతనికి సంజ్ఞచేయుదును? ఆతఁడు తప్పించుకొనిపోయి యుండరాదా? దేవా! అటులగునేని నా కెంతయు సంతోషము. అంతేటి మేలెట్లు సమకూరును? (ఆలోచించుచుండును.)

మదా. దేవాంగనా! నీ వెంత కపటమూనినను, జంద్రశేఖరుఁడు సజీవుఁడై యున్నాఁడనియు వానిని నీ వెచటనో దాఁచియున్నావనియు నేబాగుగ నెఱుఁగుదును. దాఁచిన చోటును శీఘ్రముగ నెఱిఁగింపుము.

దేవా. అదిగో! అచట స్వర్గమున నా సర్వసమర్థుఁడగు దేవుని కృపకుఁ బాత్రుఁడై యున్నాఁడు. పరమదయాళువగు దేవునొద్దనున్నాఁడు. అచ్చోటికి నీ రాక్షస వీక్షణములు పోనేరవు. నీవంటి పాపినియొక్క కరములు వాని దేహమును స్పర్శింపఁజాలవు.

దుర్జ. చండాలీ! నిక్కము వచింపుము.

దేవా. నేఁ జెప్పినదెల్లను నిజమే.

మదా. ఇట్లాడి తప్పించుకొనఁదలంచితివే? అది కాని పని.

దేవా. అటులనా! ఇంక నీ విషయమునుగూర్చి యొకమాటయయినను నా నోటి నుండి వెలువడదు.

దుర్జ. వెలువడునటులఁ జేయుదును. నిన్ను వదలను.

దేవా. అవును. అటులనే చేయుదువు. నిజముగ చేయఁగలవు. నీవు దిగ్విజయము చేసినవాఁడవుగదా?

మదా. దేవాంగనా! నా కోప మతిభీకరము.

దేవా. నీ కోపము భీకరమైనను, ప్రసన్నమైనను దానిగురించిన చర్చ నాకనవసరము.

మదా. అట్లేని గొప్పకష్టముల పాలగుటకు సిద్ధముగనుండుము.

దేవా. అట్లే సిద్ధముగనున్నాను. మదాలసా! విక్రాంతుని పత్నియగు నన్ను సామాన్య స్త్రీయని యెంచితివా? ఈ దేవాంగన దేహమందు క్షత్రియ రక్తము ప్రవహించుపర్యంత మెట్టి రాక్షసయత్నములచేనైన నెన్నటికేని సత్యభంగమును జేయవలనుపడదని బాగుగఁ దెలియుంగుము.

మదా. నా రాక్షసయత్నములఫలము నీవనుభవించువఱకు, నీయిచ్చవచ్చినరీతి మాటలాడుచుండవచ్చును. (దుర్జయుని జూచి) కోదండుఁ డింకను నా దుర్మార్గుని నేల యిచటికిఁ దీసికొనిరాకయున్నాఁడు (సిపాయీలను జూచి) మీా రెవరైనం బోయి శీఘ్రముగఁ గొనిరమ్మని చెప్పుఁడు. (ఒక సేవకుఁడు పోవుచున్నాఁడు) (దేవాంగననుజూచి) ఉండుము. విక్రాంతుని రానిమ్ము. వాని నోటినుండి నీయనృతములన్నియు విశదీకరింపఁ జేసి నాకోపోద్రేకమును నీపైఁ బ్రయోగింతును.

దేవా. (స్వగతము) నా కేమియుఁ దోఁపకున్నది. యుక్తాయుక్తవిచక్షణ లేకయున్నదానను, ఈ సమయమున ధైర్యమును వదలఁగూడదు. ఏ యుక్తిచేనైనను నా పతికి జరిగిన విషయములు తెలియునట్లు సంజ్ఞచేయవలయును. (ఆలోచించుచుండును.)

దుర్జ. మహారాజ్ఞీ! కోదండుఁడు విక్రాంతు నిపు డిచటికిఁ దెచ్చును. అపుడు దీని నీ చోటినుండి తొలఁగించి వేఱుచోటికిఁ దీసికొనిపోవలయు. విక్రాంతున కీశిరముఁజూపి గుర్తింపఁజేయునపుడిది యిచట నుండఁగూడదు. మిక్కిలి నేర్పరియగు నిది తన యేర్పాటులను బతికి సంజ్ఞలమూలముగఁ దెలియ జేయక యుండదు.

మదా. బాగు బాగు, దీనిని వెలుపలికిఁ దీసికొనిపొమ్ము.

దేవా. (స్వగతము) నా మీఁది వైరమును వీరు బాగుగ సాధించిరి. అన్నియు ముగిసెను. నా ప్రయత్నములన్నియు నిష్ఫలములైనవి. (భ్రమ చెందుచున్నది.)

దుర్జ. (వినుట నభినయించి) కోదండుఁడు వచ్చునట్లు తోఁచుచున్నది. సేవకులారా! పొండు. త్వరగాఁ బొండు. దీనిని దూరమునకుఁ గొనిపొండు.

దేవా. నే నిచ్చోటినుండి కదలను.

దుర్జ. ఏమి! మిణకరించుచున్నారు. దాని నీడ్చికొనిపొండు. కొట్టుఁడు, తన్నుఁడు (అని దేవాంగనను ముష్టితోఁ బ్రహరించుచున్నాఁడు.)

దేవా. ఎవ్వరైనను నన్ను దాఁకిన వారి మెడఁగులిమి వైచెదను.

మదా. పొండు. దానిని దీసికొనిపొండు. కోదండు నియడుగుల చప్పుడు సమీపమున వినఁబడుచున్నది. కావున దానిని శీఘ్రముగ నీడ్చికొనిపొండు.

దేవా. (గొప్ప ధ్వనితో). విక్రాంతమహారాజా! (అని కేకవేయుచున్నది.)

దుర్జ. ఓరీ! దాని నోరుమూయుఁడు. ఇచ్చోటు దాని కగపడకుండునట్లు చేయుఁడు. ఈడ్చికొని పొండు.

మదా. కోదండా! కోదండా! (సేవకులను జూచి) దీనిని దీసికొనిపొండు.

దుర్జ. కొనిపొండు. కొనిపొండు (సేవకులు దేవాంగనం దీసికొని పోవుచున్నారు.)

మదా. కోదండా! తీసికొనిరమ్మా దుర్జాగ్రశ్వాసమును.

దుర్జ. తీసికొనిరమ్ము. తీసికొనిరమ్ము, నేపథ్యమున "దేవాంగన విక్రాంతా" యని కేకవేయుచున్నది.) దానిని మాటలాడకుండునటులుఁ జూచుకొనుఁడు.

కోదం. (పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు) మహారాజ్ఞీ! గొప్ప మోసము జరిగినది.

మదా. ఏమి? ఏమి జరిగినది?' (దేవాంగన సిపాయీలనుండి వదలించుకొని దర్బారునకు వచ్చుచున్నది. సిపాయీ లామెను బట్టుకొనుచున్నారు.)

దేవా. విక్రాంతమహారాజా! విక్రాంతమహారాజా!

కోదం. విక్రాంతుఁడు చెఱసాలనుండి తప్పించుకొనిపోయెను.

మదా. ఏమి! విక్రాంతుఁడు తప్పించుకొని పాఱిపోయెనా?

దేవా. ఏమి! ఏమి! ఏమి! ఏమి వినుచున్నాను!

కోదం. అవును మహారాజ్ఞీ! ఇప్పుడే విక్రాంతుఁడు చెఱఁదప్పెను.

దేవా. (ఆనందముతో) ఆహా! దేవా! నీకు నాపైఁ గల్గినకృపకై యెంతని కొనియాడుదును?

మదా. మీ రెవరైన నన్ను బట్టుకొనుఁడు. నా తల తిరుగుచున్నది. కోదండా! ఏమి చేసితివి? విక్రాంతుఁడు పాఱిపోవుటయా? చెఱసాల కావలివాండ్ర శిరముల ఛేదింపుము. గొప్ప సంకటము కలిగినది. నాకు సంకటము కలిగించు చంద్రశేఖర కంటకమును దీసి పాఱవేయవలయును. ఆవల విక్రాంతుని నాకు దాసునిగ నొనర్చుకొనవలయును. ఆ విక్రాంతుని సహాయమున నా సార్వభౌమత్వమును స్థిరపఱచుకొను నభిలాష యింతటితోఁ దీఱెను. చంద్రశేఖరుఁడు చేఁ జిక్కక పోయెను. విక్రాంతుఁడు పలాయితుఁ డయ్యెను. ఇఁక నా జీవితము సురక్షితముగ నొనర్చు టెట్లు? ఉండనిండు. నాకుఁ గలిగియుండు కోపమును తుచ్ఛురాలగు నీ దేవాంగనపైఁ బ్రయోగించెదను.

దేవా. అట్లే నీ కోపమును నాపైఁ బ్రయోగింపుము. దానిని నేనుసరకు సేయను.

మదా. పొండు. దీనిని రుద్రమండలికిఁ గొనిపొండు. ఇదివఱలో వినని కనని యాతనలకు దీనిని లోఁబఱచెదను. అపుడు పరుగెత్తిపోయిన విక్రాంతుఁడు నాచరణాక్రాంతుఁడు గాక యెట్లుండునో చూచెద. మఱియు దీనిచే దాఁపఁబడిన చంద్రశేఖరుని విక్రాంతుఁడు నా యధీనము చేయక యెట్లుండునో చూచెద.

దేవా. స్వపత్ని యొక్క సంకటములను జూడఁజాలక స్వధర్మమును త్యజించునంతటి మనస్థైర్యములేని వాఁడు నా పతియని తలఁపకుము.

మదా. మంచిది. చూచెదను. దీని నిప్పుడే యిచ్చటనుండి కొనిపొండు. కోదండా! విక్రాంతుని వెదకుటకై నాల్గుదిక్కులకు పలుగురి నంపుము. నీవును బోయి జాగరూకుఁడవై వెదకుము. ఈ విషయమున సేవకులపైఁ గొంచెమైనను నమ్మకము కలిగియుండుట తగదు. వెంటనే పొమ్ము. (కోదండుఁడు పోవుచున్నాఁడు.) ఆ విక్రాంత పిశాచము నా చరణములయెడ నమ్రభావము వహించునట్లు చేయునఱకు నాకుఁ జిత్తస్వాస్థ్యము కలుగదు.

దేవా. ఈ బ్రహ్మాండమ్ములోని రణధురంధరు లేవీరవతంసుని పేరు వినినంతనే యుద్ధమునకు వెనుదీయుదురో, యెవని యతిమానుషబుద్ధిచాతుర్యమునకు వెఱఁగంది తమ యజ్ఞానత్వమును ప్రశంసించుకొన వారు జడియుదురో యట్టి నాని ప్రాణము నపహరింపఁజాలుదువా? ఓ పిశాచమా! మహత్త్వాకాంక్ష యేల కొనియున్నావు?

శా. ఆరూఢప్రతిమానవిక్రమకళాహంకార తేజోనిధిన్
శ్రీరామ ప్రతిమాన సంగరకళా శ్రేష్ఠప్రతాపోన్నతున్
బారావార గభీరమానసు మహాబాహాబలుం జంపఁగా
నారీ! యెంచుట వహ్నిదివ్వె పురుషార్పంజూచి నవ్వొందదా,

మదా. చూడఁగల పెనిమిది దినములలో. నీ కంటియెదుట నీ పతిచర్మము నొలిచి చంద్రశేఖరుని సజీవునిగ దహింపఁజేయనియెడల నా పేరు మదాలసకాదు. (సేవకులఁ జూచి) పొండు దీనిని దీసికొనపొండు. దీని కుమారుఁడగు నీ యధముని శిరమును గాకగృధ్రముల కాహార మొనర్పుఁడు.

దేవా. సామ్రాజ్యమకుటమును ధరించు యోగ్యతగల యీ చంద్రశేఖరుని శిరము నిట్టిస్థితికి దేనాజ్ఞనిడు. నీవు నీశిరమునుగూర్చి కొంతయయిన విచారించితివా!

మదా. మన స్థైర్యములేని నాడట్టివిచారము గలువచ్చును. బలాఢ్యురాలను సామ్రాజ్యముగలదానను నగు నేనీ యధమ శిరమును నాకాలితోఁ దన్ను చున్నాను. (శిరమును గాలితోఁ దన్నుచున్నది.)

దేవా. ఓ చండాలీ! ఇట్లే నీ శత్రువులచేత నీ శిరమునకుఁగూడ దుర్దశకలుగునుగాక.

మదా. పొండు. దీనిని దీసికొనిపొండు. (దేవాంగనను గొనిపోవుచున్నారు.)

దుర్జ. విక్రాంతునకు స్వేచ్ఛావిహారము కలిగియుండుటచే దేవాంగన నెటులయిన సంకటములనుండి తప్పింప సర్వప్రయత్నములు చేయకమానఁడను భీతి నాకుఁ గలిగియున్నది.

మదా. నన్నుండి దాని విడిపించుటకు వానికేమిశక్తిగలదు? ఈ పులినోటఁ జిక్కిన మాంసఖండమగు దేవాంగనను వాఁడు తప్పింపఁ బ్రయత్నించెనేని వాని ప్రాణములఁ గోల్పోవ సిద్ధుఁడై యుండవలయును.

(అందఱు పోవుచున్నారు.)

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము



## అంకము 2. రంగము 2.

స్థలము. చంద్రశేఖరుని దాఁచియుంచిన గుప్త గృహము.

[ప్రవేశము విక్రాంతుఁడు వేషాంతరమున]

విక్రాం. (స్వగతము) ఎచటఁ జూచిన నిశ్శబ్దముగ నున్నది. అది యేల? మావారిచట నేలకనఁబడకున్నారు? నేనిచటికి వచ్చువిషయము నెఱిఁగియు నా దేవాంగన నాసమక్షమున కేల రాకయున్నది? నా చంద్రశేఖర వసంతు లింతలో నెటుల నిదురపోయిరి? నా యాజ్ఞానుసారము చంద్రశేఖరునిం గాపాడుటకై నా పరివారములతో దేవాంగన వానిని వెంటఁగొని వేఱొండు చోటికిఁ బోయియుండదు గదా? లేక మావారి నెల్లరను మదాలస భటులు బంధించికొని పోయిరియుందురా? ఛీ! ఈ చోటు స్మశానమువలెఁ బాడుపడియుండుట గనిన నామనమునకు సంకట ముదయించుచున్నది. ఏదైన నమంగళకరమైన వార్త నా చెవిని సోఁకునేమోయని తోఁచుచున్నది. (వినుట నభినయించును) లోననెవరో మాటలాడుచున్నారు. అదిగో! ఎవరో యిద్దఱు కరదీపికలను గ్రహించి గృహమధ్యాంగణమున దేనినో వెదకుచున్నారు. వీరిరువురు నిచట నేమిచేయుచున్నారు? వీరి దుస్తులు చూచినమదాలసయొక్క సిపాయీలని తోఁచెడిని. మీ రెవరని యడుగుదునా! వలదు. వారి మాటలనాలకించెదను. (మదాలసయొక్క సిపాయీ లిరువురు చేతఁ గరదీపికలంగొని ప్రేతమును వెదకు చున్నారు.)

మొ సి. ఏమిరా! ఇది భూతచేష్ట కాదుగదా? ఒక గడియసేపులోన నాశవము కనఁబడక పోయెనే? అది యెట్లు?

రెం సి. ఇది చమత్కారముగ నున్నది. ఇప్పుడే కదా వానిని మనము చంపితిమి? దేవాంగన సేవకులలో నెవరో దాని నిచటినుండి తొలఁగించియుందురని నాకుఁదోఁచుచున్నది.

మొ సి. అట్లే నిపుడు కోదండునికిఁ జాల కోపము వచ్చునే? దానికేమి సేయవలయును?

రెం సి. గొప్ప సంకటము కలిగెను.

విక్రాం. (ఒకవైపున) వీరు కోదండుని పరివారములోని వారుగఁ గనఁబడుచున్నారు. వీ రెవని ప్రేతమును గూర్చి మాటలాడుచున్నారు.

మొ సి. ఆ బాలుని పరాక్రమమును జూచి నేనించుక చకితుఁడనైతిని. వానియుద్ధ కౌశల్యమును జూచిన నాకు వీరాభిమన్యుఁడు జ్ఞప్తికివచ్చెను, వాని ఖడ్గవిద్యా నిపుణత యిప్పటికిని నాకంటియెదుటఁ గన్పట్టునట్లేతోఁచెడిని.

రెం సి. నాకు వాఁడు యమునివలెఁ గన్పట్టెను. వాఁడు శరీరముదాల్చిన వీరరస మనితోఁచెను.

విక్రాం. (ఒకవైపున) వీ రేకుమారునియొక్క కీర్తి నింత ప్రశంసించుచున్నారు? ఇట్టిక్షాత్రము వహించి శత్రువులకు యమునివలెఁ గనఁబడిన యీ పరాక్రమ శాలియగు కుమారుఁ డెవఁడు?

మొ-సి. ఆకుమారుని తేజమునుజూచినపుడు వానిపైఁ జేయెత్తుటకు నావలనఁగాలేదు.

రెం సి. నాకు సహితము వానింజూచినపుడు భయముజనించినది. మఱియుఁ దక్కిన సిపాయీలుగూడ నొకక్షణకాలము స్తంభీభూతులై వానినే చూచుచుండిరి.

విక్రాం. (ఒకవైపున) వీరాకుమారుని పేరు చెప్పరేల? నా మనసు వానిపేరు వినుటకుఁ ద్వరపడుచున్నది.

మొ-సి. తుదకెట్లో ధైర్యముచేసికొని యీకత్తితోఁ వానింబొడిచి ప్రాణములఁదీసితి.

విక్రాం. (ఉలికిపడి-స్వగతము) ఆ! ఆకుమారుని హృదయమును గత్తితోఁ బొడిచి వాని ప్రాణమును వీఁడు హరించెనా?

రెం సి. వాని శిరమును ద్రుంచి కోదండుని యధీనము నేఁజేసితిని.

విక్రాం. (స్వగతము) అట్లేని వీరెవరో హంతకులగు చండాలురవలె నగపడుచు న్నారు. కాని, వారి క్రూరకరవాలమునకు బలియైన కుమారుఁడెవఁడు?

మొ సి. అయినది. విక్రమాదిత్య మహారాజు కులము నేఁడంత మొందినది

విక్రాం. (స్వగతము) ఏమీ!, విక్రమాదిత్యుని కులము నేఁడంత మొందినదా? అట్లేని, బాలుఁడగు చంద్రశేఖరుఁ డీచండాలుర కరవాలములచేఁ జంపఁ బడెనా?

రెం సి. చంద్రశేఖర మహారాజు చంపఁబడినందున సూర్యవంశము నిర్మూలమైనది.

విక్రాం- అయ్యయ్యో! ఈ విక్రాంతునియొక్క జీవితమునకు యశమునకును నంతము కలిగెను.

మొ-సి. మనపరాక్రమమునకై మహారాజ్ఞివలన గొప్పబహుమతులు వడయుదము.

విక్రాం. (ఒక దాఁటున ముంకు వచ్చి) ఆగుఁ డాగుఁడు. ఓ విశ్వాసఘాతుకులారా! మీయొక్క పరాక్రమమునకై నావలన మొదటి బహుమానము నొందుఁడు. (ఇరువురను మెడబట్టి క్రిందికిఁ ద్రోయుచున్నాఁడు. "మోసము శత్రువు

మోసము శత్రువు " అనికూయుదురు) అన్నమిడినవాని కపకారమెంచు చోరులారా! మీరుచేసిన పాపకార్యములకుఁ బ్రాయశ్చిత్త మిపుడనుభవింపుఁడు. (మరల నటులనే క్రిందికిఁ ద్రోయుచున్నాఁడు) చంద్రశేఖర మహారాజును దయమాలి చంపిన పాపమున్నకై యిపుడు చావుఁడు. చావుఁడు. తన్నుకొనుచుఁ జచ్చి నరకమార్గము చూడుఁడు. (వారుచచ్చుచున్నారు) (స్వగతము) చంద్రశేఖరుఁడు హతుఁడయ్యెను. కాని వాఁడీ చండాలుర చేతికెట్లు చిక్కెను? దేవాంగన వానిరక్షణకై తగునేర్పాటుల నేలచేయలేదు? దేవాంగనా! దేవాంగనా! ఏమిచేసితివి? నీకుమారుని యందలి ప్రీతికి లోనై రాజహత్యకు నీవెట్లు సిద్ధపడితివి? నీది మాతృహృదయమనునది నిజమే. అయిన, మాతృ స్నేహమువలనఁ గలుగు మార్దవము చూపుటకిది యదనుకాదు. ఇది 'యెటులనీకుఁ దెలియకుండెను? (మృణాళిని లోపలనుండి యితరుల కగపడకుండునటుల జాగరూకతతో వచ్చుచున్నది) వసంతా! నీ వెంతటి భాగ్యహీనుఁడవు? ఓరీ! నీవు చంద్రశేఖరుని రక్షించుటకై శత్రువులచేఁ జిక్కిచచ్చియుండిన మనకులమునకెంత ధన్యత కలిగియుండును?

మృ. (స్వగతము) ఇచటనుండి వారు వెడలిపోయినట్లున్నది. వారిమాటలచప్పుడు వినరాకున్నది. వారి కాళ్లచప్పుడు సహితము వినఁబడలేదు. వారి కరదీపికల ప్రకాశము సైతము కానరాకున్నది.

విక్రాం. (స్వగతము) గతించినది. గతించినది. ఈ విక్రాంతుని శీలము మంటఁగలిసినది. ఎవరికిని మోముచూప నలవికాకున్నది. నా హితులెల్ల నన్ను ధిక్కరింతురు. ప్రజలందఱు నన్ను విశ్వాసఘాతుకుఁడందురు.

మృ. (విక్రాంతునిజూచియులికిపడి)అవ్వైపెవరో నిలిచియుండునట్లు కనఁబడుచున్నది. అవును. నేనిపుడే వెనుకకుఁ దిరిగి లోనికిఁబోవలయును. (లోనికిఁబోవుచున్నది)

విక్రాం. ఎవరు? ఎవ రచటఁ బోవుచున్నది? నీ వెవతెవు చెప్పుము. చెప్పుము. ఆగుము. ఇట్లునిలువుము. ఒక యడుగావలనిడిన నీ విక్రాంతుని కరవాలము నీహృదప్రదేశమునఁ బ్రవేశించునని యెఱుఁగుము.

మృ. (నమ్రభావముతో) ఎవరు? మహారాజా?

విక్రాం. అవును. నేను విక్రాంతుఁడను. అయిన నీవెవతెవు? చెప్పుము, ఆగుము, ఒక యడుగైన నిడకుము, చెప్పుము, త్వరగఁజెప్పుము.

మృ. నేను దేవాంగనను.

విక్రాం. ఏమీ! దేవాంగన-దేవాంగన!

మృ: నేను దేవాంగనను.

విక్రాం. దేవాంగన! దేవాంగన! నా దేవాంగనవా? అయినను౦డుము. నీవు నా దేవాంగన వెట్లగుదువు? (మృణాళిని చేయిపట్టి) చండాలీ! చెప్పుము. నీవు బ్రదికియుండునపుడు చంద్రశేఖరుఁడు మదాలస సేవకుల శస్త్రములచే నెట్లు చంపఁబడెను? ఈ విక్రాంతుఁడు నీపైఁ బూర్ణవిశ్వాసము కలిగియుం డెను. అందులకై నీవిట్టి ప్రాయశ్చితమొనర్చితివా? చెప్పుము చెప్పుము. లేనియెడల నీక్షణముననే యీ కృపాణముచే నేను నీకు స్వర్గమునకు దారి జూపెదను. చెప్పుము.

మృ. చంద్రశేఖర మహారాజు చంపఁబడెనని మీకెవరు చెప్పిరి?

విక్రాం. ఈ యమంగళవార్త కోదండుని సేవకుల మూలమున వింటిని.

మృ. ఈవార్త కల్ల. చంద్రశేఖర మహారాజు సజీవుఁడై యున్నాఁడు.

విక్రాం. ఏమి! ఏమి! ఏమిచెప్పుచున్నావు దేవాంగనా? చంద్రశేఖరుఁడు బ్రతికి యున్నాఁడా? నీవు వాని ప్రాణమును రక్షించియున్నావా? వాఁడిపుడుఁ గూడ పృథ్విపై సురక్షితముగ నానందముతో నున్నవాఁడె?

మృ. అవును. మహారాజా! చంద్రశేఖరుఁడు పృథ్విపై సురక్షితముగను నానంద ముగను నున్నాఁడు. వానిప్రాణముల కేవిధమైన యపాయమును గలుగలేదు.

విక్రాం. ఈ శుభవార్త వినినమాత్రమున నాయానందమునకు మితిలేకున్నది. కాని దేవాంగనా! మదాలసభటుల కరవాలములకు బలియయిన వాఁడెవఁడు? ఎవని పరాక్రమమును మదాలస భటులింతకుమున్ను వర్ణించుచుండిరో యీ బాలకుని పేరేమి?

మృ: మహారాజా! వాఁడు...వాఁడు...వాఁడు...

విక్రాం. చెప్పుము చెప్పుము. ఆబాలవీరుని నామము నే విననిమ్ము. వానిపరాక్ర మముయొక్క వర్ణన విని నాకు వానివిషయమున నత్యంతమైన యాదర బుద్ధి కలిగెను. చెప్పుము. చెప్పుము.

మృ. మహారాజా! వాఁడు వసంతుఁడు.

విక్రాం. ఏమి! వసంతుఁడు! నాకుమారుఁడు వసంతుఁడు. నాప్రియవసంతుఁడు. నాప్రాణమైన వసంతుఁడా?

మృ. అవును. విక్రమశాలియగు తమ కుమారుఁడు వీరవసంతుఁడు.

విక్రాం. హా! విక్రమశాలియుఁ గుమారుఁడు నగు వీర వసంతుఁడు. సరి. ఎవనిశౌ ర్యమును శత్రువులుఁగూడ గొప్పగఁ బొగడిరో యట్టివాఁడు విక్రమశాలి, వీరుఁడు గాక వేఱగునా? బాగు బాగు. బాలవసంతా!

చ. తనయవసంతచంద్ర! వివిధంబుల నిసితకీర్తికాంతులిం
పొనరఁగ దిక్కులం బొదలఁ బొందితి శాశ్వతకీర్తి తల్లికిం
బొనరెను, వీరమాతయను పూజ్యత నాకును మేలు గల్గెనే
మనెదను సింహగర్భమున నారయ మేషకి శోరి పుట్టునే.

భాగు భాగు. నీ తల్లి యుదరమున జనించి, నీయంబను ధన్యురాలిం జేసితివి. నీ తండ్రియొక్క నిర్మల కీర్తి నజరామరముగ నొనర్చితివి. ధన్యుఁడవు! ధన్యుఁడవు! నీవే ధన్యుఁడవు. దేవాంగనా! నీవు ప్రాణసమానుఁడగు నేకపుత్రుని బలియిచ్చి చంద్రశేఖరుని గాపాడితివిగదా! దేవీ! నీశీలమును నేనొకక్షణమాత్రము సందేహించినందులకు నన్ను క్షమింపుము. రమ్ము. రమ్ము. నిన్నొకమారాలింగనము చేసికొందును. నీవొనర్చిన యీ ఘనకార్యమునకై గౌరవింతును గాక. నీపతిమాన రక్షణ మొనర్చినందులకు, నీకుఁ గొన్ని వాక్యములచే ధన్యవాద మొనర్తును. నీవేల దూరముగ నిలిచియున్నావు? రమ్ము. రమ్ము. పుత్రమరణముచే నాకులతనొందిన నీకోమలాంతఃకరణమును నేను శాంతపరచెదను (మృణాళినింబట్టుటకు యత్నించుచున్నాఁడు).

మృ. (కొంచెము దూరమునకువెళ్ళి) మహారాజా! నేను దేవి దేవాంగననుగాను.

విక్రాం. (ఉలికిపడి) నీవు దేవాంగనవు గావా?

మృ. మహారాజా! నేను దేవాంగననుగాను.

విక్రాం. అట్లేని నీవెవరవు? నా దేవాంగన యెచటనున్నది?

మృ. వసంతుని జంపి కోదండుఁడు దేవాంగనాదేవిని బంధించి కొనిపోయెను.

విక్రాం. దేవాంగనను గోదండుఁడు బంధించెనా? అయిన నేనిపుడు వాయువేగమున నచటికేఁగోయి యా నరరాక్షసుని చేతినుండి దాని నొకక్షణమున విడిపించుకొన వత్తును. ఈ విక్రాంతుఁడు జగమున జీవితుఁడైయుండునంతకు దేవాంగనను బంధించి తీసికొనిపోవుట కెవనికి నసాధ్యము, ఇదినిశ్చయము. అమ్మా! కొంచెముండుము. నీవెవరవు. నీ పేరు చెల్పి పున్నెముగట్టుకొమ్ము.

మృ: నేను మృణాళిని.

విక్రాం. మృణాళిని? మృణాళిని యెవరు?

మృ. శ్రీకాంతునికన్య.

విక్రాం. శ్రీకాంతుని కన్యయా? ఏ స్త్రీయొక్క సద్గుణములు సర్వ బ్రహ్మావర్త విఖ్యాతములో? "బాలయోగిని" యని పిలిచి యే స్త్రీయొక్క లోకోత్తరమైన వైరాగ్యమును సర్వజనులు మిక్కిలి యుత్సాహముతో వర్ణించుచు

న్నారో? ఏ స్త్రీ యొక్క యౌదార్యమునకుఁ బాత్రులై ప్రజలాబాలవృ
ద్ధము మిక్కిలి ప్రేమతో నా యమయశోగీతమును బాడుచున్నారో-యా
శ్రీకాంతునియొక్క సద్గుణశాలినియగు నేక పుత్రివగు మృణాళినివా నీవు?
ఆహాహా! ఇట్టి సంకటసమయమున నీవంటి దేవతయొక్క దర్శనము కలుగుట
నాకు గొప్ప భాగ్యమే. "నా కీర్తి మునిఁగిన" దను భ్రమచే నేను జిత్తవైక
ల్యము నొందియుండ దానిపై నానందవార్తలఁ గురిపించి నీవు నన్ను
సుఖింపఁజేసితివి. కావున నేను మిక్కిలి కృతజ్ఞుఁడను. మృణాళినీ! నీకు నేను
నమ్రుఁడనగుచు నభివాదనము చేసెదను. (నమస్కారము చేయఁబోవును)

మృ. ఇదేమి మహారాజా! (దూరముగఁ బోవుచున్నది)

విక్రాం. కాదు కాదు. నీవంటి దేవస్వరూపిణుల ముందు మేము మాశిరముల వంప
వలయును. (నమస్కారము చేయుచున్నాఁడు) ఈ యర్ధరాత్రి వేళ, నీ భయం
కర స్థలమున నీ దర్శనము నాకుఁ గలిగిన దొకగొప్ప శుభసూచకమని
నాకుఁ దోఁచుచున్నది. నేనిప్పుడే దేవాంగనకు బంధ విముక్తి గలిగించు
నేర్పాటులఁ జేయవలయును. మృణాళినీ! చంద్రశేఖరుఁడు జీవితుఁడై
యున్నాఁడంటివే యది సత్యమేకదా!

మృ. అవును. మహారాజా! అది సత్యమేయగును.

విక్రాం. అట్లయిన వానిని నేఁగనులార నొకసారి చూడనిమ్ము. వాఁడుండు చోటికి
నన్ను గొనిపొమ్ము. వానిని జూచి, పిదప సూర్యుఁడుదయింపకమున్నె
దేవాంగనను బంధవిముక్తగ నొనర్పవలయును.

మృ. ముందు దేవాంగనా దేవిని విడిపింపుఁడు. ఆవలఁ జంద్రశేఖర మహారాజు
ను దర్శింపవచ్చును.

విక్రాం. కాదు కాదు, వానిని నాకనులార నొకసారి చూడనిమ్ము. దేవాంగనను
విడిపించువిషయమున నా మనసు రుద్రమండలి రాచనగరు వైపునకుఁ
జెల్లుచుండినను జంద్రశేఖరుఁడు సురక్షితముగ నుండునది చూచువఱకు
నా మదిగుదుటఁబడదు. మృణాళినీ! నన్ను జంద్రశేఖరు నొద్దకుఁగొనిపొమ్ము.

మృ. చంద్రశేఖరుఁడీ ప్రాంతమున లేఁడు. దూరస్థలమునకుఁ బోయియున్నాఁడు.

విక్రాం. వాఁడెంత దూరమేనిం బోయియుండునుగాక. నేనొకసారి వానిఁ జూడవల
యును. లెమ్ము. నన్ను వాఁడుండు చోటికిఁ దీసికొనిపొమ్ము.

మృ. అట్లయిన నేను దేశయాత్ర చేయుట కిపుడే సిద్ధము కావలయును.

విక్రాం. దేశయాత్రకు సిద్ధమా?

మృ. అవును. చంద్రశేఖరమహారాజును జూచుటకుఁగూర్గుదుర్గమునకుఁ బోవలయును.

విక్రాం. కూర్మదుర్గమునకుఁ బోవలయునా? చంద్రశేఖరుఁడు కూర్మదుర్గమునకుఁ బోయియున్నాఁడా?

మృ. అవును. చంద్రశేఖరమహారాజు కూర్మదుర్గమున సరోజిని యతిథిగనున్నాఁడు.

విక్రాం. చంద్రశేఖర మహారాజు కూర్మదుర్గమురాణి సరోజిని యతిథియా? ఆయమ్మ యొద్ద వాని నెవరప్పగించిరి?

మృ. నేను జేసితిని.

విక్రాం. ఔరా! గొప్పతప్పు చేసితివి. అంతయు నాశనమయ్యెను. మృణాళినీ! చంద్రశేఖరుఁడు మదాలసచేఁ జిక్కఁగలఁడు. నా సర్వమనోరథములకు భంగము కలిగెను.

మృ. ఏమి? మీ రేలయట్లు చెప్పుచున్నారు?

విక్రాం. నేనేమి చెప్పుదును? ఆ దుర్గమునఁ జంద్రశేఖరుఁడు ప్రవేశించుట మదాలసా రాక్షసియొక్క గుహాయందుఁ బ్రవేశించుచున్నట్లయగును. మృణాళినీ! కూర్మదుర్గముయొక్క యధిపతియగు దుర్జయుండు పెడత్రోవఁ ద్రొక్కి మదాలస పక్షము నవలంబించినాఁడు.

మృ. దుర్జయుఁడు మదాలస పక్షము నవలంబించెనా?

విక్రాం. అవును. ఆ విశ్వాసఘాతుకుఁడే మదాలసకు గుప్తస్థలము నెఱింగించి మనల నిన్ని సంకటములకు లోఁబఱచెను.

మృ. అయ్యయ్యో! అటులయిన నావలన నెంతటి కష్టము సంభవించినది?

విక్రాం. ఈశ్వర సంకల్పము నాకోరిక యీడేరఁగూడదనియు సూర్యవంశ సింహాసన మింకఁ గొంతకాలము స్థిరభావము వహింపఁగూడదనియు నుండిన నేనేమి చేయువాఁడ?

మృ. మహారాజా! సరోజిని విశ్వాసఘాతుకురాలగునని నాకుఁ దోఁపదు.

విక్రాం. మృణాళినీ! ఆయమ్మ పతిప్రేమ పత్నీధర్మము ననువానికంటె రాజనిష్ఠ యధికమని యెఱుఁగదు.

మృ. మహారాజా! ఆయమ్మను జిఱుతప్రాయమునుండి నేనెఱుఁగుదును. ఆమె నాకు బాల్యస్నేహితురాలు. పతిస్నేహమునకులోఁబడి రాజద్రోహ మహాపాపమునకుఁ బాల్పడునని నాకుఁ దోఁచుటలేదు.

విక్రాం. మృణాళినీ! నీవు మిక్కిలి యుదారస్వభావముగలదానవు. కాఁబట్టి నీ కిటుఁ దోఁచుట సహజమే. ఇపుడు మనవాగ్వాదమునకు సమయముగాదు. కాలము మీఱుచున్నది. నేనిపుడే వెడలి చంద్రశేఖరుని సరోజినినుండి తప్పించి

నావశము చేసికొనవలయును.

మృ. మహారాజా! సరోజనివలన చంద్రశేఖరుని ప్రాణమున కేయపాయమును గలుగదు. ఈవిషయమున మీరునిశ్చింతగనుండుఁడు. మనమిపుడు వెడలి దేవాంగనా దేవిని బంధవిముక్తంగాఁ జేసి వత్తము. ఆ దుష్టరాలగు మదాలస యాయమ్మ నెట్టి దుర్దశపాలొనర్చునో తెలియకున్నది.

విక్రాం. ప్రాణమునకన్న మిన్నయగు నేకపుత్రుని గోల్పోయినదానికంటె మించిన దుర్దశయేదికలదు? అంతటి విపత్తునే శాంతముతో నంగీకరించెను. ఆమె మదాలసా దుష్టకృత్యములచే సంకటముల నొందునని నాకుఁ దోఁచుటలేదు. దేవాంగనయొక్క విక్రమ ధైర్య సాహసములయందు నాకు సంపూర్ణ విశ్వాసము గలదు. నేను బోయి యామెను గాపాడువఱకుఁ దన్నుఁ గాపాడుకొను శక్తి యాయమ్మకు సంపూర్ణముగఁగలదు. ఒకచో దురదృష్టవశమున వైపరీత్యము గలిగినను వానినోర్చుకొందును. ఏదెట్లుండినను మొట్ట మొదట సరోజని నుండి చంద్రశేఖరునిం గైకొనవలయును.

మృ. మహారాజు ముసలన్నైన నేఁబోయి సరోజని యొద్దనుండి చంద్రఖశేరుని గొనివత్తును:

విక్రాం. వలదు వలదు. ఆయమ యొద్దనుండి నేనే కొనివత్తును.

(లోపల సేవకుఁడు 'అమ్మా!' యని పిలచును).

విక్రాం. ఎవరు లోపలఁ బిలుచువారు?

మృ. వాఁడు నాసేవకుఁడు. దేవాంగనా దేవికి సంకటము లేవియో కలుగనున్న వని కందనునిచే నెఱిఁగిన వెంటనే విశ్వాస పాత్రులయిన యిరువురు సేవకుల తో నిచ్చటికి వచ్చితిమి., మేము వచ్చునంతలో భయంకర విషయములన్ని యు జరిగినవి. మేము వసంతుని శవము నెత్తికొని పోవుచుంటిమి. రాణి సేవకు లా శవమును గొనిపోవుటకై యిచటికి వచ్చిరి. అందు కొఱకు మేమందఱము కొంతకాలము లోననుండవలసివచ్చెను.

విక్రాం. అయిన వసంతుని శవము సురక్షితముగ నున్నది గదా. నన్నొకసారి కన్నులారఁ జూడనిమ్ము, నాప్రియ కుమారుఁడు గావించిన పరాక్రమము నకై నాయశ్రుధారలవానిపైఁ బ్రసరింపఁజేయుదును.

మృ. ఇదె చూడుఁడు. నాసేవకులు దాని నెత్తికొని వచ్చుచున్నారు. (సేవకులు శవమును దెచ్చుచున్నారు).

విక్రాం. (శవమునుద్దేశించి) బాలా!

ఉ॥ ఏమని చెప్పువాఁడ వనజేక్షణ! నీ చరితంబులుజ్జ్వల
స్తోమములౌచు భాసిలఁగ, స్తోత్రము చేయఁగలేక శేషుఁడుం
దామది సిగ్గునొంది భువి దాల్చు నెపమ్మున మాటునుండఁగా
భూమిని నున్న మానవులెపోల్తురు నీసుగుణంబులెన్నఁగా॥

నీ యుజ్జ్వల చరిత్రమునకై నీతండ్రియగు నాకత్యానందము కలుగుచున్నది. శత్రువులచే యుద్ధమున మడసినందులకు నీతండ్రి మిక్కిలి గౌరవమునకుఁ బాత్రుండగుచున్నాఁడు. నిన్ను గౌరవించుటకై యొసఁగఁగల వస్తువు లేవియు నీ సమయమున నాయొద్ద లేవు. శాస్త్రప్రకారము నీచరమ క్రియ లొనర్చుటకును నాకిప్పు డవకాశములేదు. దీనికొఱకు నన్ను క్షమింపుము. కాని యుద్ధమునఁ జచ్చిన వీరులకు నేను జేయుచుండు మర్యాదలను నీకును జేసెదను. (కరవాలము చేతధరించి వాని కాళ్లను ముద్దిడి తనపైనున్న వస్త్రమును శవముపైఁ గప్పును.) బాలా! నేనుబోయివత్తును. పరమేశ్వరుఁడు నీకు సద్గతి నొసంగుఁగాక (మృణాళినింజూచి) మృణాళినీ! నేను బోయివచ్చెదను. ఈ ప్రేతమునకుఁ జేయవలసిన సంస్కారములను నీవు బాగుగఁ జేయుదువని నమ్ముచున్నాను.

మృ. మహారా జీవిషయమున నిశ్చింతగ నుండవచ్చును.

విక్రాం. నేను నీకు మిక్కిలి కృతజ్ఞుఁడను. నీవలననైన ప్రయత్నములనొనర్చి దేవాంగనను బంధవిముక్తను జేయుము. దేవాంగన కష్టసుఖములను నీకప్పగించియున్నాను (పోవుచున్నాఁడు)

మృ. (స్వగతము) ఆహాహా! ఏమి యితని యంతఃకరణముయొక్క యౌన్నత్యము! పుత్రుఁడు మరణ మొందియున్నాఁడు. పత్ని క్రూరశత్రువుచేఁ జిక్కియున్నది. ఇట్టి సమయమున నెట్టివాఁడును దనకుఁ గర్తవ్యమగు దానిని గణన చేయఁడు. అట్లుండియు నీమహాత్ముని చిత్తము కర్తవ్యమునుండి యించుకైనఁ జలన మొందలేదు. ఇతని నీతిధైర్యాదుల నెంతయుఁ గొనియాడవలయు. తన లోకోత్తరగుణములచే నన్ను మోహింపఁజేసియున్నాఁడు. దైవసంకల్ప మత్యాశ్చర్యముగ నున్నది. ఈ బాలుని తలిదండ్రులు సజీవులైయుండియు, నన్యనగు నాకు వీనిప్రేత సంస్కారాదులఁచేయు బాధ్యత కలిగినది. దీనిని నేఁబరమ భాగ్యమని తలఁచుచున్నాను. రాజకార్యసాధనమునకై ఖడ్గయుద్ధమునఁ బ్రాణములఁ గోల్పోయిన యీ చిఱుతని గొప్పతనమునుగూర్చి నే నెంతని ప్రశంసింతును! నా పూర్వసంచిత పుణ్యము లిపుడు ఫలించినవి. లేనియెడల నీ పుణ్యాత్మునిసేవ నాకెటుల లభించును? (వసంతునిజూచి) బాలా! వసంతా! నీపై నాకెంతేయుం బ్రేమజనించియున్నది. నీ యాత్మయజ్ఞము తలఁ

చిన నా హృదయ ముప్పొంగుచున్నది...నాకు గద్గదస్వరము కలుగుచున్నది ......నా నోటినుండి మాటలు వెలువడకున్నవి. ఈశ్వరుఁడు నీకుఁ బర లోకమున సుఖ మొసంగుఁగాత. నా యశ్రుధారలు మాతృస్నేహమునఁ గలిగినవని భావింపుము. (వాని కాళ్లపైఁ బడును.)

(ప్రవేశము - సేవకుఁడు.)

సేవ. దేవీ! మనము శీఘ్రముగ మరలిపోవలయును. వీని యంత్యసంస్కారముల ముగించి దేవాంగనా దేవిని విడిపింపం బోవలసియున్నది.

మృణా. అగును. పొండు. వృథాకాలయాపనమునఁ బ్రయోజనములేదు. (స్వగతము) మితిలేనిసంపద యనంతసుఖవిలాసములు వీని నన్నిటి నొకక్షణమునఁ దొలఁగించి కర్తవ్యము కై కొంటిని. ఇట్టి మహావిరక్తిని నాకెవ రుద్భవింపఁ జేసిరి? సంపూర్ణసుఖమగు నీ లోకము తృణప్రాయముగఁ దలఁచు నంతటి మనోభావమును నాకుఁ గల్పించిన సమర్థుఁడగు గురువెవఁడు? ఎవఁడను నాలోచనయేల? ఎవని గుణగణముల వత్సరద్వయముగ గానము చేయుచున్నానో యతని సామర్థ్యమే యిది. మహారాజా! ఇపుడే మీ యాజ్ఞానుసారము దేవాంగనను విడిపించుటకై పోవుచున్నాను. మీ కెచటనుండినను నా నమస్కారములు మీ చరణారవిందములఁ బొందునుగాక. (భూమిపై శిరమువంచి నమస్కారము చేయుచున్నది.) మహారాజా! మీ యాశీర్వాద బలమున నేఁ బూనినకార్యము యశోదాయక మగునుగాక. ఒకవేళ దురదృష్టముచేత విపరీతములేవైనంగలిగినను నాపై మీ కృపావలోకన మేనాటికిని బూర్ణముగ నుండవలయును నేను స్వర్గమునకుఁ బోవలసివచ్చినను నా దృష్టి మీ చరణముల విడనాడదు.

(పోవుచున్నది.)

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము

అంకము 2. రంగము 3.

స్థలము:—మదాలస దర్బారు: (ప్రవేశము. మదాలస - దుర్జయుఁడు మొదలగువారు.)

**మదా.** ఏమనెదరు? ఈ నాలుగు దినములు నత్యంతకష్టములకు లోఁబఱచియు దేవాంగన త్రోవకు రాకున్నదా?

**దుర్జ.** లేదు మహారాజ్ఞీ! ఆస్త్రీ మిక్కిలి సమర్థురాలు, దానిం జయించుట యసాధ్యము. "చంద్రశేఖరుఁడు చచ్చె"నని స్థిరముగ నెల్లప్పుడు నుడువుచున్నది.

**మదా.** మోసకత్తియ! ద్రోహి! నన్నే మఱిపింపఁ బూనుచున్నది. నా కంట మన్నుఁ జల్లఁ జూచుచున్నది. దీన గే నేమఱుదాననుగానని దృఢముగఁ దెల్పుఁడు. నేను దానిని జిత్రవధగావించి ప్రాణములఁ దీయుదును. దాని నోటినుండి చంద్రశేఖరుని వృత్తాంతము వెలిఁదీయక మానను. నాతోడ నా హాతము? కృతాంతస్వభావ నగు నా యెడనా యిట్టిపట్టుదల సాగఁగలదు? యంత్రమున నునిచి దీని యెముకలు చూర్ణమగునట్లు చేసెదను. దానిం ద్వరగ నిచటికిఁ దీసికొనిరండు. (దుర్జయుఁడు సేవకుఁడు పోవుచున్నారు.) (స్వగతము) దానిమాటలు సత్యములా? లేక దుర్జయునిమాటలు విశ్వసనీయములా! నా మనము చంచలత నొందియున్నది. దానిమాటలే సత్యములయిన దుర్జయుఁడు మోసముచేసి యుండవలయును. కాని యది సత్యమని తోఁచుటలేదు. దుర్జయునిమాటలు నిష్కపటములని యూహించిన నెన్నికష్టములకైన నోర్చి తాను నుడువు నన్నృతములు సత్యములని వాదము చేయు దీనిచర్యలుచూచిన నా కాశ్చర్యము గలుగుచున్నది. ఇట నాశ్చర్యమేమున్నది? నాకు సంకటము గలిగించి తన రాజద్రోహమును గప్పిపుచ్చుటకు దాని కింతకంటె వేఱుమార్గములేదు. దుర్జయుఁడే సత్యమాడుచున్నవాఁడు. చంద్రశేఖరుఁడు నిక్కముగ బ్రతికియే యున్నవాఁడు. దేవాంగన చెప్పునదెల్లను సంపూర్ణాసత్యము. దీనసందేహ మేమియు లేదు. (దుర్జయుఁడు సేవకుఁడును దేవాంగనను దీసికొనివచ్చుచున్నారు) దేవాంగనా! ఇప్పుడైనఁ జంద్రశేఖరుఁడుండు చోటు తెలియఁబరచెదవా?

**దేవా.** చంద్రశేఖరుఁడుండు స్థలము...అదె! అచట...స్వర్గమున.

**మదా.** దేవాంగనా! ఇప్పటి నీ వ్యవహారము మితిమీఱుచున్నది. నీ చేసిన కార్య

ములకుం దగుశిక్ష శీఘ్రమున ననుభవింతువు.

దేవా. ఎటులయినఁ గానిమ్ము. ఇంతవఱకుఁ గావించిన కష్టములను రెండింతలు, నాలుగింతలు పదింతలు కావింతువు. అంతియకదా! నీ పిశాచ హింసలకెల్ల నేను సిద్ధముగనే యున్నాను. అట్లుండ నీ వలన నా కేమిభయము?

మదా. నిన్ను జిత్రవధచేసి ప్రాణములఁ గడపటహరింతును. దీనింబాగుగ నెఱుఁగుము.

దేవా. ఓసీ! నేను జచ్చుట కెప్పుడును సిద్ధముగనేయున్నాను. పుట్టినవారెల్ల గిట్ట వలసినవారలే. నీవు మహారాజ్ఞివగుటచే నీకమరత్వము గలుగునే?

సీ. భూదేవిఁ బీడించి పాలుపుగాంచెదనన్న కనకాక్షుఁ డేమేలు గాంచఁగలిగె
ప్రబలుఁడై ప్రహ్లాదు బాధించిన కనకకశిపుఁ డేమేలును గాంచఁగలిగె
తనకడ్డ మెవరంచు వనితలఁ జెఱఁగొన్న పౌలస్త్యుఁ డేమేలుఁ బడయఁగలిగె
హింసాకరుండైన కంసుండుగోపుల హింసించియేకీర్తి యొసఁగఁగలిగె

గీ. చానవాహిత మాలింప మానితేని
నీవుమాత్రము చిరకాల జీవివగుదె
మంచిచెడుగుల నూహించి మనఁగవలదె
గడచి బ్రతికినవారలు పుడమిఁగలరె.

నేటి నాగతి రేపు నీకు నగుననుట మఱువకుము.

మదా. నాక్రోధ మతితీవ్రమగుటచే నీశవమునకు సహితము సద్గతిగలుగదు. దానిని గృధ్రములును, శునకములును దుండెములుగావించి భక్షించు నట్లొనర్తును.

దేవా. నీ యిష్టానుసార మొనర్పుము. ప్రాణహీనమైన యీ కళేబరమును గుక్కలు తినిననేమి! మనుష్యులు తినిననేమి; మఱియు నీ శరీరము పరోపకారమున కుపయోగించెనను సంతసము నాకు స్వర్గమునఁ గలుగును.

మదా. చూడుము. చూడుము. దేవాంగనా! నా కధికముగ నాగ్రహము గలిగింపకుము. నా యెదుట నీపట్టుదల సాగదు. నేను గొప్ప హఠవాదినిని.

దేవా. అటులయిన నీహఠ మెంతదూరముపోవునో చూచెదను. ఈ దేహమున నిదివఱకే సగముప్రాణము పోయెను. నీకేమాత్రము హఠముకలదో నాకు నామాత్రముగలదు. కాన నీవైనను నాకు లోఁబడవలయు. నేనేని నీకు లోఁబడవలయు. ఇదివఱకు నీదురాగ్రహస్వభావమునుగూర్చి యించుక వినియున్నాను. ఎప్పుడేని నీతో సమముగ నాగ్వాద మొనర్పవలయునని యిచ్ఛకలిగియుంటిని. దైవానుగ్రహమున నట్టి తరుణమిప్పుడు తటస్థించెను. నీవు గొప్పదానవో నేను గొప్పదాననో యను పరీక్ష నిపుడు తుదివఱకుఁ జూచెదను. మనము సమానపరిస్థితియం దుండలేదు. నీవు రాక్షసగుణముల గల్గి నాకు సమానురాలవు గావలయునని యెంచుచున్నావు. నే నేకాకిని

ననహాయురాలనయినను జింతలేదు. ఎట్టి స్థితియందున్నను నే వెనుదీయను. చేయుము. నీవు చేయఁదలఁచిన హింసలన్నియుం జేయుము. నీ యెదుట నిలచియుండు నీ దేవాంగన యించుకైనను వెనుదీయదు.

మదా. ఉండు మయోగ్యురాలా! మదాంధములయిన నీ కన్నులఁ దప్తలోహ శలాకలచేఁ బొడిపించెదను.

దేవా. ఆహా! ఇది మిక్కిలి మంచికార్యము. ఏలన? ఆవల నీయట్టి యధమాధమల ముఖావలోకనము లేకపోవునుగదా!

మదా. నిన్నింతవఱకు మాటలాడనిచ్చుట నా వెఱ్ఱితనము.

దేవా. ఓసీ! సత్యమును రాజనిష్ఠ సఫలతనందుట యొక సతికి గొప్ప భాగ్యమగునుగదా! కాఁబట్టి యనేక కష్టములు సంభవించి, యా కష్టముల మూలమునఁగాని యయ్యది సఫలతనందదు.

మదా. మిక్కిలి యుత్తమము. నీ రాజనిష్ఠకు సంపూర్ణసాఫల్యము నేనొసంగుచున్నాను. మదాంధయు యోగ్యతాహీనయు నగు స్త్రీ రాజనిష్ఠావేషము ధరించి యున్నది. అది యీలోకమునకు గొప్ప యుపదేశకారిణిగాఁ దలఁచుచున్నది. దుర్జయా! స్వాభిమానము రాజభక్తియను వెఱ్ఱితనముంగల దీనికన్నుల వాఁత వేయింపుము. (దుర్జయుఁడు దేవాంగనను దీసికొనిపోవుచున్నాఁడు.)
ఔరా! దాని యభిమానమేమి? ఆత్మవిశ్వాస సంజాత మతిభ్రమణమేమి? నీతిధైర్యములయొక్క గౌరవమేమి? ఇది నన్ను వాదమునజయించునట్టి శక్తి కలిగియున్నదఁట? నన్నవమానపఱచునఁట! దేవాంగనా! నీ వెంత గొప్పదానవైనను......నీయందు నత్యగుణ మెంత స్థిరముగనున్నను మదాలస యీ విషయమున జయింపఁబడదు. మార్దవము సైఁతము వహింపదు. వెనుదీయదు. దేవాంగనా! ఎట్టి భయంకర పాపకార్యములనైనను జేసియేతీఱును. నిన్నుబీల్చి పిప్పిచేయును. నీ సద్గుణములు నిస్తేజములయి నీవు నా చరణాక్రాంతురాలు గావలయు. లేక నీవు నామమాత్రావశిష్టయైనం గావలయు. వేఱుమార్గములేదు.

(పోవుచున్నది.)

రంగము ముగియుచున్నది.

## అంకము 2. రంగము 4.

స్థలము:— మదాలసయొక్క యుద్యానవనమున నొక పార్శ్వము.

(అంధురాలయిన దేవాంగనను సిపాయీల కావలియందుంచి దుర్జయుఁడు నిలచియుండును.)

**దుర్జ.** దేవాంగనా! నీయంతకాలము సమీపించియున్నది. ఇప్పుడైనను బాగుగ నాలోచింపుము. మఱియు నీ హారమును నీయుము.

**దేవా.** ఛీ! ఆ మాట లిపుడెందులకు? ఎంతకాలము హింసలకు లోఁబడవలసియున్నను మదాలసచే నీ దేవాంగన జయింపఁబడదు. ఇఁక నా యాయుఃపరిమితి పూర్ణముగాఁ బోవుచున్నది. నాకు మరణకాల మాసన్నమైయుండ, నేను మదాలసకు నమ్రతవహింతునా? ఛీ! ఎప్పట్టునసేనియునిది కానిపని.

**దుర్జ.** దేవాంగనా! బుద్ధిశాలినియగు తరుణివి నీవీసంకటములకై విచారమునొందక యుండుటచూచిన నాకు హేయభావము జనించుచున్నది.

**దేవా:** నీవంటిరత్నము మానవకోటియందుఁ బ్రకాశించుచున్నపు డిట్టి సంకటములు తప్ప మఱేవి కలుగఁగలవు? కాని యీ విషయమున నాకేమాత్రము దుఃఖములేదు. సర్వదుఃఖపరిహారిణియగు మృత్యుదేవత నా సమీపమునకు వచ్చుచున్నది. ఈ యాత్మ యెన్నియో జన్మములుకడచి మానవజన్మ మందుచున్నది. ఈ జన్మముయొక్క యంతమునఁ గొంత దుఃఖము కలిగినందున జన్మమంతయు దుఃఖకరమని నే నేల యెంచవలయు? ఇఁక నఱగడియలో మానవాధికారమున కతీతమగు స్థలమును జేరనున్నాను. మీతో నాకుఁ గావలసినపని యేమున్నది? నాకుఁ దఱచుగఁ దొందరగలిగింపకుము. ఇఁక నీదయ నా కావంతేనియు నక్కఱలేదు.

**దుర్జ.** సరి. (సేవకులను జూచి) మీరీ! పంజర కవాటములఁ దీయింపుఁడు.

**సేవ.** మీరిటురండు. వారీకవాటములను దెఱవఁబోవుచున్నారు.

**దేవా.** క్రూరమృగములుండు పంజరకవాటములను దెఱచివేయుఁడు. వానిని నా శరీరముపై వదలుఁడు. దేవాంగనయొక్క మాంసాదుల భుజించి దానికిఁ బుణ్యమొసఁగు పరిస్థితి యీ మృగములకుఁ గలిగినందున వానికి సగౌరవముగ నభివాదన మొనర్చుదానను. అదె చూడుఁడు. దేవాంగనలు నా యాగమనమును నిరీక్షించుచున్నవారు. అచటికి నన్నుశీఘ్రముగఁ బోనిండు.

**దుర్జ.** నీ తుదిమాట లెవరికేనిం జెప్పవలయునే?

**దేవా.** నా తుదిమాటలు నీతో నుడువవలయునే? పొమ్ము. నీతో నుడువఁదగిన

దేదియులేదు. కాని యాగుము. మదాలసకు నే నుడువువార్తల నెఱిఁగింపుము. కేవలమభిమానగర్వితయగు దానికిట్లుచెప్పుము. "ఏస్త్రీతో బద్ధమత్సరవైతివో యే స్త్రీని శరణాగతురాలింజేయ నీ యాసురప్రయత్నములం బ్రసరింపఁ జేసితివో యాస్త్రీ యా దేవాంగన యావిక్రాంతమహారాజు పత్ని కడవఱకు నీక జేయురాలై యుండెను. మఱియు మరణసమయమునందుఁ గ్రూరమృగములచే దాని యవయవము వేఱువేఱుగఁ దినఁబడుచుండు సమయమందును, నిన్ను దుచ్ఛముగ ధిక్కరించి తనకుఁగల్గిన విజయమువలని యానందమున నవ్వుచుండె"నని.

(మదాలస ప్రవేశించుచున్నది.)

మదా. ఏమీ! దేవాంగనా! మరణసమయమందు సైఁతము మదాలసను ధిక్కరించి యానందమున నవ్వుచుండుదానవా?

దేవా. అగును. మన యిరువురిలో జరిగిన హఠయుద్ధమున నే జయించుటచే నానందసాగరమున నిమగ్నురాలనై నవ్వుచునే మరణింపఁగలదాన.

మదా. కాని యీ యానందమును నీవనుభవించుటకు నేను దావొసఁగను. నీ వవమానముచే యాతనలకు లోఁబడి దుఃఖముచేఁ బీడింపఁబడి చత్తువు. నా దృఢవైరిణికి మరణకాలమునఁగూడ సుఖానుభవమా? అదియు నేను శక్తిహీననుగాక నీయెదుట నుండునపుడా! నా ప్రాణముపోయినను నది జరుగ నేరదు.

దేవా. ఈ దేవాంగన కవమానమా! నన్నవమానపరచు నట్టి ధీరులెవరు?

దుర్జ. నేనే యాధీరుఁడను, చూడుము. దేవాంగనా! ఇదె చూడుము. దుర్జయుఁడు మదోన్మత్తమగు నీ మస్తకము తన పాదముచేఁదన్నుచున్నాఁడు. మదాలసా మహారాజ్ఞి శత్రులశిరముల కిట్టిపాటేకలుగవలయును (ఆయమ శిరమును గాలితోఁ దన్నును) పొమ్ము. ఇపుడానందమున మునిఁగి నవ్వుచుఁ బ్రాణముల వదలుము. (మదాలసను చూచి) దేవీ! మీ రిచటనుండి వెడలుఁడు. మన మా వైపున నిలిచి దాని యాతనలఁ దిలకింతము. (మదాలస దుర్జయుఁడు దూరముగఁ బోవుచున్నారు.)

దేవా. (దుఃఖసహితమైన భ్రమతో) (స్వగతము) తన్నుటయా! శిరముపైఁ గాలితోఁదన్నుటయా! ఈ దేవాంగన శిరముపై నీచండాలుఁడు గాలితోఁ దన్నుటయా! అయ్యయో! నే నానందమునఁ జావఁగూడదను దుష్టాశను దాను గడవఱకు నెఱవేర్చుకొనెను గదా! నే నీ యవమానము నెవరితోఁ జెప్పుదును! దీనికిఁబ్రతిక్రియ యొనర్చుట కెవరిని బ్రార్థింతును.

ఉ. నిరతము నీపదాబ్జముల నేమదిభక్తి భజించుచుండ సం
బరమున భక్తవత్సలతఁ బ్రాపున నొసంగక యుంటఁబాడియే
కరమపదార్థమేమి ననుగావవు నీచుఁడు దుర్జయుండిటుల్
పదములఁదన్నె నీవతని భంగమొనర్పుము నందనందనా.

ఈ మానవపిశాచములతో నిండిన యీ స్మశానమువంటి స్థలమున నాయార్త స్వరముఁ నాలకించి యెవరు పరుగిడి వత్తురు ? దేవా! జీవితకాలమంతయు గౌరవముతోఁ గడపిన నాకు మరణకాలమున నవమానము నొందునట్లు నుదుట వ్రాసియుండుటకు నేనేమి పాపమొనర్చితిని ?

దుర్జ. (ముందునకువచ్చి) ఏమి పాపముచేసితివా ? మదాలసా మహారాజ్ఞియెడ దృఢవైరమను పాపము నీయెడఁగలిగినది. అందుల కిది ప్రాయశ్చిత్తము.

దేవా. దుర్జయా ! నీచా ! ఏ స్త్రీయొక్క కృపచే మదాంధుఁడవై నీ వీ దేవాంగన నిట్టి యమానుషసంకటములకుఁ బా లొనర్చితివో! యా యభాగ్యురాలి పాదతాడనమునకు నీ మస్తకము...కాని పొమ్ము. పొమ్ము. నీవంటి క్షుద్రకీటకమునకు మరణసమయమున శాపమొసంగి నా పవిత్రమైనవాక్కును గళంకితముగ నొనర్చుకొన నొల్లను. దుర్జనులకై యేర్పడిన శిక్షను భగవంతుఁడు బాగుగ జరుపుఁగాక.

మదా. (ముందటికివచ్చి) నీవు సంతసించినను, బరితపించినను, దలపగులఁగొట్టికొనినను నా కార్యము ముగిసినది. నీ యవమానము, నీ దుఃఖము, నీ యాతన నా కనులారఁజూచితిని. నీవు పరితపించుటచూచి నా కత్యానందము గలిగినది. నా నేత్రములకుఁ దృప్తికలిగినది పొమ్ము. ఇపుడానంద సాగరమున నిమగ్నురాలై నీ యిష్టానుసారము క్రూరమృగములకు భక్ష్యయోగ్యవగుము. నీ వ్యర్థజీవితము నంత్యమొందింపుము. (దుర్జయునిజూచి) దుర్జయా ? రాజగృహమునకు మరలిపొమ్ము. (సేవకులఁతో) సేవకులారా ! మృగములను వదలుఁడు.

దేవా. (ఎలుగెత్తి) ఓ బ్రహ్మావర్తములోనుండు జనులారా ! వినుఁడు ! విక్రాంతమహారాజు పత్నియగు నీ దేవాంగనయొక్క యీ కడమాటవినుఁడు. బంధువులారా ! నాకుఁ గలిగిన క్రూరకష్టముల నవమానముల వినినతరువాతను దాసీనులరై యుండఁజనదు. ఇది యీ దేవాంగనకు మాత్రము గల్గిన యవమానముగాదు. మీ యెల్లరకు నోర్వరాని యవమానమని తలంపుఁడు. బ్రహ్మావర్తమునందలి ప్రతాపశాలురగు వీరుల శౌర్యమునకుఁ గలిగిన యవమానము. ధీమంతుల బుద్ధికిఁగలిగిన యవమానము. తేజోరాసులగు సాధువుల తపశ్చర్యకుఁగలిగిన గొప్ప యవమానము. కనుక లెండు.

జాగ్రత్తతో నుండుఁడు —— గొప్ప కలహము గావించి రక్తపాతమున నానంద
మొందు నా మదాలస నధః పతితురాలిం గావింపుఁడు.
రాజద్రోహమునకు సిద్ధుఁడైన యీ దుర్జయుని ద్రొక్కివేయుఁడు. సర్వజగ
త్తునందు సంచారమొనర్చు సమీరా! బ్రహ్మావర్తములోని ప్రజలందఱు నా
కడమాటను వినునట్లు కృపచేయుము. సర్వవ్యాపియగునో యాకసమా! నా
సందేశమును బ్రచండ ప్రతిధ్వనిమూలమున బ్రహ్మావర్తమందలి సకలస్థావర
జంగమములకు వినిపింపుము. (నేపథ్యమునఁ గ్రూరమృగములయొక్క గర్జన.)
రండు. రండు. క్రూరమృగములారా! రండు. మీకు స్వాగత మొసంగుట
కీ దేవాంగన మీరాక నెదుఱు చూచుచున్నది.

రండు. దుర్జయుని పాదతాడనమున నపవిత్రము గావింపఁబడిన యీ దేహ
మును మీనిశిత నఖదంష్ట్రలచేఁ జించి ఖండఖండములుగఁ జేయుఁడు.
(క్రూరమృగములు గర్జించుచు వచ్చుచున్నవి.)
విక్రాంతమహారాజా! నేఁ బోయివత్తును. మీ చరణములకు నే నొనర్చు
తుది నమస్కారముల నందుకొండు. బాలా! చంద్రశేఖరా! ని న్నాశీర్వ
దించుచున్నాను. చివఱకు నీకే జయముగలుగును. (క్రూరమృగములు
నలుదెసలనుండి యామెపైఁ బడుచున్నవి. గాయములు గావింపుచున్నవి.
దేవాంగనమాంసము నవి భక్షింపుచున్నవి. అపుడు మృణాళిని తన సేవకు
లతో వచ్చి క్రూరమృగములఁ జంపి దేవాంగనను వానినుండి తప్పించుచున్నది.
తద్రక్షకులు కూలఁబడుదురు. మృణాళినీ సేవకులు వారిని జంపుదురు.

మృ. (మరణోన్ముఖురాలై క్రిందఁబడియుండు దేవాంగనను మెల్లగ లేవనెత్తును.)
దేవాంగనా దేవీ! దేవాంగనా దేవీ!

దేవా. ఎవరు! ఎవరు! ఎవరు నన్ను బట్టుకొనియుండునది? ఇంత ప్రీతిపూర్వక
ముగ నన్ను బిలుచువారెవరు?

మృ. దేవాంగనా దేవీ! నేను శ్రీకాంతునియొక్క పుత్రికయగు మృణాళిని.

దేవా. శ్రీ కాంతునిపుత్రికయా! బాలయోగినియగు మృణాళినియా! ఇట కేల
వచ్చితివి!

మృ. నిన్ను విడిపించుటకై వచ్చితిని.

దేవా. నన్ను విడిపించుటకా? ఇచటనుండి నన్నెట్లు విడిపింపఁగలవు? ఇది వ్యాఘ్ర
ములయొక్క గుహ. అట్లొకవేళ నన్ను విడిపించినను, దానివలనఁ గలుగు
ప్రయోజనమేమి? నా కింక నొకగడియలోన మరణము గలుగనున్నది.
కావున నన్ను విడిపించుటకంటె నీ యంకముపై నాశిరమునిడి సుఖముగఁ

జావనిమ్ము. (మృణాళిని యంకమిచ్చును. ఇతరులు చుట్టు నిలఁబడుచున్నారు.)

మృ. దేవీ ? మమ్మెల్లరం దుదకు నీవు వదలిపోయెదవా ?

దేవా. తల్లీ! మార్గాంతర మేదియులేదు. నా శరీరమున శక్తి యింతయులేదు. మదాలసా దుష్కృత్యములచే నా దేహమీవఱకే శక్తిహీనమయ్యెను. ఇపుడీ మృగములచేష్టలచేఁ బ్రాణములు పోవుస్థితియందున్నాను. కాని నా మనస్సు స్వగౌరవమును వదలకయున్నది. ఈ శక్తిహీనమగు నస్థిపంజర మా కష్టముల నోర్వలేదు. అందులకు నైతము నాకు దుఃఖముగలుగలేదు. కాని మృణాళినీ! నాకుఁ దుద కవమానము గలిగెను. ఆ కారణమున నేనీ జగమునందు జీవించుట యసాధ్యమాయెను.

మృ. నీకా యవమానము గలిగెను ?

సేవ. దేవాంగనాదేవికే యవమానము కలుగుటయా? ఈ బ్రహ్మావర్తమునందలి పూజనీయయగు దేవత కవమానముగలిగెనా ? అట్లెవరవమానించిరి !

దేవా. దుర్జయుఁడు – ఆ యధమచండాలుఁడు నా శిరమును దన్నెను.

సేవ. అయ్యయో ?

దేవా. మృణాళినీ ! బాంధవులారా ! విక్రాంతమహారాజా ! చంద్రశేఖరమహారాజా ! బ్రహ్మావర్తములోనుండు సర్వప్రజలారా ! నాకు జరిగిన క్రూరకష్టముల నెల్లర కెఱింగింపుఁడు. బ్రహ్మావర్తములోని ప్రతిస్త్రీ హృదయమునందు నీవిషము నాటనిండు. ప్రతి మనుజుఁడును గోపోద్దీపితుఁడు గావలయును. బ్రహ్మావర్తములోని ప్రజల రోషానలము మూర్తీభవించి మదాలసాదులను దగ్ధమొనర్పనిండు. ఎల్లభటుల కరవాలము లా చండాలుర నఱకుటకై యొరలనుండి వెలువడనిండు. సకలనిర్జీవ వస్తువులు నైతము జీవయుతములై వారు చేసిన భయంకరకార్యమునకుఁ బ్రతిక్రియ నొనర్చుటకై క్రోధావేశమున మిన్ను మన్నొక్కటిగఁ జేయనిండు. నారక్తసిక్తమగు చీర చెఱఁగుచించి మీ కిత్తును. ఆ చెఱఁగును జంద్రశేఖరుని పతాకగ నొనరింపుఁడు. అది రణరంగమం దెల్లపుడును జయము నొసఁగును.

దానిక్రింద యుద్ధమొనర్చు నొక్కొకవీరునికి నతులపరాక్రమము గలుగును. నేను మృతిచెందినపిమ్మట మీ చర్యల సూక్ష్మశరీరముతోఁ జూచుచుందును. రాజనిష్ఠాపరులై శత్రునిర్మూలనకార్యము మీ రొనర్చువఱకు నేను స్వర్గము నందను. చంద్రశేఖరుని కొఱకును, సూర్యవంశము కొఱకును, బ్రహ్మావర్తము కొఱకును, నేపురుషులేని నేస్త్రీలేనిందమ సర్వస్వము త్యాగముచేయుటకు సిద్ధమగుచున్నారో వారిని నాబిడ్డలవలెఁ గాంతును. సంకటసమయముల

వారిని రక్షింతును. మృణాళినీ! విక్రాంతమహారాజునకు నా కడసారి నమస్కారముల నందింపుము. చంద్రశేఖరునికి నా యాశీర్వాదముల నొసంగుము. వాని శిరమును బ్రహ్మవర్త సామ్రాజ్యమకుట మలంకరించునంతవఱకీదేవాంగన వానికి రక్షకయై దేవతారూపమున వానిపైఁ బ్రేమాతపత్రమును బట్టుచుండును. మృణాళినీ! నీ పవిత్రచరణములపై నా హస్తములనిడి కడసారి రాజభక్తి ప్రతిజ్ఞ నుచ్చారణ చేసెదను. ఈవిశ్వమెల్లెడలవ్యాపించియుండు దేవతలు దీనికి సాక్షులగుదురుగాక. పరమేశ్వరుఁడొకఁడే దానిని సఫలముగఁజేయ సమర్థుఁడు. రమ్ము. ఇపుడు నా యొద్దకు రమ్ము. నా కాలమంతమొందుచున్నది. అదె చూడుము. ఆకసమున దేవాంగనలు నా యాగమనమునకై యుత్సాహముతో నెదురుచూచుచు నిలఁబడియున్నారు. రమ్ము. నేను నిన్ను గడసారి యాలింగనము చేసికొందును. నేను బ్రతికియుండునపుడు మనకుఁ బరిచయములేదు. కాని యిపుడు మనము తోడఁబుట్టువులవలె భావించుకొందము. నిన్ను గాఢాలింగనము చేసికొనుచు నా ప్రాణము వదలెదను. అప్పుడు నాకు మిక్కిలి సంతోషము కలుగును. నేను ధన్యురాలనైతిని. బంధువులారా! నాకు సెలవొసంగుఁడు. విక్రాంతమహారాజా! విక్రాంతమహారాజా! (ప్రాణము పోవుచున్నది. అందఱామెకు నమస్కారము చేయుదురు.)

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము

## అంకము 3 రంగము 1

స్థలము :—కూర్మదుర్గము నందలి రాచనగరు.

[ప్రవేశము. విక్రాంతుఁడు - సరోజిని సర్దారులు మొదలగువారు.]

విక్రా. సరోజినీ ! నీ విట్టి కష్టతరమైన యేర్పాటులలోఁ జాలుగొనకుము. చంద్రశేఖరుని నాయధీనము చేయుము.

సరో. మహారాజా ! నన్ను క్షమింపుము. నేనొకసారి చంద్రశేఖర మహారాజునకు నా గృహమున నాశ్రయ మొసఁగియున్నాను. అచట నుండి యతనిని నేనెటుల వెడలింతును ? ఇది క్షత్రియధర్మమున కుచితమా ?

విక్రా. సరోజినీ ! పతిప్రేమను నిరోధించి క్షత్రియధర్మమును గాపాడుట యసాధ్యము.

సరో. నా పతిప్రేమ నన్ను విశ్వాసఘాతుకతకు లోఁబఱచునా ?

విక్రా. ఆ ప్రేమ బలాత్కారముగ నెట్టిపాపములనేనిం జేయింపఁగలదని నా విశ్వాసము.

సరో. పతిద్రోహిని గాకుండుటకై రాజద్రోహి నగుదునని తలంచితి రే ?

విక్రా. రాజద్రోహమునకు సిద్ధురాలవనినేఁ జెప్పలేదు కాని నీపతియగు దుర్జయుని యాజ్ఞకు లోఁబడి రాజద్రోహమునకు సిద్ధము కావలసివచ్చును. అట్టి సందర్భమున నా రాజకార్యమునకు హానికలుగకుండుటకై చంద్రశేఖరుని నాకప్పగింపుమని వేడుకొనుచున్నాను.

సరో. దుర్జయునకు సద్బోధనచేసి యతని నావశముచేసి కొందును.

విక్రా. ఈ యాశవ్యర్థము. దుర్జయుని బుద్ధి మార్పుసెంది యున్నది. కాఁబట్టి యది కాఁజాలఁదు. ఇదివఱకే చంద్రశేఖరుని నీయొద్దనుండి కొనిపోయి యుండునేమోయని తలంచితిని. కాని యీశ్వరుని కృపచే వాఁడిచట సురక్షితుఁడుగ నున్నాఁడు. నేను జెఱనుండి తప్పించుకొనిన పిమ్మట నన్ను మరల బందీకృతుంగా నొనర్పఁగోదండునికి మిక్కిలి సహాయమొనర్చెను. నా మిత్రుల వాసస్థలముల నెల్ల నెఱిఁగి నేనచటనుందునను సందేహముచే వాని నెల్ల మదాలససేవకులచే ముట్టడి వేయించి యున్నాఁడు. నలుదెసల నాక్రమించియుండు కోదండుని సేనలబారినుండితప్పి మూఁడుదినములలోఁ జేరఁగల యీ కూర్మదుర్గమునకు వచ్చుట కెనిమిది దినములు పట్టెను. ఇట్టి కార్యములకు సిద్ధుఁడైన వాఁడు నీకు లోఁబడునని నాకుఁదోఁపదు.

సరో. నావంశము యొక్క సత్యపరిపాలనారూప కీర్తిని దొలఁగింప సిద్ధను గావలయునే ?

విక్రా. అటుగాదు. నేఁజెప్పునట్లుజరిపిన నీ వంశకీర్తిని గాపాడఁగలుగుదువు!

సరో. మహారాజునకు నావాక్యమున నమ్మకములేని యెడల నేనేమిచేయఁగలను!
(ఒక సర్దారునితో) విజయసేనా! చంద్రశేఖర మహారాజుందోడ్కొనిరమ్ము.

మొ-సర్దా. మహారాజ్ఞి యొక్క నిశ్చయము నిర్ధారణ మైనదా?

సరో. విక్రాంత మహారాజు నాజ్ఞ నేనెట్లు మీఱుదును?

మొ-సర్దా. మా రాజనిష్ఠకుఁ బరీక్షాసమయ మబ్బెనని సంతసించుచుంటిమి.

రెం-సర్దా. ఆదుష్టమదాలసనుండి కాపాడుటకై మాకృపాణము లొరలనుండి వెలువడియున్నవి. ఇపుడు మరలఁ జాల కష్టముతో నొరను జొన్పవలయు:

మూ-సర్దా. రాచనగరు వెలుపలనుండు ప్రజలకు మిక్కిలి వైరస్యము కలుగును.

సరో. మీ యందఱ యుత్సాహము, నాశయు భంగపఱచు దౌర్భాగ్యము నేడు నాకుఁ గలిగినది. నాకు వే ఱుపాయము లేదు. నేను బరాధీనురాలను.

విక్రా. మీ యుజ్జ్వల రాజనిష్ఠను జూచిన మిక్కిలి సంతోషము కలుగుచున్నది. ఇట్టి వారల ప్రవర్తనమున సందేహమందెడి నాకు సిగ్గగుచున్నది. కాని, నే నేమి చేయుదును? మనస్సాక్షికి విరుద్ధముగఁ బ్రవర్తించుట నావలనఁ గానేరదు. మిత్రులారా! క్షమింపుఁడు. మీ యెడల సందేహముకలిగి మీమనస్సుల నొప్పించు చున్నానని నాపై నిష్ఠూరపడకుఁడు.

మొ-సర్దా. అదె చూడుఁడు. జనులందఱు నుత్సాహముతో నెదురు చూచు చున్నారు. చంద్రశేఖరుని కొనఁగు జయ శబ్దములచే బయలు నిండియున్నది. కూర్మదుర్గము లోని ప్రజల కిటీవలఁ గొన్ని వత్సరముల కాలముగనిట్టి ప్రచండ తరోత్సాహ మెన్నఁడును గలుగలేదు.

రె-సర్దా. (కొంచెము వెలుపల వచ్చి) ఇదేమి? ఇదేమి కోలాహలము? వీరందఱు నొక వైపుననిలచి యెవనికోదారి నొసఁగు చున్నారు.

మూ-సర్దా. వాఁడు. కందనుఁడు.

విక్రా. ఎవఁడు. కందనుఁడా? ఏల వీఁడు భయవ్యసనములచేఁ బీడింపఁబడినవాని వలె నగపడుచున్నాఁడు?

సరో. వాని చేతనుండు నాపతాక యేమిటి? దానిపైఁ గనఁబడు చిహ్నమేమిటి?

విక్రా. ఇది-మంగళ చిహ్నమని తోఁచుటలేదు. ఎట్టి యశుభవార్త గొనివచ్చునో?

(కందనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కంద. సరోజినీరాజ్ఞి యెచటనున్నది!

సరో. నే నిచటనే యున్న దానను. ఇదేమి? నీకేమిసంభవించినది?

విక్రా. కందనా! నీవేల యిటు దుఃఖమునకు లోనైతివి?

కంద. ఏమీ! విక్రాంత మహారాజా? అయ్యయో! మహారాజా! హత్యజరిగినది. ఆరాక్షసి తనవైరమును సాధించుకొనెను.

విక్రా. అదేమిటి? ఏమి? నీ వాడున దేమిటి?

కంద. మహారాజా! ఆ భయంకరవార్త నేఁజెప్పఁజాలకున్నాను.

విక్రా. భయంకరవార్తయా?

కంద. ప్రాణములకంటెఁ బ్రియమైన వారివిషయమగు ఘోరవార్త భయంకరమే

విక్రా. ప్రాణములకంటెఁ బ్రియమైన వారివిషయమగు ఘోరవార్తయా? అట్లే నాదేవాంగనకేదేని విపరీతము సంభవించెనే?

కంద. అగును. దురదృష్టవశమున నావార్త దెలుపవలయుట నానుదుటవ్రాసి యున్నది.

విక్రా. అట్లనిన?

కంద. దేవాంగన యీ భువినిలేదు. ఆయధము లామెం ఘోరముగఁ జంపించిరి.

విక్రా. అయ్యయో? దేవీ! వసంతునితోడ నీవును నన్ను విడిచిపోయితివా?

అందఱు. ఈ బ్రహ్మావర్త శిరోభూషణమగు రత్నముం బోఁగొట్టికొంటిమి.

విక్రా. కందనా! నా ప్రియురాలి మరణమునకుఁ గారణభూతుఁ డెవఁడు! ఆ దేవిని జంప వారిలో మదాలస పక్షమున నెవఁ డాయుధ మెత్తెను? ఆ క్రూర కర్ముఁడగు కోదండుని కృత్యమా యిది?

కంద. కాదు. కాదు. మహారాజా! కోదండుని ఘోరకృత్య మిదియైన నాశ్చర్య మేమియులేదు కాని మీ కృపచే వృద్ధినందినవాఁడును, మీ రుదారస్వభావమున నొసంగిన యాశ్రయమువలన నీ జగమున సబాంధవముగ నానందముతో నుండువాఁడు నగు మఱియొక్క యధమాధముఁ డామదాలస యాజ్ఞవలన నా దేవి నాసురరీతి నంత మొందించెను.

విక్రా. చెప్పుము. చెప్పుము. ఆ చండాలుని నామము నాకుఁ జెప్పుము.

సరో. కందనా! చెప్పుము. ఆస్త్రీహంతకుని నామము మాకెల్లరకుఁ దెలియనిమ్ము.

కంద. మహారాజ్ఞీ! నే నేమని చెప్పఁగలను? మీపతి దుర్జయుఁడే యిట్లొనర్చెను.

విక్రా. ఏమీ! దుర్జయుఁ డీకృత్య మొనర్చెనా!

కంద. అగును. మహారాజా! సర్వప్రజాకంటకరూపిణి యగునారాక్షసి దుర్జయునిచే నీ ఘోరకర్మము నాచరింపఁజేసెను.

సరో. ఏమీ! అతఁడా దేవిం జంపించెను! నీవేమో పొరపడుచున్నావు.

కంద. నే నావంతయుఁ బొరపడలేదు. మీ పతియే యీ యపకారమొనర్చెను.

సరో. అయ్యయ్యో! దేవా! నే నేమివినుచున్నాను?

వి(క్రా. దుర్జయా! ఈ పటకు నేఁజేసిన యుపకారమునకు బదులు బాగుగఁ జేసితివి.

కంద. మహారాజా! కృతఘ్నుఁడు, చండాలుఁడు, నీచుఁడగు నాదుర్జయహతకుఁడు మీరొనర్చిన యుపకారమునకుఁ జేసిన ప్రతిక్రియ చెప్పసాధ్యముగానిది. దాని నేఁ జెప్పఁబూనిన మీ మానసములదరును. మీ రక్తనాళములఁ బ్రవహించు నెత్తురుడుకును. మీ చింతలు వానికిఁ జేయవలసిన ప్రతిక్రియలయం దాసక్త మగును. వి(క్రాంతమహారాజా! సరోజనీదేవీ! ప్రజాగౌరవపాత్రులగు నోసర్దారులారా! చూడుఁడు. ఈ పతాకను జూడుఁడు. ఇది దేవాంగనా దేవి మరణకాలమునఁ దన హస్తములచేఁ జించియిచ్చిన చీరచెఱఁగు. దీని పైఁగనఁబడు రక్తచిహ్నములు మోసగాఁడగు దుర్జయుఁడు మదాలస యాజ్ఞ వలన దేవికిఁ గలిగించిన యమానుషకృత్యములను మీకు జ్ఞప్తికిఁ దెచ్చు చుండును గాక. అయిదు దినము లొకేతీరున నహోరాత్రములు నానా విధ బాధలచే దేవతా సమానయగు నొక స్త్రీని, గష్టములకు లోఁబఱచి తుద కాయమ ప్రాణములతోనుండు సమయమునసే క్రూరమృగములచే ఖండఖండములుగ ఛేదింపఁబడి మరణించు నట్లొనర్చుట క్రూర రాక్షస కృత్యముగాదా? ఈ బ్రహ్మావర్తమునందలిప్రజ లేవనితామణిని సాక్షాద్దేవతా స్వరూపిణియనియు, సర్వప్రజాజనని యనియుఁ దలంచుచుందురో యాపరమ పావని, నా యుత్తమశీల, నా దేవాంగన, నా మహారాజు వి(క్రాంతుని పత్ని, నన్ను పానాదు లిడక కష్టపెట్టినవార్త వినిన నెవరికి దుఃఖముకలుగకుండును? ఆడాకిని, యా దేవిని జిత్రవధకు లోఁబఱచిన వృత్తాంతము వినువారికి సంతాపమేల గలుగకుండును? చూడుఁడు. ఈ పతాకను జూడుఁడు. దీనిపైఁ గనఁబడు నొక్కొక రక్తచిహ్నము దేవియొక్క దివ్యశరీరమునుండి స్రవించిన పవిత్రతరరక్తబిందువే యగును. కాల్చిన యినుపసలాకచేఁ గడపటి దినమున దేవియొక్క సుందరమగు నేత్రకమలములను బొడిపించినవాఁడు మనుష్యరూపము ధరించిన యీ పిశాచమే యగును. అప్పుడు స్రవించిన రక్త బిందు చిహ్నములచే నీ పతాకనిండి యున్నది.

వి(క్రా. ఈ పతాకనుజూడగఁ నే నా యంతఃకరణము శాంతినుండి తొలఁగి పోవుచున్నది. నే నూరకుండమన్నను క్రోధము మితిమీఱుచున్నది. నా కరముఖడ్గము దెసఁ బోవుచున్నది.

కంద. మిత్రులారా! ఈచిహ్నములలో నొక్కొకటియు బ్రహ్మావర్తముయొక్క తేజస్సునకును, బ్రహ్మావర్తముయొక్క శౌర్యమునకును, బ్రహ్మావర్తముయొక్క కీర్తికిని, గలిగిన భయంకరకళంకము. ఈ చిహ్నములు, "బ్రహ్మావర్తము లోనివారు నిర్వీర్యులైరి. బ్రహ్మావర్తముయొక్క సత్యగుణము మంటఁ గలిసెను. బ్రహ్మావర్తము నిర్జీవమైనది." యని జగమున గొప్ప ధ్వనితో నుడువుచున్నది. నేత్రములు పోఁగొట్టుకొనిన దేవాంగనాదేవిని క్రూరమృగములకు బలిగ నిల్పిన సమయమున నీ ద్రోహియగు దుర్జయుఁ డా దేవియొక్క మస్తకమును గాలితోఁ దన్నెను. ఆసమయమున.

విక్రా. ఏమి, దేవాంగనా శిరమునా కాలితోఁ దన్నెను?

కంద. అగును. దేవిమస్తకమును గాలితోఁ దన్నెను.

సరో. కటకటా! నేనీదుర్వార్తవినఁ జాలకున్నాను. నాశరీరము వసమఱుచున్నది. పట్టుకొనుఁడు. నన్నెవ్వారేనిం బట్టుకొనుఁడు.

విక్రా. ప్రతీకారము సేయవలయునను రాక్షసవిచారములారా! నాశిరమున స్వేచ్ఛగ సంచరింపుఁడు. క్రోధాగ్ని జ్వాలామాలికలారా! నా మదిని మీ యిష్టానుసారము తాండవము గావింపుఁడు. ఎల్లపుడు శాంతభావమును వదలి యుద్ధోన్ముఖములుగండు. శత్రురక్తమునకై యువ్విళులూరుచుండునో ఖడ్గ దేవతా! క్రోధోద్రిక్తమగు నాసుపులివలె నా దుర్జయుని మెడఁ గఱుక్కునఁ ద్రెంపఁ బొమ్ము.

సీ. పరుషభాషణపాప పంకసంకలితమౌ జిహ్వఁ నుత్తునియలు సేయువఱకు
తుచ్ఛసేవానమ్ర దుర్యశోయుత శిరచ్ఛేదనకార్యంబు సేయువఱకు
క్రౌర్యభీకరకార్య కరణధుర్యకరంబుఁ గఱకుఁగ త్తితోఁ దఱుగువఱకు
భ్రష్టమదాలస భవనంబునభ్రమించు ఘోరాంఘ్రులం ద్రెగఁగోయువఱకు

గీ. ప్రళయనిర్ఘాత సంఘాత పాతసదృశ
రూక్షకరవాల ధారని రుధిరధారఁ
గ్రోలువఱకును నూఱడఁ జాలఁగాన
వచ్చుచున్నాఁడ గాచికో తుచ్ఛమ్లేచ్ఛ.

చంద్ర. విక్రాంత మహారాజా!

విక్రా. ఎవరు? చంద్రశేఖరుఁడా? ఆహా! రమ్ము. నిన్ను దృఢాలింగనము చేసికొననిమ్ము. (కౌఁగిలించుకొనును) (స్వగతము.) నా యాశలకెల్ల నాధారమగు నీ బాలుఁడు సురక్షితముగ నుండుటచూచి నాకు క్షణమాత్రమున దుఃఖములన్నియు దూరములైనవి! దేవా! సూర్యకులముయొక్క జగన్మాన్య సింహాసనముపై వీనిని గూర్చుండఁబెట్టు సుదినము నాకు శీఘ్రకాలమునఁగలుగునా?

చంద్ర. ఎవరు ? కందనా ! నీవుగూడ వచ్చియున్నావా ? దేవియు వసంతుఁడు నెచట నున్నారు ? వారిని నీతోడఁ బిలచికొని రాలేదా ?

విక్రా. (స్వగతము) దేవియు వసంతుఁడా ! వలదు. ఆ సమాచారమును వీనికిఁ దెలియఁజేయుటవలనం బ్రయోజనమేమి ? వీని కోమలహృదయమునకు దానివలన గొప్ప సంకటముగలుగును. (ప్రకాశముగ) బాలా ! నేను గందనుఁడును ని న్నిచటనుండి పిలచికొనిపోవుటకై వచ్చియున్నారము.

చంద్ర. అట్లనిం బోవుదము. ఇదె వచ్చుటకు సిద్ధముగనున్నాఁడను. నేను గూడ మీ రాకను నిరీక్షించుచుంటిని. (సరోజినిం జూచి) మహారాజ్ఞీ ! విక్రాంత మహారాజుతోఁ బోవ నీయనుమతి వేఁడుచున్నాను.

సరో. అనుమతి గావలయునా ? నే ననుమతి నెట్లొసంగఁగలను ? నా కులముయొక్క సత్యాధికమాహాత్మ్యము "నీవు సత్యభంగ మొనర్పకు"మని నాకు స్వర్గమునం దుండి గొప్ప ధ్వని గావించుచున్నది. ఇదె చూడుము. నా దగు నుభయ కులకీర్తి "నన్ను రక్షింపు"మని హీనస్వరమున నాతో మొఱపెట్టుకొనుచున్నది. దేవాంగనయు వసంతుఁడును జేసియుంకు నుజ్జ్వలకార్యములు మూర్తీభవించి నా యెదుట నిలచి వారుండుచోటికి నన్ను రమ్మని మిక్కిలి ప్రీతితో సన్నలు చేయుచున్నవి. ని న్నిచటనుండి పోవనియ్యను. దుర్జయుఁ డొనర్చిన సత్యవిచ్ఛేదనమునకు సంపూర్ణముగ నేను బ్రతీకారము సేయవలయును.

చంద్ర. మహారాజా ! రాణి చెప్ప నదేదియు నాకు విశదముగాకున్నది.

విక్రా. బాలా ! ఆ యమయు, సర్దారులు నిన్ను విడువనేరకున్నారు

చంద్ర. మహారాజా ! రాణియు నీమె సరదారులు నెంతయు గొప్పవారు. ఈ యష్టదినానుభవమాత్రముననే నాకు వీరి స్వభావములు దెలియనయ్యెను. ఈమె యంతరంగము దేవాంగనాదేవీమానసమువలె యపారప్రేమాదార్యముల కాటపట్టు.

విక్రా. బాలా ! అగును. నీవు చెప్పునది నిజము. కాని కొన్ని కారణములచే మన కిచట నుండుట సరిగాదని తోఁచెడిని.

సరో. విక్రాంతమహారాజా ! నా కడపటి ప్రార్థన యిది. ఏమైనం గానిండు. చంద్రశేఖర మహారాజును మదాలసనుండి కాపాడుట కనుజ్ఞ నొసఁగవలయును. నేను నాసర్దారులును వాని విషయమునఁ బ్రాణముల నిచ్చుటకేని సిద్ధముగ నున్నారము. అతని క్షేమమాత్రమును విపత్తురాక కాపాడుదుము.

మొ-సర్దా. మాయందఱి ప్రార్థన యిదియే. మీరు సైన్యము గూర్చుకొనువఱకుఁ

చంద్రశేఖరు నెచటనే నుంచవలయుఁగద. అట్లుండ నిచటన యతఁ డుండనిండు

విక్రా. నే నందులకుఁ గారణము మున్నే తెలిపియున్నాఁడను.

సరో. అట్లే నింక నా మాట వినుఁడు. మీ పాదసాక్షిగనేఁ జేయుశపథ మేమన? దుర్జయుఁడు నా కిది మొదలు దృఢవైరియయ్యెను. నేను నతనియెడ నా రీతినే నడుచుకొందును.

అందఱు. మే మందఱము నాతనియెడ శత్రుభావము వహించియున్నాము.

విక్రా. అమ్మా! నీ కులోకజ్ఞానములేదు. నీ మాట కడపటకు స్థిరముగా నిలువఁజాలదు.

సరో. స్థిరముగ నిలువఁజాలదా?

విక్రా. ఉండదు. స్థిరముగా నుండదు. పతిప్రేమ, పత్నీధర్మము, నిన్ను నూయలకు లోఁబఱచి తుదకు నీకుఁ దోడుగ మమ్ముంగూడ రసాతలమునకుఁ గొని పోవును. కాఁబట్టి వదలుము. నన్ను బోవనిమ్ము. నీ వింతవఱకు మా కొన ర్చినయుపకార మేచాలును. నీకు నేనందులకు మిక్కిలి కృతజ్ఞుఁడనై యున్నాను. మిత్రులారా! నేఁ బోయి వత్తును. ఇఁక మే మిచటనుండుట యుక్తముగాదు.

సరో. మహారాజా! కొంచె మాగుఁడు. మీరు చంద్రశేఖరుని రూపమున నా కులయశము గొనిపోవుచున్నారు. ఈ యశమును గాపాడుకొనుభారము నాపై నున్నది. నేను మిమ్ము నట్లు పోనీయను. ఎట్టి కష్టములు గలిగినను వానినెల్ల నణఁచి తమకులయశము కాపాడుకొనుటయే కులస్థులధర్మము. ఆ దుర్జయునియందలి ప్రేమచే నేనుమార్గముతప్పిన నా స్వర్గస్థులగు పూర్వీజులు నన్నేమందురు? నావలన సత్యభంగము గలిగిన నా పాతకముచే నా పితరులు స్వర్గమునుండి క్రిందఁబడరా? ఈ భయంకరదోషము విఖ్యాతమగు మా కులము నధఃపాత మొనర్పకయుండునా?

విక్రా. సరోజినీ! అటు చేయకుండుట కుపాయ మేమి?

సరో. ఏమి యుపాయమా? ఉపాయము కలదు. దాని నిపుడు ప్రత్యక్షముగఁ జూపెదను. దుర్జయుని పత్నీత్వము నేడే తొలఁగించి వైచితిని. దుర్జయుఁ డేక్షణమునఁ దన గౌరవమునకు హాని తెచ్చుకొనెనో, యా క్షణముననే నేను విధవనైతిని. అతఁడు సత్యభంగముమాత్ర మొనర్చినవాఁడుగాఁడు. సత్యము నకే మృత్యుదేవతగా నున్నాఁడని తలంచుచున్నాను. నా కిఁక నెవఁడును బతిగాఁడు. నే నెవరికిని బత్నినిగాను. ఇదె చూడుఁడు. నా కుంకుమ తిలక మును దుడిచివేసెదను. మంగళసూత్రము త్రెంచివేయ సిద్ధముగనున్నాను.

విక్రా. సరోజినీ! నీవు చేయఁబూనిన కృత్యములు భారతయువతులకుఁ దగనివి. నీ మనోనిశ్చయమునకు మెచ్చితి. నీదృఢాభిప్రాయములు నాకు వెల్లడియాయెను.

సరో. ఇఁకనైన నాయెడ విశ్వాసముదయించెనా ?

సర్దా. మహారాజా ! ఇంకను మూపై సందేహమూ ? వలదు. వలదు. అది మాకుఁ దలవంపులుగ నున్నది.

విక్రా. అట్లే నీకరవాలముపై శపథము సేయుఁడు. సరోజినీ ! నీవు క్షత్రియతనూజవు. రణఖడ్గము క్షత్రియుని ప్రథమకులదైవము. కావున నీవును నీ సర్దారులును దీనిందాఁకి చంద్రశేఖరుని రక్షింతుమని శపథముసేయుఁడు.

సరో. ఈ కరవాలమును సాక్ష్యముగఁగొని నేఁ బ్రతిజ్ఞ యొనర్చెద ? చంద్రశేఖర మహారాజు సేవకై నేను నా సర్వస్వమును నర్పణము సేయుచున్నాను. ఈ ప్రతిజ్ఞనాచేభంగము గావింపఁబడినం బరమేశ్వరుఁడు నాకుఁ బ్రతి జన్మమునందును రౌరవనరకము నిచ్చుఁగాక.

సర్దా. మే మెల్లరము మహారాజ్ఞింబోలె శపథము సేయుచున్నాము. (అందఱు శపథము చేయుచున్నారు.)

విక్రా. సరోజినీ ! లెమ్ము. మిత్రులారా ! లెండు. చంద్రశేఖరుని మీ యొద్ద నప్పగించుటకు సిద్ధముగ నున్నాను. చంద్రశేఖరా ! నేను నిన్ను బిలిచికొనిపోవుటకై వచ్చితిని. కాని నీ విపు డీరాజనిష్ఠాపరుల సహవాసమునఁ గొన్నిదినములు గడపవలయును. కందనుఁడు నీతోడ నిచటనుండును. కందనా ? సమయము గలుగునపుడు చంద్రశేఖరు నేరీతిం గాపాడవలయునను విషయము నీతో నేఁ జెప్ప నవసరములేదు. ఇదె తీసికొనుము సూర్యకుల మణిని. బ్రహ్మావర్త ప్రజలకుఁ గళ్యాణమును గల్పించువాని నీవిక్రాంతుని హృదయగత ప్రాణమును నీ కప్పగించుచున్నాను. వానిని గాపాడుము. మిత్రులారా ! ఈ దేవతాసముక్షమునఁ జేసినప్రతిజ్ఞను భంగము గావింపకుఁడు.

సర్దా. మీరు నిశ్చింతులై యుండవచ్చును. ఎప్పుడును మేము గౌరవచ్యుతినందము.

విక్రా. సరోజినీ ! సర్దారులారా ! ఈ పతాకను మీ కొఱకు నే నిచటన యుంచిపోవుచున్నాను. ఇది రాజగృహశిఖరమున నెగురుచుండనిండు. సరోజనీ ! ఈశ్వరకృపచే నీకుఁ గర్తవ్యములందు వ్యామోహము గలుగకుండునుగాక, దురదృష్టవశమున నట్టి యవసరముగలిగిన నీ పతాకను జూడుము. (కందనుని చేతిలోనుండు పతాకందీసి యామె చేతికిచ్చును.) నే నిఁకఁ బోయి వత్తును. నే నిపుడు చేయఁబోవు కార్యములందు యశమునొంది మరలి వత్తును. అంతవఱకు వీనిని సంరక్షించుభారము మీ పైన నా పరమేశ్వరునిపైనను వైచుచున్నాను. ఆ దీనదయాళుఁ డీవిషయమున మీకందఱకు సహాయము నొనర్చుఁగాక.

అందఱు. అట్లే యగుఁగాక.

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము

అంకము 3. రంగము 2.

స్థలము:—మదాలస రాచనగరునందలి యారామము.

(ప్రవేశము, మదాలసా దుర్జయులు.)

మదా. దుర్జయా! ఒక చక్రవర్తిని నామె యుద్యోగులలో నొకఁడు మోహించుట యా చక్రవర్తిని నవమానించుట యగును గదా?

దుర్జ. ఇవియెల్లను వారివారి మనోభావముల ననుసరించియుండును. అవమానకర మని తలంచువారికట్లే తోఁచును. కొందఱకది యుత్సాహముగనుండును.

మదా. నీవు నన్ను మోహించుట నాకవమానముగ నసహ్యముగనుదోఁచెడిని.

దుర్జ. దేవీ! మీకు నాపై నించుకేనిం బ్రేమలేకుండినను నేను మిమ్ము మనస్ఫూర్తిగఁ బ్రేమించుటలో దోషమేమి? కాఁబట్టి యట్లు నే బ్రేమించుట కనుజ్ఞ నిండు. దాన మీకెట్టి యవమానమును దటస్థింపదు. నాపై దయయుంపుఁడు.

మదా. ఏకత్రానురాగము రసాభాసము. అట్టియెడంగూడ భృత్యభావము మఱువరాదు.

దుర్జ. మనోభావము లెల్లప్పుడు నొకేరీతిగ నుండవు. మీకిప్పుడు నాపైఁ బ్రేమ లేకున్నదే? దైవానుగ్రహమున నదియే మోహముగఁ బరిణమింపవచ్చును. అప్పట్టున నీ భృత్యభావమున కెడముండదు. మీకన్నులకు నేను సార్వభౌముఁడుగఁ దోఁపవచ్చును. మీరు నా ప్రేమయనువలకుఁ జిక్కి నాకుఁ సేవకురాలుగఁ గూడనౌట కంగీకరింవచ్చును. అయ్యో! ఈ జన్మమున నట్టి భాగ్య మొక క్షణమాత్రమైనం గలుగునా? మహారాజ్ఞీ! ఈ దుర్జయునిపై మీ కెప్పుడైన మోహము గలుగునా? మీ మోహపూరితములగు మధుర వచనములు మోహము నావిష్కరించు మీచూపులు, మీ ప్రేమాన్విత కోమలస్పర్శములు నీదుర్భాగున కెన్నడేనిం గలుగునా?

మదా. ఇట్టి స్థితి యెన్నటికిఁ గలుగదని నాకుఁ దోఁచుచున్నది.

దుర్జ. అటులయిన, నే నొక్కొక్క జన్మమునందును మీకు ఋణస్థుఁడనగుచున్నాను.

మదా. అట్లేనిం బ్రేమావేశమునకుఁ జిక్కిన నన్ను నీవు లోఁబఱచుకొని నాపైనధికారము జరుపుటకుఁ బ్రారంభింతువు.

దుర్జ. దేవీ! మిమ్మట్లు చేయవలయునని నే నింతవఱకుఁ దలంపలేదు. ఎప్పట్టునను మీరే నాపై సర్వాధికారములఁ జెల్లింపవలయునని మీ పాదములకడ నా ప్రార్థన. నిజమైనప్రేమ, సేవచేయఁ బ్రేరేపించుఁగాని సేవఁగొన నొల్లదు.

మదా. ఏది యెట్లుండినను నట్టియెడంగూడ నీవు నా ప్రజలలో నొకనివలెఁ జరింపవల యును. నీవు మదాలసకుఁ బ్రియకరుఁడవైనను బ్రహ్మావర్తముయొక్క చక్ర వర్తినికి దాసుఁడనుట మఱువరాదు.

దుర్జ. నే నేస్థితియందైన నుండుటకు సిద్ధుఁడనై యున్నాను. కాని యొకసారియైన మీ కృపారసవృష్టి యీ దీనునిపైఁ బ్రసరింపఁజేయుఁడు. అప్పుడు నేను ధన్యుఁడనైతినని సంతసించెదను.

మదా. అట్లైన నీ ప్రేమ పూజావస్తువులను దెమ్ము. వానిని నేను స్వీకరించెదను.

దుర్జ. ఆహా! నా కమితానందము కలిగెను. ఓ దేవతా!

సీ. నిండుచందురు గెల్చి నీరేజములనవ్వి వరలునెమ్మోము సౌభాగ్యగరిమ
కలికెత్రాచును హసించి గండుతుమ్మెదఁ గెల్చి వెలయుచుండెడునీదు వేణితీరు
శుకతతిబెదరించి సుధనీరసమొనర్చి యొప్పు నీపలుకుల గొప్పఁదనము
మత్తేభమును దేర్చి మదమరాళముఁ దీర్చి పరఁగు నెన్నడకల భవ్యతయును

గీ. బాగువర్ణింప వేనోళ్ల వాఁడఁ గాఁగఁ
గాంచ వేగండ్ల వాఁడను గాఁగఁ గోరు
వాఁడ నీసొంపును వచింప వలనుపడునె
యందములప్రోవ మరుగెల్చు చుందువీవ.

ఈ సుగంధమగు పుష్పగుచ్ఛమును నీ వేణియందుంచెదను.

మదా. పుష్పమునకంటెఁ బ్రియకరమగు ప్రేమసూచకవస్తువు వేఱొండు భువినిలేదు. కాని యుండుము. నీవు దానిని నా వేణియందుంచుటకు నే నొల్లను.

దుర్జ. అది యేల? స్త్రీలకుఁ బుష్పములచే నీ రీతిగనే ప్రేమపూజ సేయవలయును.

మదా. నా శిరమును స్పర్శించుటకు నీకు యోగ్యతలేదు. నీవు ప్రేమపూజచేయవల యునని నీ గుచ్ఛమును నా చరణములకడ నిడుము.

దుర్జ. మీ చిత్తము. ఈ దాసుఁడు మీ యాజ్ఞ నల్లంఘింపఁడు. (ఆమె కాళ్లపైఁ బుష్పగుచ్ఛము నిడును.) దేవీ! ఎల్లపుడు నిదేరీతిని మీ కృపారసము నాపై నుండుఁగాక. (మదాలస చేయిపట్టఁబోవును.)

మదా. దూరమున నుండుము. నా శరీరమును నీవు స్పర్శింపఁదగదు.

దుర్జ. మీ యీ యుదారహస్తమున నొక ముద్దు.

మదా. నా చేయి ముద్దిడ నే నంగీకరింపఁజాలను. నా చరణారవిందములచేఁ బావన మైన యీ యుర్వీతలమును నీవు ముద్దిడవచ్చును.

దుర్జ. అట్లే. మీ యాజ్ఞ నాకు శిరసావహింపఁదగినదిగదా? నేడు కాకపోయినను

మున్ముందు మీపైఁగల గాఢానురాగము కతన, మీ చేతికి ముద్దిడుభాగ్యము నొందుదునను నమ్మకము నాకుఁ గలదు. (భూమిని ముద్దిడును.)

మదా. దుర్జయా! దురపేక్షాలేశమేనిలేని నీ భక్తి కెంతయు సంతసించి నీదెసఁ బ్రసన్నురాలనైతిని. రమ్ము. నా చేయి పట్టుకొనుము. ఆ లతాకుంజమునకు నన్ను దోడ్కొనిపొమ్ము. అచటి వేదికపై నే నాసీన నగుదును. నీ యిష్టానుసారముగఁ బుష్పములతోఁ బ్రేమపూజ యొనర్పుము. (వాని చేతియందుఁ దన చేయిడును.)

దుర్జ: (చేయిపట్టుకొని) నే నీ దినమున గృతార్థుఁడనైతిని. మెల్లగ రండు. మహారాజ్ఞీ! ఇటు రండు. (వా రిద్దఱు పోవుచున్నారు. మఱియొక వైపునఁ గోదండుఁడు ప్రవేశించుచున్నాఁడు.

కో. (స్వగతము) ఔరా! ఇదేమి యన్యాయము! ఇదేమి యాగడము! వీఁడీమెకరముం బట్టుకొనుచున్నాఁడు. ఈమెయు నందులకు సమ్మతించెను. ఇప్పుడు వీ రిరువు రాలతాకుంజమువైపునఁ బోవుచున్నారు—ఆహా! వీఁడీమెను శిలావేదికపైఁ గూర్చుండఁజేసి యచటి తీఁగలనుండు పుష్పములచే నలంకరించుచున్నాఁడు. కట్టా! ఈనీచుఁడు పూలదండ దీని జడయందిడుచున్నాఁడు. చెవిని బుష్పము లిడు నెపమునఁ గపోలమును దాఁకుచున్నాఁడు. మెడలోఁ బూలదండ వైచుచున్నాఁడు. ఈ చండాలియు వీని లీలలకు లోఁబడి మిక్కిలి ప్రేమతో నవ్వుచు నానందము పొందుచున్నది. దీనిని నేఁజూడ శక్తుఁడఁగాకున్నాను. ఈ చండాలితన కపటకార్యములెల్ల సిద్ధినొందుటకు ముఖ్యకారణమగు నన్ను దన కార్యములు ఫలించి పిదప నేమఱింపనెంచుచున్నది. మదాలసా! మదాలసా! దీని పరిణామము నీకు సంతృప్తికరముగ నుండదు. ఇపుడు విక్రాంతునితో సమానముగఁ బోరుసల్పవలయు సమయము తటస్థించియున్నది. ఇట్టి యదనున నన్ను విరోధిగఁ జేసికొనిన, నీవు పాతాళమునకే పోవలసివచ్చును. శక్తి హీనుఁడగు నీ దుర్జయుఁడు నీకుఁ బ్రయోజనకారి గాఁజాలఁడు. చీ! చీ! ఈ యయోగ్యుఁడు దాని చేతుల ముద్దిడుచున్నాఁడు. ఇది స్వయంకృతాపరాధము. తన్నుగట్టఁ ద్రాళ్లు తానే తెచ్చికొన్న ట్లీదుర్జయు నిట్టిపదవికి వచ్చునట్లు నేనే చేసితిని. నా చేతులార నొక గొప్పశిలను స్వయముగఁ నా శిరముపై వైచికొని నట్లయ్యెను. ఇపుడు దుర్జయు నాపదవినుండి తొలఁగించు టెట్లు? ఇంకఁ గొంతకాలము వీఁడు దీనితో నీరీతినుండిన మదాలస నా చేయిదప్పును. సరి. ఇది యిచటికే వచ్చుచున్నది. బాగు బాగు. మిక్కిలి బాగుగ నున్నది. దీనికిబుద్ధి చెప్పుటకు సమయము దొరకెను. కాని యా

హీనుఁడు దీనింజూచుచునే యున్నాఁడు. ఇదియు వీనిని జూచి నవ్వుచునే
యున్నది. మానహీనఁ మోసకత్తియ (మదాలసతిరిగిచూచి నవ్వుచువచ్చును.)

మదా. (స్వగతము) వేఁటాడుటకు మంచి మృగము చిక్కియున్నది. ఈ బాణము
నకు విషమును బ్రయోగించి యీ కోదండునిపై —(కోదండునిజూచి యులికి
పడును) ఈ కోదండుఁ డిచటనేల నిలఁబడియున్నాఁడు? ఇతనికిఁ గొంచెము
కోపము కలిగినట్లున్నది. లతాకుంజమున జరిగిన విషయమును వీఁడు చూచి
నట్లున్నది. ఆహా! అంతయు మేలేయగును. (దగ్గఱకుఁబోయి) ఏమి
కోదండా! నీ ముఖము నేఁడు తేజోవిహీనముగా నున్నది.

కో. (వంగి) మదాలసా! నీతో స్పష్టముగా మాటలాడుటకంటె మార్గాంతరము
లేదు. నీవు శీఘ్రకాలమున నన్ను వివాహముచేసికొనిన మేలగును. లేకున్న
దీని పరిణామము వేఱువిధముగ నుండును. ఇదిసరిగాదు. మహారాజ్ఞీ పదవీగౌర
వముల నీ వెల్లప్పు డనుభవించుచుండ నేను నీ సమక్షమున నమ్రభావమునఁ
"జిత్తము చిత్త"మని నుడువుచుండుట నాకు లజ్జాకరము. దీనిని నేనోర్వఁజాల.

మదా. కోదండా! ఇట్లు కోపగించుకొనకుము. ఈ చంద్రశేఖరునివలనఁ గలిగిన కష్ట
ములు లేకుండిన మన మనోరథములపుడే యీడేరియుండునుగదా! నే నేమి
చేయుదును? వేఱుమార్గము లేకపోయెను. నీ కన్నివిషయములు దెలిసి
యుండియు నీవు నాపైఁ గోపగించుట విచిత్రముగనున్నది.

కో. ఛీ! నీ కావంతయు నాపైఁ బ్రేమలేదు. ఇపుడు నీవు నిక్కముగ దుర్జయు
నిపై మోహముగొని యున్నావు. కాకున్న నన్నువదలి వానితో రహస్య
ముగ ముచ్చటలాడుటకు నీకుఁ బ్రొద్దుచాలకయుండునే? ఇపుడు నే నిచటికి
వచ్చిన సమయమున మీ రిరువు రేకాంతమున సంతోష సూచకములగు
మాటల రహస్యముగ నాడుచుంటిరి. నాతో నొకటి రెండు మాటలనైనఁ
బలుకుటకు నీ కవకాశముండుటలేదు. వానితోఁ గాలపరిమితిలేక నవ్వుచు
మాటలాడుచున్నావు! వానివలనఁ బ్రేమపూజ కైకొనుచున్నావు. అది
యునుగాక వాఁడు నీ చేయి ముద్దిడ నీ కించుకయు బిడియములేకున్నది.

మదా. కోదండా! కోదండా! నీవు మాటలాడునదేమి! ఈ మదాలసయొద్ద నిట్లు
కఠినోక్తులాడుటకు నీకేల జంకు కలుగలేదు?.

కో. చాలును. నీవు మానహీనురాలవు. నీవు నాకుఁ జూపిన యాశలకు లోఁబడి
నేను నా సర్వస్వమును వ్యర్థముగ నాశము చేసికొంటిని. దానికొఱకు నాకుఁ
బశ్చాత్తాపము జనించుచున్నది. నీ మనోరథము లీడేరినవి. ఇపుడు నన్ను
గూర్చిన చింత నీకేలయుండును? నీవు సుందరయువతివి; యౌవనపురుషుఁడు

నిన్ను ప్రేమించుటకుఁ బ్రారంభించినపు డనాగరకుఁడు ముదుసలియు నగు నేను నీ మనసున కెట్లు నచ్చుదును?

మదా. కోదండా! ఆ దుర్జయునిమీఁదనా నాకుఁ బ్రేమయుండుట! ఆ హీనుఁడు మానహీనుఁడు, నా పాదధూళిని దన మస్తకముపై ధరించుకొను సేవకుఁడు. అట్టి వానిమీఁదనా నాకుఁ బ్రేమయుండుట! చీ! చీ! అసత్యము! అసత్యము! ఎప్పటికి నసత్యము. వానిచే నా కార్యములు సాధించుకొనుటకై నేను వానిపైఁ గృత్రిమప్రేమ నభినయించుచున్నాను. నిజమాలోచించిన వాని నీ రీతిగనే నా వలలోఁ జిక్కించుకొనవలయునని నీవు నాతో నొకప్పుడు చెప్పియున్నావు. కావున వృథాసందియము నీ కేల?

కో. సరి సరి. మీ రిరువు రాలతాకుంజమున నాసీనులై మీ యిష్టానుసార మానందలీలలయందుండుట నేను నా కనులారఁ జూచినపిమ్మట సైఁతము సంశయింప కెట్లుందును? నీ మాటల నేను విశ్వసింపను. మదాలసా! వాని కులమునుజూచికదా వానితో స్నేహమొనర్ప నెంచియున్నావు! వాఁడు సుందరుఁడైనను, దరుణవయస్కుఁడైనను, రాచకొలమున జననమొందకయుండినచో వానిని లక్ష్యముచేసియుండవు. కాకున్న నా కంటె వానికేమి యోగ్యతయున్నది? నేను దరుణవయస్కుఁడఁ గాకున్నను, లావణ్యము నన్ను వదలియుండినను ధీరుఁడను. గొప్ప పరాక్రమముగల వాఁడను. నా శౌర్యము నెదుట వాని సౌందర్య మేమాత్రము? వాని కులమువానికి సహాయము సేయుచున్నది. మదాలసా! నేను హీనకులజుఁడనేనియు, గొప్ప కులమును నిర్మించు శక్తిసామర్థ్యములు నాకుఁ గలవు. కావున నీవు నన్ను లక్ష్యమున నుంచుకొనియ తీఱవలయును.

మదా. కోదండా! నన్నుం దక్కినవనితలం బోలెఁ జపలస్వభావఁగాఁ దలఁచితివా? నా ప్రేమ క్షణక్షణమునకు మాఱుదల నెందునదికాదు. గొప్ప గుణములకు గౌరవ మొసఁగుచుండుదానను. కులగోత్రములనెడి క్షుద్రభావములకు నా మదిని దావులేదు. నీవు పరాక్రమవంతుఁడవనియే నీయందు నాకు నిజమైన ప్రేమకలిగియున్నది. ఊరక లేనిపోని సందేహములేల కల్పించుకొనుచున్నావు? ప్రియవరా!......(వానికరముం గ్రహించి ముద్దిడుచున్నది.) ఇప్పుడైనఁ గోపము శాంతించెనా?

కో. అగును. నా కోపము శాంతమైనది. (తా నామెచేయి పట్టుకొని) నీ యమృతమయ విలోచనములనుండి వెలువడు ప్రేమపూర్వకమగు మధుర దృష్టులు చంద్రకిరణములవలెఁ దాపశాంతి నొనర్చుచున్నవి. ప్రియా! క్షణమాత్రము నిన్ను సందేహించి తూలనాడినందులకు క్షమింపుము.

మదా. నీ వేక్షింపవలయు. నీ యఖండమైన ప్రేమకు నే నేమిబదులు చేయఁగలను ?

కో. అది చాల సులభమైనపని. ఒకసారి ప్రజల సమక్షమున నన్ను వివాహమాడిన నా చేసిన సర్వోపకారములకుఁ బ్రతిక్రియ నొనర్చినట్లగును.

మదా. నీ యిష్టానుసారముగనుండ నింకఁ బరిణయవిషయమున నింత తొందరయేల ?

కో. అట్లేని నీవు నన్ను వివాహమాడెదనని శపథము గావింపుము.

మదా. ఈ వఱకొనర్చిన శపథములు చాలవా ?

కో. అవి యట్లుండనిమ్ము. ఇప్పు డొకతూఱిగావించినఁగాని నామదిగుదుటఁబడదు.

మదా. సరి. ఇదె శపథము సేయుచున్నదాన (చేతిలోఁ జేయిడి శపథ మొనర్చును. ఆమె చేతులఁ గోదండుఁడు ముద్దిడును.) ఇపుడైన నీ యాశాపూర్తి యయ్యెనే ?

కో. ఆహా ! నే నెంతయుం బరితృప్తుఁడను. ఇంక నాకు సెలవొసంగుము.

మదా. చంద్రశేఖరుని వర్తమానము, విక్రాంతుఁడుండుచోటును దెలిసెనా ?

కో. ఇంకను దెలియలేదు కాని నే నక్కార్యమునందే యాసక్తుఁడుగ నున్నాఁడను.

మదా. దేవుఁడు నీకు జయమొసంగుఁగాక (కోదండుఁడు వెడలును.) అయోగ్యా !

> శా. ఓరీ ! నన్ జేయిపట్ట నెంచితివె మూఢోద్యోగివై సిగ్గులే
> దేరా యొప్పునె సూర్యవంశజ మణిన్ శృంగార వారాశినన్
> గోరన్ నీచుఁడ వీవు నీకుఁదగునే కూశా ! మదోన్మత్తుఁడా
> యారా ! రోహిణి చంద్రుఁదక్క నొరునిన్ స్వాంతంబునం గోరునే.

నీచ శునకమా ! నిన్ను గాలితోఁ ద్రొక్కినలుపవలయును. ఈ మదాలసను వివాహమాడఁ గోరుచున్నావు. సూర్యకులోద్భవురాలగు మదాలస యెక్కడ ? హీనకులజుఁడవగు నీవెక్కడ ? నీ తలిదండ్రు లెవరగుటయుఁ దెలియకున్నది. ఓ మర్కటమా ! మదాలసను బాణిగ్రహణ మొనర్చుకొను కోరిక నీ కెపుడేని సఫలమగునా ? ఓరీ ! ఏ యంగనామణి నినుఁ జూడనైన నొల్లదో యట్టి స్త్రీ తనశరీరము మనసును నీ కెట్లర్పించును ? తులువా ! ఆడుసింహ మొక శ్వావమును మోహించునా ? నా మహాత్వా కాంక్షకు నీ సహాయ మావశ్యకము కాకపోయిన నా పాదరక్షలకడ నైనఁ తమ నిలువ నియ్యను. కాని నే నేమి చేయుదును ? గత్యంతరములేదు. కాఁబట్టియే యీ కైతవప్రేమపానము నీకుఁ దఱచుగ లభించుచున్నది. ఇది ప్రేమవలెఁ గన్పట్టినను దుదకు హాలాహలవిషయమై నిన్ననంతకష్టముల పాలొనర్చును. దీనిని నీవు బాగుగ నెఱుంగుము. దుర్జయపిశాచము నిపుడు శాంత మొనర్చుచున్నాను. నా కార్యము సఫలమైనపిమ్మట నా పిశాచమును నీపై వదలెదను.

ఈ హస్తముల ముద్దిడుయోగ్యత గూ విక్రాంతున కొక్కనికే కలదు. నా మనమునకును, శరీరమునకును, నాథుఁడగుటకు యోగ్యుఁడాతఁడు దక్కనింకెవఁడును గాఁజాలఁడు. సామర్థ్యశాలియుం, బ్రతాపశాలియు, మహాత్ముఁడు నగు నా పురుషునియెదుట మీ రండఱు మర్కటములతో సమానులు. విక్రాంతుఁడన నెవఁడు? నా శత్రువు. నా మహత్త్వాకాంక్ష కడ్డుపడు నొక దృఢవైరి. మఱియు రెండుసారు లింతకుమున్న నా ప్రేమను దిరస్కరించిన వాఁడు. అటులుండ వానిపై నాభావము నెట్లు ప్రవర్తిల్లఁజేయుదును? నా కత్యంత ప్రేమాస్పదుఁడగు పతిని జంపుటకు ముందువెనుక లాలోచింపలేదు. అట్టి నేను నాసర్వమనోరథముల సమూలముగఁ ద్రెగనఱుకువాఁడగు నా పిశాచము నెట్లు ప్రేమింపఁగలను? ఈ మదాలసప్రేమకుఁ బాత్రుఁడగువాఁడొక పురుషుఁడైనఁ గనఁబడఁడు. ఇది మొదలుచేసి ప్రేమకును నీ మదాలసకును మిక్కిలి యంతరముండును. నా యంతఃకరణమునుండి పొంగివచ్చు సర్వమహత్త్వాకాంక్షయను గుండమునందు సర్వకోమల వికారముల దహించి వైచెదను.

(దుర్జయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దుర్జ. నే నొక సంతోషవార్త నెఱింగింప నరుగుదెంచితిని.

మదా. సంతోషవార్తయా? దుర్జయా! అది యేమి? ఎట్టి సంతోషవార్త?

దుర్జ. చంద్రశేఖరుఁడు మన చేయిఁ జిక్కెను.

మదా. ఆ! చంద్రశేఖరుఁడు చిక్కెనా? ఎట్లు? ఎవరు వానింబట్టిరి? ఎచటవాఁడు పట్టువడియెను? ఎపుడు పట్టువడెను? ఎట్లు పట్టువడెను?

దుర్జ. ఇంకను బట్టువడలేదు. కాని పట్టువడెననియే తలంపుము. ఇపుడు నా దుర్గమున నాభార్యసరోజినికిఁ జిక్కియున్నాఁడు. రాణియుమిక్కిలి జాగరూకతతోఁ గాచుచున్నది. విక్రాంతునిపక్షమువారిచే మీ కేలాటి యుపద్రవము గలుగఁగూడదని యుద్ధమునకు సర్వసిద్ధముగ నున్నట్లు వార్తవచ్చెను.

మదా. అట్లైన మనమందఱము కూర్మదుర్గమునకుఁ బోవుదము. వెడలుఁడు.

దుర్జ. మహారాజ్ఞీ! స్వయముగ నేల శ్రమపడవలయును? మావంటి దాసులు సేవ చేయుటకు సిద్ధముగ నున్నారుగదా? దేవి యాజ్ఞయైనయెడల నీ దుర్జయుఁడా హీనునిఁ గట్టితెచ్చి మీ పాదములకడ నిడును. కోదండునివలె నపజయ మొందువాఁడు కాఁడు వీఁడు. కాఁబట్టి యీతఁడు లక్ష్యమునసుండనిండు.

(కోదండుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కో. దేవీ! విక్రాంతుఁడు మనయెల్లనుదాఁటి చాలదూరము పోయెను. మన సేవ

కులు వానినిబట్టుటకై యెంతయో ప్రయత్నముచేసిరి. కాని తుదకా విరోధి వారిని మోసగించెను.

మదా. రెండవశత్రువు మాచేఁ జిక్కియుండుట నీకుఁ దెలియునా ?

కో. రెండవశత్రువు ! రెండవశత్రు వెవరు ?

మదా. చంద్రశేఖరుఁడు చిక్కియున్నాఁడు.

కో. చంద్రశేఖరుఁడు పట్టువడెనా ? వానింబట్టిన వారెవరు ?

మదా. ఈ దుర్జయునియొక్క పత్ని.

కో. విక్రాంతుఁడు కూర్మదుర్గములో నుండనగునని నా సేవకుఁ డొకఁ డూహించెను. ఈ వచనములవలన వానియూహ సరియగునదనినేఁ దలంతును.

దుర్జ. నాకు నటులనే వర్తమానమందినది. సరోజిని జయము నొందును. విక్రాంతునిసామర్థ్యము నాపత్ని యెదుట నిష్ప్రయోజనమగుననుటనిశ్చయము.

మదా. దుర్జయా ! సంసిద్ధుఁడవుగమ్ము. కోదండా ! వీనితోఁ గొంత సేననంపుము.

దుర్జ. సైన్యమెందులకు ? నే నొకఁడన చాలును. కాని మీ కిష్టముండినఁ గొందఱ భటుల నంపుఁడు. నే నిపుడే పోవుటకు సంసిద్ధుఁడను.

మదా. అట్లే కానిమ్ము. (దుర్జయుఁడు పోవుచున్నాఁడు.)

కో. మనమిపుడు దుర్జయునితోడఁ గొంత సేనసంపుటయే యుక్తమని తోఁచెడిని. కాదే నీ నీచుఁడ చటికివెళ్లి సరోజినికి దాసానుదాసుఁడై పడియుండఁగలఁడు. చపలచిత్తులగు నయోగ్యుల నెన్నడును విశ్వసింపరాదు. అది యాపత్కరము

మదా. సరోజిని పతికి వ్యతిరేకముగ నడువఁజాలదు. అదియునుగాక యస్మత్ప్రేమపాశ బద్ధుఁడగు వీఁడు నాకు విరుద్ధముగఁ దనమనస్సును ద్రిప్పుకొనఁజాలఁడు

కో. ఎట్లని మనము జాగ్రత్తగలిగి యుండుటయందుఁ దప్పేమి యున్నది ?

మదా. అట్లే కొంతసైన్యమును వానితోఁ బంపుము. ఆ సైనికులతో దుర్జయునియెడ కృత్రిమ మేదేనిం గన్పట్టిన, వానిం గడతేర్పుఁడని రహస్యముగఁ జెప్పుము.

కో. అట్లే జరిపెదను.

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము

అంకము 3. రంగము 3.

స్థలము:—కూర్మదుర్గముయొక్క వెలుపటి ప్రదేశము.
(కావలివాండ్రకు దుర్జయునికిని గలహము జరుగును.)

దుర్జ. సేవకులారా! వెంటనే తలుపు తీయుఁడు.

మొ-కా. ద్వారము తెఱచుటకు మా కాజ్ఞలేదు.

దుర్జ. ఆజ్ఞలేదా! ఎవరి యాజ్ఞలేదు.

రెం-కా. రాణిగారి యాజ్ఞ.

దుర్జ. ఇతరుల విషయమున నాయాజ్ఞగాని నా విషయమునఁ గాదు.

రెం-కా. ఇతరులకును మీకును దారతమ్యము గన్పట్టుచుండుటలేదు?

దుర్జ. ఇతరులకును నాకును భేదము మీకుఁ దెలియుటలేదా?

రెంకా. తెలియును. తెలియును. బాగుగఁ దెలియును.

దుర్జ. అయిన మీరు నాకు దారియొసంగనే వలయును.

మొ-కా. అది మాత్ర మెన్నటికిని గానేరదు.

దుర్జ. నే నిచ్చటి యజమానుఁడగు దుర్జయరాజునుగానా! న న్నెట్లడ్డగించెదరు?

రెం-కా. కాఁబట్టియే మిమ్ము నోటిమాటలచే నాపఁగలిగితిమి. ఇట్టి యక్రమాచారుఁడు వేఱొకఁడైనచో నీ కూర్మదుర్గమును సమీపించినందులకు వానిని వెంటనే మా ఖడ్గదేవతకు బలి యొసంగియుందుము.

దుర్జ. చాలును. నోరుమూయుఁడు. నా కోటయందు నా నౌకరులవలననా నాకవమానము గలుగుట! (తనతోడ వచ్చిన నౌకరులంగాంచి) మీ రేల యట్లే మిన్నక చూచుచున్నారు? ఈ దుష్టులవెంటనే బంధింపుఁడు, తిరుగు బాటొనర్చినచో వీరి శిరముల ఖండింపుఁడు. కృపాణములు పాణుల కలంకారములని తలంచితిరే? (ఖడ్గయుద్ధము జరుగును. కోటబురుజుపై సరోజినియు సర్దారులును సధిరోహించి యుందురు.)

సరో. ఏమి యీ కలకలము?

దుర్జ. ఎవరు? ఎవరు? మీరా! మహారాజ్ఞియగు సరోజినీదేవిగారా! ఈ దుర్గమునకు యజమానురాలా?

సరో. ఇట్టి ప్రశ్నలు నన్నడుగు వారు మీ రెవరు?

దుర్జ. నేనెవరా! మీరు నన్నెఱుఁగరు కాఁబోలు?

సరో. మీ యానవాలు నాకుఁ దెలియుటకు మీ యందేమి యోగ్యతయున్నది?

దుర్జ. ఔరా! నీవు నన్నెఱుఁగకున్నావుగా! ఏమి యీ కల్లమాటలు? వలయు ననియే నా కిట్లవమానము గల్పించుచున్నావు. సరోజినీ! నీ ప్రస్తుత ప్రవర్తన మించుకయు యుక్తమగునదిగాదు.

సరో. తమ నడవడికయందలి యోగ్యతా యోగ్యతాజ్ఞాన మెవరెఱుఁగకుందురో యట్టివారా యితరులకు న్యాయము బోధించుటయందు సమర్థులగుదురు?

దుర్జ. ఇపుడు నీ వాడు మాటలకావలఁ బశ్చాత్తాపము నొందఁగలవు. అదట్లుండ నిమ్ము. వీరికిఁ గవాటములం దెఱువ నాజ్ఞ యిమ్ము. నేనులోనికి రావలయును.

సరో. మీరు లోనికి రావలను పడదు.

దుర్జ. అట్లేని నేను బలాత్కారముగ లోనికి వచ్చెదను.

సరో. బలాత్కారముగ లోనికి వచ్చుటకు మీకేమి శక్తి కలదు?

దుర్జ. సరోజినీ! నీవు మిక్కిలి మదోన్నత్తురాలవై మాట్లాడుచున్నావు. నీ మాటలు మున్నె క్రోధయుక్తులై యుండు నీ కావలివారల కింకను స్థల మొసంగు చున్నది. నా సహనశక్తి నీరీతిం బరీక్షింపకు. నన్ను లోనికి రావింపుము.

సరో. అట్లెన్నటికిని జరుగనేరదు.

దుర్జ. అట్లేల జరుగనేరదు? నేను జోరుఁడనా? మోసగాఁడనా?

సరో. చోరుఁడుగనున్నను, మోసగాఁడుగనున్నను, నోర్చికొనియుందును. ఇప్పు డంతకంటెఁ బలుమడుంగులు మాఱియున్నది. విశ్వాసఘాతుకత్వము, స్త్రీ హత్య, రాజద్రోహముల నెడి యపరాధములు మీపైఁ బ్రత్యక్షముగఁ గా న్పించుచున్నవి. రౌరవనరకద్వారము మీకొఱకుఁ దెఱచి సిద్ధముగనున్నది.

దుర్జ. అవమానము! పతికవమానము!! తనభార్యచేఁ బతికవమానము!!!

సరో. చాలును. నన్ను భార్యయనుటకింక మీకధికారములేదు. నేనొకని భార్యయ నుగాను. నాకుఁ బతియునిఁకముం దెవరును లేరు.

దుర్జ. సరోజినియా యిట్టి మాటలాడుచుండుట! సరోజినీ! సరోజినీ! నీ నడవడిక మిక్కిలి బాగుగనున్నది. నే నిచటికి వచ్చునపుడు నాకు నీ విట్టిగౌరవ మొసఁగుదువని స్వప్నమందైనఁ దలంపకుంటిని.

సరో. నా మనోభావమింకను మీ రెఱుఁగకయున్నారని నేఁజెప్పవలయును.

దుర్జ. మదాలసామహారాజ్ఞిచే బంధింపఁబడినవాఁడను నీకొఱకేకదా యామె దాస్యమున కంగీకరించితిని! నీ క్షేమము గోరియే నే నట్లాచరించితిని.

సరో. నాకొఱకు మీరా మహారాజ్ఞి దాస్య మొప్పుకొనియుండినచో నా దాస్య మనుచిత మగునదిగాన నీ క్షణముననే దానిని దొలఁగించుకొనవలయును.

దుర్జ. ఛీ! ఇపుడది శక్యముగాని పని.

సరో. అట్లేని వచ్చినరీతి మరలిపోనగును.

దుర్జ. అట్లేకాని నాకు నీయెడ నొక గొప్ప కార్యమున్నది.

సరో. ఈరాకకుఁ గారణము దెలియును. ఆ విషయమున నేను మున్నే నిర్ధారణచేసి కొనియున్నాను. చంద్రశేఖరమహారాజు కొనవ్రేలిగోరైనను మీ నీచనేత్రములకుఁ గాన్పింపఁజాలదు.

దుర్జ. సరోజినీ! నీ విట్టి మూర్ఖమగు హఠముకై కొని నీ ప్రాణమును బోఁగొట్టుకొనకుము.

సరో. నా ప్రాణమునుగూర్చిన చింత నా కుండవలయును గాని యన్యుల కాచింతయేల?

దుర్జ. నా రాజ్యముయొక్క చింతయైన నా కుండవలసినదికదా?

సరో. అది కూడవలదు. స్వత్వమును గాలితోఁ ద్రొక్కిన నరాధములను రాజ్యలక్ష్మి యప్పుడే పాదతాడనమొనర్చి తొలఁగియుండును. నావలే నీ రాజ్యలక్ష్మియు నొక క్షత్రియకాంత. అది నిస్సత్త్వుఁడును బౌరుషహీనుఁడు నగు పురుషునికి వశయగుట కిష్టపడదు.

దుర్జ. సరోజినీ! నీయొక్క వీరరసము నింకఁజాటింపకుము. పిశాచమువలెఁ జరింపకుము. మహారాజ్ఞి యెదుట నీ వైరము చెల్లదు.

సరో. ఇట్టి వ్యర్థోపదేశములచే వృథాశ్రమయేల? దానివలనం బ్రయోజన మావంతయుఁ గన్పట్టదు.

దుర్జ. మదాలసకోప మతిభయంకరము. దాని సామర్థ్యము వర్ణనాతీతము.

సరో. నా పక్షమున సత్యము, సత్యమును రక్షించు సర్వసమర్థుఁడగు సర్వేశ్వరుఁడు నున్నారు. నాకు మదాలసకోపభీతి కొంచెమేనియు లేదు. దాని సామర్థ్యమసత్యమనియే నేఁ దలంచియున్నాను.

దుర్జ. సరోజిని! నీకు వెఱ్ఱిపట్టియున్నది. నీ తల తిరుగుచున్నదని తలంచెదను.

సరో. అగును. నాకు వెఱ్ఱియే పట్టియున్నది. నాకుఁ దల తిరుగుచునున్నను నా గౌరవమునన్ను వీడలేదు. దీన నాకు ధన్యతగలిగియున్నది. గౌరవము గాపాడుటయం దీతల, తిరిగినను, బ్రద్దలైనను నాకు లక్ష్యములేదు.

దుర్జ. ఈ భ్రాంతి నీకుఁ గలిగించిన వారెవరు?

సరో. మీవంటి రణరంగసింహాలు చేతఁ గంకణములధరించి శీలమును మంటఁగలిపినపిమ్మట నీ భ్రాంతిని నేనే తెచ్చుకొంటిని.

దుర్జ. కంకణముల ఛేదించి కరవాలములఁ జేఁబట్టి యుద్ధమునకు సిద్ధమైనపిమ్మట నీ

వెందుల కీ సంకటములకు లోనుగావలయును ?

సరో. మీరు కరవాలములచేఁ బట్టియుండుట యెందులకు ? భూమిపై నన్యాయము గను నక్రమముగను జరుగు రాజ్యమును స్థిరపఱచుటకు, జగమున రక్తపాత మొనర్చుటకు, నత్యాచారమును బ్రవర్తిల్లఁ జేయుటకును, విశ్వాసఘాతు కత, స్త్రీహత్య, రాజద్రోహము ననునట్టి పైశాచికస్వరూపముగల పాతక ములను సంఘములం జరిపించుటకు సహాయభూతముగా నుండుటకునుగదా ? ఇట్టి కరవాలము లొరలనుండి వెలువడఁగూడదు. అట్లు వెలువడినను దుని యలై పోవలయును. అట్లు కాకుండుటచే నీ బ్రహ్మావర్త రాజ్య మందఱి కోరి కలకు విరుద్ధముగఁ గళంక మొందియున్నది. మనుజ రక్తముగోరు నా రాక్షసివలననుండి చంద్రశేఖరమహారాజును గాపాడుటకై మీ ఖడ్గ ముపయో గించిన నేఁడిట్టి విచిత్రమగు నవస్థ మనమేల యనుభవింపవలయును ?

దుర్జ. చంద్రశేఖరుని నే నేల రక్షింపవలయును ?

సరో. చంద్రశేఖరు నేల రక్షింపవలయునా ? ఆహా ! ఈ లజ్జారహితములగు వాక్యములు మీ నోటినుండి వెలువడుచున్నవా ? చంద్రశేఖరుఁడు మనకు రాజు. మన ప్రాణములైనను నర్పించి వానిని గాపాడవలయునను విషయ మును బొత్తుగ మఱచినట్లున్నది. మీ గౌరవమును నొప్పతనమును మంటఁ గలసెనా ?

దుర్జ. చంద్రశేఖరుఁ డిపుడు నాకు రాజుగాఁడు. నే నిపుడు మదాలస సేవ నొప్పు కొనియున్నాను. ఆ యమ చరణారవిందమున నా గౌరవము నప్పగించి యున్నాను.

సరో. ఉన్మాదమునఁ గ్రిందు మీఁదు లెఱుంగక పవిత్ర తమ వస్తువును గాలితోఁ ద్రొక్కఁదలఁచుట యన్యాయము, నత్యంత పాపావహము నగును. అట్టి విషయములు నాతోఁ జెప్పవలదు. విశ్వాసఘాతుకురాలగు నా నీచురాలి యెడ గౌరవమప్పగించి నట్లాడుటకు మీకుసిగ్గు గలుగకున్నదే ?

దుర్జ. గర్వముపట్టినదానా! మదాలసా మహారాజ్ఞియొక్క కోరికని ట్లవమతింపకుము.

సరో. మదాలసను నే నెఱుఁగుదును. రక్తపాతము నమానుష పాతకములను సహా యముగాఁగొని రాజ్యమును గైకొనఁ బ్రయత్నించు మహాపాపినియగు నా చండాలురాలిని మహారాజ్ఞియని గౌరవించుటను నే నంగీకరింపను.

దుర్జ. చూడుము. చూడుము. నీ విట్లు గర్వముతోఁ జరింపకుము.

సరో. చాలును. ఇఁక మాటలాడవలదు. దైత్యులకంటె నధికమైన క్రూరకార్య మొనర్చిన యధమాధముల ముఖావలోకనముచేయ నా కిష్టములేదు. ఇచట

నొక క్షణమైన నాగక వెడలిపోనగును, లేనియెడల నావలనంగల్గు నవమా
నము ననుభవింపవలసియుండును. దానికి నే నుత్తరవాదినిగాఁ జాలును. ఇంక
నైన నిట్టి నీచవ్యాపారములుమాని సన్మార్గమునకు రావచ్చునుగదా యను
దురాశ్రింతిచే నింతవఱ కెంతయు శాంతత సహించియుంటిని. ఈ వఱ కాచ
రించిన యాసురకృత్యములకై యించుకదుఃఖమేనిం బశ్చాత్తాప మేసింగలు
గని మీ మానసము వజ్రజడము యగును. ఇట్టి నీచుల కిట నిలువనీడ లేదు.
కాఁబట్టి వెంటనే వెడలిపోవలయును. ఇంక నా శాంతమును బరీక్షింపవలను
గాదు. కాన నిటనుండి వెడలెదను. (పోవ నుంకించుచున్నది.)

దుర్జ. సరోజినీ! కొంచెముండుము. ప్రేమభరితుఁడగు నీ పతిచేయు హితకరమగు
నుపదేశమును ద్యజింపకుము. మదాలసా మహారాజ్ఞియొక్క కోరికలఁ
బూర్తిసేయుము.

సరో. చంద్రశేఖరుని గోరుటయన మన మిరుపురము యుద్ధరంగమునకు సంసిద్ధుల
మగుటయే యగును.

దుర్జ. జాగ్రత్త! జాగ్రత్త! ముందు గొప్పకష్టములకు లోనగుదువు.

సరో. సరి. సరి. ఎవరిశక్తిని వా రుపయోగించుకొనవచ్చును.

దుర్జ. సరోజినీ! ఇదియే కడమాట. కొంచెము వినుము.

సరో. ఈ సరోజిని యింక మోహవాగురలకుఁజిక్కి యీ పైశాచిక కృత్యమునందుఁ
బ్రవేశింపదు. (సర్దారులతోఁ బోవుచున్నది.)

దుర్జ. సరోజినీ! సరోజినీ! ఛీ! వెడలిపోయెను. వెడలిపోయెను. ఆహా! వెడలి
పోయెనుగా?

> చ. కటకట నాసతీమణియె కట్టెదుటన్నను నడ్డగింపఁగా
> గుటిలత నిర్దురాత్ములును గొంకకదీనికి సాయముండఁగా
> నిటనహా! నాదు దుర్గమునసే యిటుగౌరవ మెల్లఁబోయె, నా
> పటుతర శస్త్రపాతమున బద్దలుసేతు వధింతువీరలన్.

ఇట్టి యవమాన మనుభవించి, యీ ముఖముతో నే నెట్లు పోవుదును!
అయ్యో! సరోజినీ! యుద్ధభటులు కొలఁదివారయ్యును, వారితో యుద్ధము
చేయుటకును నాకు ధైర్యము లేకపోయెనే? ఏమి చేయుదును? (కావలి
వారలంజూచి) విశ్వాస ద్రోహులారా?

(కోపావేశమునఁ దన భటులతో మరలిపోవును.)

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము

అంకము 3. రంగము 4.

మదాలస దర్బారు. (ప్రవేశము. మదాలస - కోదండుడు - సర్దారులు - నౌకరులు.)

మదా. సరోజిని చంద్రశేఖరుని విక్రాంతున కప్పగింపలేదను వాక్యము నిజమా?

మొ-సే. నిజము. విక్రాంతుఁడు సరోజినిని దన యిష్టానుసారమొనర్ప నెంతయు నిర్బంధించియు నాయమ దన నిశ్చితకృత్యమునుండి మరలలేదు. ఈ విషయము మా వారివలన నాకుఁ దెలిసెను.

కో. అక్కని సరోజిని మిక్కిలి బుద్ధిశాలినిగఁ గన్పట్టుచున్నది. తనచేఁజిక్కినవానిని విక్రాంతున కప్పగింపకుండుట యాలోచించిన, నాయమమిక్కిలి విశ్వాసపాత్రురాలని తోఁచుచున్నది.

మదా. దుర్జయునితో సరోజిని యిచటికివచ్చిన దానిరాజనిష్ఠకుమెచ్చి దానికి నా యర్ధాసనమొసంగి గౌరవింతును.

కో. అక్కని దుర్జయునకు.

మదా. కళింగదేశపురాజ మకుటమునర్పింతును-దుర్జయుఁడేల యింకను మరలిరాక యున్నవాఁడు? అతనిని జూడవలయునను నుత్కంఠ నాకుమెండుగనున్నది. అతఁడీవఱకే వచ్చియుండవలయునుగాదే!

(సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సేవ. దేవి! దుర్జయుఁడు రాజగృహబహిః ప్రదేశమునకు వచ్చియున్నాఁడు.

మదా. ఏమి! దుర్జయుఁడువచ్చెనా?

సేవ. అగును దేవి!

మదా. ఈ యానంద వార్త నెఱింగించినందుల కీబహుమానము గైకొనుము. (చేత ధరించియుండు కంకణమును వానికొసంగును) పొమ్ము. అతని నచటనే కొంతకాలముండుమనుము. అతఁడు వచ్చుసమాచారము ముందుగఁ దెలియనందున నతనికి స్వాగతమొసర్చుటకుండగు నేర్పాటులఁ జేయుట కవకాశము లేకపోయెను. ఆలస్యమునకే నేనుజింతిల్లుచున్నానని యతనితోఁ జెప్పుము. (సేవకుఁడు పోవుచున్నాఁడు) కోదండా! రమ్ము. మనమందఱము నతని నెదుర్కొందము. ఓరీ! అతనిస్వాగతమునకుఁ దగునేర్పాటుల నిపుడే యతిశీఘ్రముగఁ జేయుము. రాజద్వారముకడకేగి నేనేయతనికిఁ బ్రత్యక్షమున స్వాగతమొనర్చెదను. మీరందఱుపొండు విజయదుందుభిని మ్రోగింపుఁడు-గుండ్లను వానిగౌరవార్థము ప్రేలింపుఁడు. సైన్యమునంతయు రాజద్వారముకడ నిలిపి, జయధ్వానముల నొనర్చునట్లు చేయుఁడు. ఆఱుగడియలలో రాజ్యమంతయుఁ బట్టాభిషేక మహోత్సవమునకు సిద్ధముకావలయును. ఇఁక జాగుసేయక

యందఱుపొండు. దుర్జయుని జూచుటకంటెఁ జంద్రశేఖరుని శిరము నా కాశముపై నెగురవేయవలయునని నామన సాతురత నొందుచున్నది. (కొందఱు సేవకులుపోవుచున్నారు). ఓరీ! నా సామ్రాజ్య మకుటముదెమ్ము. అమూల్యమగు నా రత్నహారమును గొనిరమ్ము. నా సర్వసామ్రాజ్య వస్త్రాలంకారములందీసికొనిరమ్ము (సేవకులట్లుసేయుచున్నారు.) నన్నలంకరింపుఁడు. సర్వాలంకార భూషితనై యీ కరవాలముచే నా శత్రువుశిరము ఖండింతును. నా కరవాలముదెమ్ము. దుర్జయునికొఱకుఁగళింగ రాజ్యమకుటమునుగొని తెమ్ము. (దాసీలు మదాలస నలంకరింతురు) నా కరవాలముదెమ్ము. నా చేతికిమ్ము. దుర్జయునికిఁ బంచహారతు లొసంగుటకు మీ రందఱు రాజద్వారమునకుఁ బొండు. స్తుతిపాఠకుల నందఱిని బాడుటకుఁ బ్రారంభింపుఁడనిచెప్పుఁడు. దుర్జయుఁడు రాజమందిరమును బ్రవేశించుసమయమున నలుప్రక్కలనుండి పుష్పవృష్టికావించి యతనికి జయఘోషముల నొనర్పుఁడు. (చేతికరవాలమునెత్తికొని) నేఁడు నా శత్రువు నాచేఁజిక్కనున్నాఁడను విషయము నెఱింగినందున నామనమున కమితోత్సాహము గలిగెను. ఈ యఖిల బ్రహ్మావర్తముయొక్క చక్రవర్తినీత్వము నాకు స్థిరముగ నెన్నఁడుకలుగునో యనుచింత నేఁటితోఁదొలఁగెను. మిక్కిలి బలాఢ్యుఁడగు నా శత్రువు విక్రాంతుఁడు నేఁడు మొదలు నాకు మశకప్రాయుఁడు. నేఁడు మొదలు నా నిజమగు చరిత్రము ప్రారంభమగుచున్నది. ఈ శుభముహూర్తమున బ్రహ్మావర్త సింహాసనము స్థిరమైనవెంటనే భిన్నాభిప్రాయుల భేదవాదములఁ బోఁగొట్టి, యందఱి నా వశముచేసికొందును. ఇదిమొదలు పృథ్విపై సంతనముతో వర్తిల్లు రాజాధిరాజులు, మహారాజులు నా పక్షము నవలంబించి యీ మదాలసా పరాక్రమము, నైశ్వర్యము, యశమును గూర్చి కవనమొనర్చి పాట పాడుదురు- మహాశూరులగు రథికులు, నతిరథులును, మహారథులును దమ గర్వములను వీడి మహాప్రతాపశాలినియగు మదాలసయొక్క శాసనమునకులోఁబడి తమశిరముల దీనభావములతో వంపుదురు. సర్వదేశ, సర్వరాష్ట్ర, సర్వరాజ్యములుగాక యీ సృష్టియందలి సకల సామ్రాజ్యములు నీ బ్రహ్మావర్తమునందలి సర్వశక్తి యుక్తురాలగు సామ్రాజ్ఞి యాజ్ఞకులోఁబడ వలయును (నేపథ్యమున వాద్యములు వాయింపఁబడును. జయఘోషములు జరుగుచున్నవి.) అందఱు రాజగృహ మహాద్వారము కడ కేగుఁడు. స్తుతిపాఠకులఁ బాడుటకుఁ బ్రారంభింపుఁడనుఁడు. పొండు.

(అందఱుపోవుచున్నారు).

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము



అంకము 3. రంగము 5.

స్థలము:—రాజమందిరమహాద్వారము.

(వెలుపల దుర్జయుఁడు సైనికులతో నిలచియున్నాఁడు. లోనుండి మదాలస కోదండుఁడు సపరివారముగ స్వాగతమున్నకై వచ్చుచున్నారు.

మదా. [దుర్జయునింజూచి] రమ్ము. రమ్ము. రమ్ముదుర్జయా! ఈ బ్రహ్మావర్తముయొక్క మహారాజ్ఞి నీకు స్వాగతమొసర్చుచున్నది. రమ్ము. నీ వాచరించియుండు నీ ఘనకార్యమున్నకై నా కంఠముననుండు నమూల్యమగు నీ రత్నహారమును నీ కాదరపూర్వ మగు సన్మానముగ నొసఁగుచున్నాను. ఈ కళింగదేశ రాజమకుటముచే నీశిరము నలంకరించి నీ యట్టిపరాక్రమశాలికి నా ప్రేమ పూర్వకమగు నాలింగన మొసఁగి నిన్ను గౌరవించెదను. నా చరణస్పర్శము కలిగిన భూమిని ముద్దిడుటకు బదులు నేను మొదలు కంకణభూషితమగు నా కరమును ముద్దిడుస్వాతంత్ర్యము నీవు చేసియుండు ప్రశంసనీయమగు కార్యము నకుఁదగుసన్మానముగాఁగలదు. (తనకంఠముననుండు రత్నహారము దీసి వాని కంఠమున వేయుటకును రాజమకుటమును వానిశిరముపై నుంచుటకును బ్రయత్నించుచున్నది. అతఁడు వెనుదీయును). ఏమీ! నీవు దూరముగ నేల పోవుచున్నావు? ఈ కళింగదేశ రాజమకుటము నీవు చేసియుండు కార్యము నకుఁదగిన సన్మానము గాదనితలంచెదవా?

దుర్జ. కాదు. దేవీ! మీయట్టి మహావైభవశాలినియగు మహారాజ్ఞి ప్రసన్నురాలై నన్నింతగొప్పగ గౌరవించునపు డీరాజమకుటము తగు సన్మానము గాదని చెప్ప నాకు శక్యమా? కాని, మహారాజ్ఞియొక్క యీ గొప్పసన్మానము నకు నేను మిక్కిలి యపాత్రుఁడను కాఁబట్టి దూరముగఁబోవుచున్నాను.

మదా. కాదు. అటులనకుము. దుర్జయా! నా దృఢవైరిని బట్టితెచ్చియున్నావు. నీవు నా సింహాసనమును, నా ప్రాణమును భయరహితముగ నొనర్చియున్నావు. నా మహత్త్వాకాంక్షయను భవ్యమందిరమునకు నీవు కలశము పెట్టియున్నావు. అట్లుండ నీ వీసన్మానమున కపాత్రుఁడని చెప్పుట సరికాదు. నేఁజెప్పునదే మనిన? సమీపమునకురమ్ము. దూరముగఁ బోవలదు. ఈ మదాలస విక్రమశాలియగు నీశిరముపై మకుటము నిడ నుత్సాహము గొనియున్నది. (మకుటమును మరల ముందటికిఁ దెచ్చుచున్నది).

దుర్జ. (దానినడ్డగించి) మీ యుత్సాహము చిరకాలముండునదిగాదు, దానిని మీ

రోకక్షణమున దూరమొనర్తురు. నన్ను ధిక్కరింతురు. ఆగ్రహమున మీ పాదములతోఁదన్నుదురు.

మదా. ఏమీ! నిన్ను ధిక్కరింతునా? నిన్ను నా పాదములఁదన్నుదునా? అటుకాదు. దుర్జయా! నాకొఱకుఁ గార్యము సాధించిన ప్రియమిత్రునెడ నేనట్లువర్తిల్లుదునా? నాకు మనస్సాక్షియనునదిలేదా? నన్నీశ్వరుఁడు పాషాణహృదయురాలింగా సృజించెనా?

దుర్జ. దేవీ! నేను మీయెడ మహాపరాధమొనర్చితిని. నా యపరాధమునకై నన్ను క్షమింపుఁడు (మోకాలొడ్డి మదాలస యెదుట నమస్కారమొనర్చునట్లు గూర్చుండును)

మదా. నీవుచేసిన యపరాధముల నెల్లక్షమించితిని. రమ్ము. రమ్ము. ఈ రాజమకుటమును నీ శిరమున ధరించుకొనుము. ఇపుడే నాశత్రుని నా యెదుటనిలుపుము. ఇదెచూడుము. చంద్రశేఖర రక్తపానమునకు నా కరవాల మువ్విళ్ళు లూరుచున్నది. వాఁడు నా దృష్టిపథమునఁ జిక్కనేని నా కరవాల మాక్షణముననే వానికంఠముపైఁబడును. ఈ మకుటము గైకొనుము. (మకుటమును వాని శిరముపై నుంపఁబోవుచున్నది)

దుర్జ. దేవీ! చంద్రశేఖరుని నేనుబట్టుకొనిరాలేదు.

మదా. (తటాలున వెనుకకువెళ్లి) ఏమీ! ఏమీ! నీవు చెప్పునదేమి? చంద్రశేఖరునింబట్టుకొనిరాలేదా?

దుర్జ. అగును దేవీ! పట్టుకొనిరాలేదు.

మదా. ఎందులకు?

దుర్జ. వాఁడునాకుఁ జిక్కలేదు. నేను వానిని బట్టుట యశక్యమయ్యెను.

మదా. ఆహా! నా మనసునకు విరసముగలిగించితివి. నా కాశాభంగముగలిగెను. నా మనోరథములన్నియు నాశమొందినవి. దుర్జయా! నిన్నును నీ శౌర్యమును ధిక్కరించుచున్నాను. ఇట్టితరుణమున నీ రాజభక్తి నాకుఁ బ్రతికూలమగుటెట్లు? నీకు నా యందుఁగల ప్రేమ యెట్లుతొలఁగెను? నా కృపను బోఁగొట్టుకొను సందర్భము నీకేలకలిగెను? నీవిపుడు మానహీనుఁడవైతివి. నా సర్వస్వమును నాశమొనర్చితివి.

చ॥ పటుతరమంత్రశాస్త్రచయపారగుఁడీవనిచాలనమ్మి నేఁ
దటుకున నెంతయోచవనవు దన్పితిని యెడనట్టులయ్యెనీ
కుటిలతలచూపిద్రోహి వయికూళతనంబునఁ బొల్చినాఁడవే
కటకటమానవాకృతివి గాక యథార్థపు దుర్జయుండవే॥

దుర్జ. దేవీ! నేనేమిచేయుదును? నా రాజభక్తి, నీయందలి ప్రేమ, మహత్త్వాకాంక్ష యిప్పటికి నంతమొందలేదు. అవి నా మనమున భయంకరకల్పనల నేర్పఱచుచున్నవి. మానహీనుఁడనునింద మోయుటకు నా మనమొల్లదు. నాచే మీ యాశాభంగము గలిగియుండలేదు. కాని మహారాజ్ఞీ!

మదా. సరి. జరిగిన విషయము స్పష్టముగాఁ జెప్పుము.

దుర్జ. దేవీ! నా దుర్దైవములెల్ల నాకడ్డమురాఁగ నే నేమియుఁ జేయలేకపోయితిని. నా దుష్టగ్రహములు నాకు గర్వభంగము గావించెను. నాకుఁ జెప్పుకొనుటకు సిగ్గగుచున్నది. కాని దేవియొక్క చరణారవిందముల యెదుట లజ్జనువీడి జరిగిన వృత్తాంతమంతయు విశదీకరించెదను. నా భార్యమానహీనురాలయి స్వామిద్రోహమునకు వెనుదీయక విక్రాంతుని పక్ష మవలంబించెను.

మదా. ఏమీ! సరోజిని విక్రాంతునిపక్ష మవలంబించెనా?

దుర్జ. అగును దేవీ! ఆ నీచురాలుపతినగు నా కీర్తికిఁ గళంకముదెచ్చెను. మా యుభయకులములను నరకమునఁద్రోసెను. ఆ దుష్టురాలు చంద్రశేఖరునికిఁ దన దుర్గమున నాశ్రయ మొసఁగియున్నది. మీయొక్క సామ్రాజ్యాధికారమును ధిక్కరించినది. మఱియుఁ జంద్రశేఖరున్నికై నా సేవకులను నా వైరులుగనొనర్చి కోటయందు యుద్ధపతాకను నాటియున్నది.

మదా. ఏమి! నాకువిరోధమా? ఈ మదాలసకు విరుద్ధముగ యుద్ధపతాక నాటుటయా? నాతల తిరుగుచున్నది. నా కోపానలము శాంతించుటకు మాఱు పెచ్చుపెరుగుచున్నది. నాకు లోఁబడినవాని భార్యయే నాకువిరోధ మొనర్చుటయా? ఛీ! దీనిని నేనెట్లుసహింతును? ఈ క్షణమున నా పతాకను జించి సరోజినియొక్క ప్రాణములు కైకొనియెదను. దుర్జయా! ఆచండాలినిని బంధీకృతం గావించి నీ వేలయిచటికిఁ గొనిరానైతివి? అచటనే దాని శిరచ్ఛేదము గావించియేనిందగుప్రతిక్రియ నేలచేయనైతివి? అటులొనర్చుటకు నీవు నా ప్రతినిధియగుటచే నీకుసర్వాధికారముగలదుకదా?

దుర్జ. అధికారముండినను నాసమయమున నాకుఁదగు సామర్థ్యము లేకుండెను?

మదా. సామర్థ్యములేకుండెనా? శూరులగు నాసైనికులు నీకు సహాయులై యుండియు నీకు సామర్థ్యమేలలేకుండెను? బ్రహ్మశివరత్నపు సామ్రాజ్ఞియగు నా సహాయముండియు నీకు సామర్థ్యముగలుగకుండెఁగా?

దుర్జ. సరోజినీ సైనికులుచేసిన ఘోరయుద్ధ ప్రయత్నములు నన్ను స్తంభీభూతుంగా నొనర్చెను. వారితోఁబోరుటకు నాకు శక్యముగాలేదు. వారిధైర్య మపార

ము. వారజేయులుగనుండిరి.

మదా. ఓరా! ఇట్టి పౌరుషహీనమగు వార్తలు నీ నోటనుండి వెలువడినపుడు నీ నాలుక యేలతునుకలై పడకున్నది? ఇట్టి యశుభవార్త కొనితెచ్చుటకంటె నేలయచటనేపడి చావవైతివి? ఛీ! ఛీ! పౌరుషహీనతను బ్రకటించుటకు సిగ్గుజనింపకున్నదే? అప్రయోజకురాలగు నొకస్త్రీకి భయపడి పాఱివచ్చితివే? ఛీ! నీవంటియల్పుని ముఖావలోకనము సేయుటకు రోఁత గలిగెడిని, నా యెదుట రానీకెట్లు సాహసము గలిగెను?

దుర్జ. దేవీ? మీ చరణారవిందములు తప్ప దీనుఁడగు నీ దాసునకు.

మదా. ఛీ? నోరుమూయుము-కోదండా! ఈ లజ్జావిహీను నిప్పుడే చంపి వేయుము. ఆ పవిత్రమగు కళింగ దేశమకుటముపై వీనిపాపవీక్షణములు పడనీయకుము. ఆ రత్నహారమును వానిమెడనుండి తీసివేయుము. వాఁడు ధరించియుండు యుద్ధపుదుస్తులను దొలఁగింపుము. ఆ స్తుతిపాఠములు విజయనందుభి జయ ఘోషములు వేగనాపింపుము. వీనికి మర్యాదయొనర్చుటకై వచ్చు సైన్యమును మఱలింపుము. వీనికి స్వాగతము నొసఁగుటకై రాజద్వారమునఁ గట్టియుండు తోరణమును విజయపతాకను దొలఁగింపుము. నా సర్వాశలకు వీనినమ్మియుండినందుల కీవిశ్వాసఘాతుకుఁడీ ద్రోహినన్ను మోసగించెను. ఈ యల్పశునకమును నా యెదుటనుండి దూరమునకుఁ గొనిపొమ్ము. వీనిని బెడమోముగ గార్దభముపై నెక్కించి నగరప్రదక్షిణము చేయించి స్మశానమునకుఁ గొనిపోయి శూలమున గ్రుచ్చిచంపింపుము. అదియునుగాక యీ రాజద్రోహి శవమును గుక్కలు, నక్కలు, ఛిన్నాభిన్నములుగాఁ జేసిభక్షించునటులఁ జేయుము.

దుర్జ. దేవీ! కొంచెము దయయుంచి క్షమింపవలయును (ఏడ్చును).

మదా. దయయుక్షమయునా? ఇట్టివిశ్వాస ఘాతుకునెడలనవి యెట్లుదయించును? నా కాశాభంగము గలిగించితివి. నా జీవితమంతయు భీతిసంపూర్ణమయ్యెను. అటులుండ నిన్నుదయతోక్షమించుటగలుగునా?

దుర్జ. దేవీ! నేననన్యశరణుఁడను. నన్నుక్షమింపుము. నాపై దయయుంపుము. (మదాలసచరణములఁబట్టును).

కో. నీయట్టి విశ్వాసఘాతుకునిపైఁ జూపుటకొఱకు దయనుదైవము సృష్టింపలేదు. సేవకులారా? వీనిని మహారాజ్ఞి చరణములనుండి తొలగింపుఁడు.

దుర్జ. (సేవకులనడ్డగించి) వలదు. వలదు. నన్నిట్లు తొలఁగింపకుఁడు. నేను నిరపరాధిని. అనాథుఁడను. దేవీ! మీచరణములకడ నా కాశ్రయమొసఁగుఁడు. (చరణములనుగట్టిగఁబట్టుకొని) నాపై దయగలుగువఱకు నీచరణములనువీడను.

మదా. ఛీ! తొలఁగిపొమ్ము. నీయట్టి పౌరుషహీనునిపైఁ గాలత్రయములందును దయ గలుగఁజాలదు. (మదాలస దుర్జయుని గాలితోఁదన్ని లోనికి నిష్క్రమించును) (దుర్జయుఁడు మూర్ఛిల్లి భూమిపైఁబడును).

(రంగము ముగియుచున్నది)

---

# రాజభక్తి నాటకము

## అంకము 4. రంగము 1.

స్థలము. మృణాళిని యుద్యానవనము. (వనమధ్యమున నొకసమాధి. దాని యెదుట నొకబింబము నిలుపఁబడియున్నది. వేషాంతరము ధరించిన విక్రాంతుఁడాబింబమునొద్ద నిలిచియుండును.)

విక్రాం. (స్వగతము) రాత్రి మూఁడుజాములు గడచెను. అరుణోదయసమయ మాసన్నమగుచున్నది. నా చరణము లిచటినుండి కదలకున్నవి. అదియేల కో తెలియకున్నది. ఈ ప్రతిమనా చరణములఁ గట్టివేసియున్నది. నే నెంత ప్రయత్నించినను నా యంగకములు నా యధీనములుగాకున్నవి. ప్రియా! నీవు పాషాణరూపిణివయ్యు నా మనసును బూర్ణముగ నాకర్షించుచున్నదానవు. నీవు స్వర్గమునుండి మరల భువి కేతెంచిన నేనునీలోలీనమై పోదునేమో? ఏమోయను సందియముగలుగనేల? తప్పక యట్లేయగుదును. ఛీ! ఇపుడాగొంతెమ కోరకలేల? భాగ్యహీనుఁడగు నీ విక్రాంతున కామనో

హారరూపమెట్లు కన్పట్టును? నా మనస్సు నాక్రమించియుండు ప్రేమ యింక తొలఁగిపోవనిమ్ము. ప్రియురాలా! నన్నువదలుము. నీ సన్నిధానముననుండు కొలఁది నా వ్యసనమధికమగుచున్నది. ఎవని కిదివఱకు దుఃఖాశ్రువులు కలుగలేదో వానికా యిట్లశ్రువులు కాల్వలుగట్టి పాఱుట! నే నిచటనుండ నశక్తుఁడను. ఓ ప్రియురాలా! ప్రతిదినము నొకగడియసేపు నిన్ను స్మరించుట నాకుఁగర్తవ్యము. దేవాంగనా! నీవుచేసియుండు మహోపకారమునకు నేఁజేయు నీసేవయత్యల్పము. కాని నేనేమిసేయుదును? (బింబముపైన శ్రువులురాల నిలచియుండును. మృణాళిని చేత నొక పుష్పహారముగాని ప్రేమగీతము పాడుచువచ్చుచున్నది)

మృ. (స్వగతము) ఈ ప్రేమ మహిమ నేమనివర్ణింతును?

విక్రాం. కోకిలనాదమును ధిక్కరించు కర్ణరసాయనస్వనముతోఁ బ్రేమరసభరితమగు మధురగీతము పాడుచు నరుదెంచు నీమెయెవరు? రసశ్రేష్ఠమగు శృంగార మీమెగానమునఁ జిప్పిలుచున్నది. ఆహా! తెలిసెను. తెలిసెను. ప్రప్రథమమునఁ బ్రతిమారూపముననాకు దర్శనమొసఁగి విరహార్తుఁడగు నన్ను దనియింప దివినుండి భువికరుదెంచిన యీ దేవాంగనయే.

మృ. (విక్రాంతునిగాంచి) అచట నెవరు? అచటనిలచియుండు వారెవరు?

విక్రాం. (ముందటికివచ్చి) భయపడవలదు. నేనొకనిరుపద్రవప్రాణి.

మృ. నిరుపద్రవప్రాణియా?

విక్రాం. అగును. నీ వింతకుముందు పాడిన మధురమగు నా ప్రేమగీతమును విని నే నారసమున నిమగ్నుఁడనై యున్నాఁడను.

మృ. మీవంటి నిరుపద్రవప్రాణి యీ యుద్యానమునఁ బ్రవేశింపఁగారణమేమి?

విక్రా. దీనికిఁ బ్రత్యుత్తరమేమి యొసంగఁగలను? ప్రేమచేఁగట్టువడిన నే నిచ్చోటు వదలి యెట్లుపోవుదును?

మృ. మీ రిచటికివచ్చునపుడు మిమ్మెవరైన నడ్డగించిరా?

విక్రా. ఎవరు నన్నడ్డగింపలేదు. బ్రహ్మాండమునెల్ల నావరించియుండు ప్రేమతో సంచరించుచుండు నన్నిచటికి రాఁజనదని చెప్పనెవరికి సాధ్యమగును?

మృ. మీకుఁ బ్రేమయను వెఱ్ఱిపట్టినట్లున్నది.

విక్రా. ప్రేమయను వెఱ్ఱిపట్టని వారీజగమున నెవరు? దేవతలు సైతము ప్రేమపాశమునఁగట్టఁబడి మూర్ఖులవలె నటించుచున్నారు. అటులుండ ప్రేమవాగురలకుఁ జిక్కి యీ రాత్రియంతయు నిచటఁ దిరుగుచుండినను నందాశ్చర్యమేమున్నది?

మృ. ప్రేమకుఁజిక్కి యీ రాత్రియంతయు నిచటఁదిరుగుచుంటిరా?

వి|క్రా. అగును. నేనట్లేతిరుగుచుంటిని.

మృ. మీరుత్రోవదప్పి యిచట వచ్చితిరేమోయని భావించెదను.

వి|క్రా. కాదు. నేనుత్రోవఁదప్పలేదు.

మృ. మీరుద్దేశపూర్వకముగనే యిచ్చటికివచ్చితిరా?

వి|క్రా. అగును. ఉద్దేశపూర్వకముగనే వచ్చితిని. నా ప్రేమనిధి యిచట బహుబాగ రూకతతో నుంపఁబడియున్నది. దానిని వెదకికొనుచు వచ్చియున్నాను.

మృ. మీ ప్రేమనిధి యీ యుద్యానమున నుంపఁబడియున్నదా?

వి|క్రా. ఈ యుద్యానమున నిచటనేయున్నది.

మృ. ఏమి! ఈస్థలముననే!

వి|క్రా. అగును. ఇచ్చోటనే నా ప్రాణమునకన్న మిన్నయగు లోకోత్తరవస్తు సందర్శనము నాకులభించెను.

మృ. అదియెట్లుసంభవించెను?

వి|క్రా. ఎట్లుసంభవించె? అదెచూడుము. ఆప్రియ పవిత్ర దివ్యవస్తువుయొక్క స్మారకచిహ్నము నిలుపఁబడియున్నది (ఆబింబమునుజూపును).

మృ. ఏమి! ఏమి! ఇది మీ ప్రేమవస్తువుయొక్క స్మారకచిహ్నమా?

వి|క్రా. అగును. ఎచట నా హృదయము లీనమానో అట్టిచోటిది. ఇదివఱకును సమరాంగణమున నజేయుఁడుగనుండు నా మనసును గుణమును సర్వస్వమును దనవశముచేసికొన్న దేవత యీ మనోహరబింబమే.

మృ. మీరేమి యాడుచున్నారు?

వి|క్రా. నేఁజెప్ప దానంగ ప్పేమియు లేదు. ఏచోట నీ బింబమున్నదో యచటనే, నా ప్రియతమ, నాస్వామిని, యీ యార్తునిపైఁ బ్రేమావలోకనమొనర్చుచు నిలచియున్నది.

మృ. ప్రేమచే మీకు శరీరస్మృతిదప్పినట్లున్నది.

వి|క్రా. కాదుకాదు-నాకుస్మృతి దప్పలేదు.

మృ. అట్లే నీబింబము మీ ప్రియురాలిస్మారకచిహ్నమని యెట్లనెదరు?

వి|క్రా. ఏలకాదు? ఈ ప్రతిమయందు నా ప్రేయసియొక్క యసాధారణ సౌందర్యము నీకుఁగనఁబడలేదా? అనుపమలావణ్య భాండాగారమగు నీప్రతిమ నా ప్రేయసిదిగాక వేఱెవరిదిగ నుండనచ్చునో వచింపుము.

మృ. ఇంతకుపూర్వము నన్ను మీ రెచటనైనం జూచియున్నారా?

విక్రా. నేనిదివఱకు నిన్నెచటను జూచియుండలేదు ?

మృ. అట్లుండ నాబింబమును మీ ప్రేయసియని యేలనుడువుచున్నారు ?

విక్రా. ఈ బింబము నీయదియా ?

మృ. అగును.

విక్రా. ఔరా! నావలన గొప్పనేరముగలిగినది. అట్లగుటకుఁ గారణమేమి? ఇట్టి యసాధారణగుణముల కాటపట్టగు స్త్రీయెవరు? నన్ను క్షమింపుము. తెలియకనిన్ను నొవ్వనాడితిని. దీనికై నేనుమిక్కిలి వగచుచున్నాను. ఏ ప్రేమనునమ్మి నేనుదిరుగాడుచుంటినో యదియే నన్ను మోసగించినది. నా ప్రేమమయురాలగు దేవాంగన రూపగుణములకు లోఁబడి దాని నింతవిశ్వాసముతోఁ గొని చూడుచుండు నీవెవరు ?

మృ. దేవాంగనయొక్క! ఆహా! మీరుమహారాజు.

విక్రా. ఆ హతభాగ్యుఁడను నేనే-నీవెవరవు?

మృ. మీరు నన్నిపుడు మఱచితిరి. నేనపరచితురాలనుగాను. నన్నీవఱకుఁ జూచియేయున్నారు.

విక్రా. నేను నిన్ను జూచియుంటినా? నాకటుదోఁచుటలేదు. కాని నీవు శ్రీకాంతుని కుమారివగు మృణాళినివా?

మృ. ఇప్పుడు నన్ను గుర్తించితిరి.

విక్రా. నీవిషయమున నేను మిక్కిలి యన్యాయమొనర్చితిని. ఏస్త్రీ నాప్రియురాలిని నాకుమారుని సద్గతినొందఁ జేసి నానంతకృతజ్ఞతకుఁ బాత్రురాలయ్యెనో అట్టి స్త్రీబింబమును, వేఱుగాభావించి మహాపాపము నొడిగట్టుకొంటిని. మృణాళినీ! తెలియకచేసిన యీ యపరాధమునకై నాపైఁగోపగింపకుము. దేవాంగన దహింపఁబడినచోటు చూడవలయునను నుత్కంఠతోనుండుట వలన నా కిట్టిభ్రాంతి గలిగినది. దాననిట్టిప్రమాదము వాటిలెను.

మృ. దీనం బ్రమాద మేమియునులేదు.

విక్రా. నీమాటలవలన నీవు నన్ను క్షమించినట్లు నాకుఁదోఁచెడిని. మృణాళినీ! దేవాంగనా దహనస్థానమెచటనున్నది? నామనము తద్దర్శనమునకై యెంతయుం దొందరపడుచున్నది. గనుక నన్నచటికిఁగొనిపొమ్ము.

మృ. మహారాజా! ఇదె చూడుఁడు. దేవీదహనస్థల మీపార్శ్వముననేయున్నది.

విక్రా. చూపుము. చూపుము. పరమపావనమగు నా ప్రియురాలియొక్క దహనస్థానము చూపుము. నేనుదానిని దర్శించి కలుషవిదూరుఁడనగుదును.

మృ. (మండపమునఁజూపి) మహారాజా! ఇదియే యాస్థలము. ఈ మండపము గాంచితిరా? దేవాంగనా దేవియొక్క పవిత్రమగు నస్థికలములీ మండపము క్రింద సుఖసమాధి నానందమునను భవించుచున్నవి.

విక్రా. మృణాళినీ! ఇంతకుమున్న మండపముగాంచితిని. దీనియడుగునఁబరమ పావనములగు దేవాంగనయొక్క యస్థులుంపఁబడియున్నవా? ఆహా! భూమికి రత్నగర్భయను నామమునేఁడు సార్థకమయ్యెను. మృణాళినీ! ఈ మందిర మునుగట్టించిన వారెవరు? నా ప్రియురాలి నింతగౌరవముచేసిన వారెవరు? ఎవరి యుపకారమునకు నేనుగృతజ్ఞుఁడు గనుండవలయు? చెప్పుము. మృణా ళినీ! నే వారిందర్శింపవలయును. నేనట నా కృతజ్ఞతనుఁదెలుపవలయును. వారిచరణ దర్శనమునకు నామనమాతురపడుచున్నది. ఆ మహాత్ములెవరో నా కెఱింగింపుము. ఏమి స్తబ్ధవై యున్నావు! ఏల మాటలాడకున్న దానవు? ఇది నీయొక్క యుదారకార్యమా? అవునవును. నిజముగ నిదినీకృత్యమే-మృ ణాళినీ! ఏ స్త్రీ మదాలసయొక్క యుగ్రకోపమునకుఁ బాలయ్యెనో, ఎవరి పవిత్రశరీరము జీవముతో నుండునపుడే యాయధమాధములు దుష్టమృగ ముల వాఁతవేసిరో యట్టి నా ప్రియురాలి యస్థులపై నీవు దేవతాయోగ్య మగు మందిరము నిర్మింపఁజేసితివి. ఆహా! నీ గొప్పతనము నేనెంతని కొని యాడుదును? నీవు నిజముగ భూలోకవనితవుగావు. స్వర్గమునుండి భువికవ తరించిన యొక దేవతవు ఈ నీయుపకారమునకై నేనేమి ప్రతికృతి సేయఁగలను!

మృ. దీననుపకారమేమున్నది. నేను జేయవలయుదానింజేసితిని.

విక్రా. ఈ ప్రత్యుత్తరము నీశీలమున కత్యంతశోభను గలిగించుచున్నది. మృణాళి నీ! స్వర్ణప్రాసాదమున నుండవలసినదాన వీసమయమునని టెందులకు వచ్చితివి?

మృ. మహారాజా! దేవికిఁ బ్రేతసంస్కార మొనర్చిననాటినుండియు నిచటనేయున్న దానను.

విక్రా. అదియెందులకు?

మృ మహారాజా! నేను దేవీసమాధికిఁ ద్రికాలపూజ యొనర్చు నియమము గైకొని యుండుటచే నిచటనే యున్నాను.

విక్రా. ఏమి! అట్టులనా?

మృ. అగును.

విక్రా. నీ వీప్రాతఃకాలమున నంతఃపురమునందు నీ సుఖశయ్య బరిత్యజించి భూగర్భ

మున స్థిరముగ శయనించియుండు ననాథయు ననాశ్రయయునగు నొకస్త్రీ యొక్క ప్రాతఃకాలపూజకొఱ కిచట నున్నదానవు. నీ చర్యలునన్ను నిశ్చేష్టితునింజేసెను. ఈ సమయమున దేవాంగనా వియోగమునకై దుఃఖింప వలయునో లేక యామెకుఁ గలిగినపరమభాగ్యమునకై సంతోషింపవలయు నోయనుట నాకుఁ దెలియకున్నది. మృణాళినీ! నీవీకృత్యమువలన నన్ను నీ కెల్లపుడు ఋణస్థుఁడగున ట్లొనర్చితివి. నా దేవాంగన సమాధికి వందన మొనర్ప నామనం బుత్సాహము పొందియున్నది. మొట్టమొదట నీ కభి వాదనమొనర్ప నా కనుజ్ఞయిమ్ము.

మృ. అట్టిగౌరవమున కీ దాసురాలు దగిన పాత్రముగాదు.

విక్రా. మృణాళినీ! నీ వెట్లనాడుము. నీయాదరము నా మనసు నిండియున్నది. కావుననే నీ సన్నిధానమున నిట్టిమాటలు నానోటినుండి వెలువడుచున్నవి.

మృ. దేవరవా రిట్టిగౌరవమొసఁగుటకుం దగుప్రభావమిట నేమియులేదు. మహా రాజుగారియొక్క నైసర్గికమగు శీలమును, నందులకుఁదోడుగనీ సమాధిని నుం డు నీ దేవతయొక్క మహిమయుంగూడి నా కింతటి సన్మానముగల్గించు చున్నది.

విక్రా. మృణాళినీ! నా ప్రియురాలగు దేవాంగనయందు నీకుఁగలిగియుండు నుత్కృ ష్టప్రేమను జూచి నామనసునకెంతయునానందము గలుగుచున్నది. (సమాధి నుద్దేశించి) ఓ దేవాంగనా! నా చర్మచక్షువులకు నీ వగపడకున్నను భా వ్యాంతర దృష్టికి నీ దివ్యతేజోమయమూర్తి స్పష్టముగఁ గనిపించుచున్నది. నేను నీకు బ్రేమపూజ వేఱువిధమున నొనర్పలేకున్నాను. కాని యో ప్రేయసీ!

మృ. మహారాజు దేవీపూజకొఱ కేర్పరచిన యీ హారము గైకొనవలయును. (హార మొసంగును).

విక్రా. నా హృదయకమలముకంటె నీ పుష్పము లెక్కుడువిలువగలవియా? అట్లనం డుము. (హారము నెత్తుకొని) మృణాళినీ! ఈ హారమును దేవికిసమర్పించుట కై మిక్కిలి భక్తితోసిద్ధపఱచియున్నదానవుగదా! కాఁబట్టి యీ పుష్పము లలో నొక్కొక్కదళమును నా హృదయకమలమునకంటె మిక్కిలి విలువగల దనియే భావించెదను. (సమాధిపై హారము వేసి మోకాళ్లొడ్డి కూర్చుండును.)

మృ. (స్వగతము) ఆహా! ఈ యంగనా ప్రేమయొక్క సామర్థ్యమెంతయు గాఢము.

విక్రా. మృణాళినీ! అయిదువత్సరములకుఁ బూర్వమిచటజరిగిన కలహమున దేవాం గన నా కెట్టిసహాయ మొనర్చెనో యట్టిసహాయమిపుడు నీవొనర్చు

చున్నావు. నాకునీవుమిక్కిలి యుపకారమొనర్చి యున్నదానవు. దానికిఁ దగు ప్రత్యుపకారము చేయనేనశక్తుఁడను. నా సంతోషమునకు చిహ్నముగ నీ యంగుళీయక మిచ్చువాఁడను. నీవు దీనింగైకొనుము. రెండువత్సరములకుమున్న విక్రమాదిత్య మహారాజు నాకు బ్రహ్మావర్తరాజ్యము ప్రజాసమ్మతినిగైకొని యిచ్చుటకు మూఁడవసారి ప్రయత్నించెను. అట్టి సమయమున దానిని స్వీకరింపనని దృఢనిశ్చయుఁడనై యుండుటగని మహారాజు నాయెడఁ బ్రసన్నుఁడై రాజప్రీతికొఱకును లోకప్రీతికొఱకును నీ కరవాలమును, నీ యంగుళీయకమును మిక్కిలి ప్రీతితోనొసంగెను. పిదపనేను నానిర్మలప్రీతి సూచకముగ దేవాంగనవ్రేల నిడియుంటిని. దానిని దేవాంగనా తుల్యచరిత్రవగు నీకర్పించుచున్నాను. దీనిని స్వీకరింపుము. ఈ ముద్రికా ప్రభావమున నేను సంపాదించినకీర్తిని నీ కర్పించుచున్నాను. దేవాంగనతో సమానముగ జనులయొక్క ప్రీతి నీయందుఁగలుగునట్లుపరమేశ్వరుఁడను గ్రహించును.

మృ. నేనిట్టి సత్కారమునకుఁ బాత్రురాలం గాను-కాని మహారాజు ననుగ్రహమని యీ ముద్రికను గైకొనుచున్నాను.

విక్రా. నా గుప్తస్థలమువీడి యీ స్థలమును దర్శించుటకై మాఱువేసమున నిచ్చట నేను నిన్నరేయంతయుఁ దిరుగుచుంటిని. నా మిత్రులు నాకైనిరీక్షించుచుందురు. ఈ స్థలమువదలి పోవుటకు నాకుఁగాలుకదలకున్నది. ఉపాయాంతరము లేనందున పోవనేవలయు. కాఁబట్టి నాకు వెడలనుత్తరవొసంగుము. నీ యుపకారమునకై నీకెల్లపుడు నేనుబద్ధుఁడనై యుందును.

మృ. మహారాజు చరణములయొక్క:—

విక్రా. [ఆమెమాటల కడ్డువడి] వలదు. మృణాళినీ! నీవిట్టిమాటలాడకుము. నీవు వనితాకోటికంతయునొక శ్రేష్ఠమైన రత్నమగుదువు. నాయట్టివారు నిన్నెల్లప్పుడాదరముతో సన్మానింపవలయును. నీ యీ యుపాసన జరుగుచుండనిమ్ము నీవీదేవతకు మందిరము స్థాపించి యెంతభక్తితోఁ బూజయొనర్చుచున్నావో యంతయాదరమున నాహృదయకమలమున నిన్నుపాసించుచున్నవాఁడను. ఈ యమపరలోకమున సుఖమొందవలయునని నీవు ప్రార్థించురీతి నేను నీవెల్లపుడు, నెచ్చోటను సుఖముగ నుండవలయునని యా పరమేశ్వరునిం బ్రార్థించుచున్నాను. నేను బోయివత్తును. మనయుభయుల ప్రేమవర్ధిల్లుఁగాక. (ఆ యమనమస్కరించును. విక్రాంతుఁడామెను లేవనెత్తును. సమాధినిజూచుచుఁబోవుచున్నాడు.)

---

## అంకము 4. రంగము 2.

### మదాలసదర్బారు:—

[ప్రవేశము. కోదండుఁడు. దుర్జయుఁడు. బంధింపఁబడిన సర్దారులు.]

కో. విక్రాంతుఁడు మనకువిరుద్ధముగ నొనర్చునేర్పాట్లు మీకందఱుకు చక్కఁగఁ దెలియునని నేనెఱిఁగియున్నాను.

దుర్జ. (సర్దారులఁజూచి) విక్రాంతుని విషయమున మీరెఱింగినవెల్లయు నుడువరేని మిమ్ము సకుటుంబముగ నిర్మూలమొనరింతుము.

మొ-సర్దా. మీ యిష్టానుసారము మాశిరముల ఛేదింపుఁడు.

(మదాలసయు మృణాళినియుఁబ్రవేశించుచున్నారు)

మదా. నాకృపను నీవిట్లుతిరస్కరింపకుము.

మృ. నీకృపవలన నాకుఁగలుగు లాభమేమి ? నీవు నాకేమియొసఁగఁగలవు ?

మదా. నాస్నేహమును నీవు సంపాదించుకొనిన నీలోకమున సర్వసౌఖ్యములు నీకుఁ గలిగింతును.

మృ. అమ్మా ! వలదు. నా కాతుచ్ఛసుఖమువలదు. రౌరవమునస్థిరముగఁ బడియుం డునాశ నాకెన్నఁటికినివలదు.

మదా. దేవాంగనగన్న దుర్గతినంద నాశగొని యుంటివే ?

మృ. దేవాంగనా దేవికిఁగలిగిన గతినాకుఁ గలునంతటి భాగ్యము గలుగునా ?

మదా. చింతిల్లకుము. దేవాంగనకు వలెనీనొసటఁగూడ రౌరవనరకమునఁ బడవల యునట్లు వ్రాసియున్నది. అదితప్పదు. బాగుగ నెఱుంగుము.

మృ. అమ్మా ! రౌరవము, నీరాక కెదురుచూచుచున్నది. ఇదెచూడుము. దేవాంగన స్వర్గమునఁ బరమేశ్వరుని యర్ధాసనమున విరాజిల్లుచున్నది.

మదా. చాలమంచిది ! నిన్నుంగూడనచటికంపెదను. (కోదండునిఁజూచి) కోదండా ! ఈ విశ్వాసఘాతుకు లేమిచెప్పుచున్నారు ?

కో. వీరందఱికిని వెఱ్ఱిపట్టియున్నది.

మదా. సరి. ఈ దురాత్ములిటులనే హఠ వహించియుండిన వీరికుమారులను వీరి కంటియెదుట నఱుకుఁడు. అప్పటికిని వీరు మనదారికి రానియెడల వీరిభార్య లను, దల్లులను, నక్కసెల్లెండ్రను భయంకరహింసలకు లోఁబఱుపుఁడు. తమ స్త్రీల యాతనల నవలోకించి ఱాతివంటి వీరిహృదయములు చలింపవేనేని యాస్త్రీలఁజంపివేయుఁడు. అప్పటికిని వీరుహఠము వదలనియెడల పెద్దబండ చే వీరితలలఁ బగులఁగొట్టి చంపివేయుఁడు.

కో. దేవియొక్క చిత్తము.

దుర్జ. ఓరీ! మూర్ఖులారా! మీ కేలయిట్టి దుర్దశపాలయ్యెదరు? ఇప్పుడైన జాగరూకతనొందుఁడు.

రెం-సర్దా. మానహీనముగ బ్రతికియుండుటకంటె గౌరవముతో నుండునపుడెంత ఘోరమగు మృత్యువు గల్గినను మేమోర్చికొందుము.

మదా. మృణాళినీ! ఈ శిక్షనువింటివా? చూడుము. నీవుస్త్రీవి. నీయొక్క హఠము కొఱకునిరపరాధులగువారలిందఱికిఁ బ్రాణములు పోవనున్నవి. ఇట్టిసందర్భమున నేస్త్రీచిత్తమైనను మార్దవము వహింపదా? నీవైన నావిక్రాంతుని వృత్తాంతము మాకిపుడు చెప్పుము. ఈ హఠవాదులు నా దృఢవైరులు గనున్నను వీరినిక్షమించి నీకుజీవదాన మొసంగెదను.

మూ-సర్దా. మృణాళినీ! సత్యమను వృక్షమును సమూలముగఁ దెగనఱుకఁజూచు నీ పిశాచముయొక్క కపటోక్తులకులోఁబడి మోసమందకుము. మాయందఱితో నరకమునఁబడకుము.

మృ. మీరందఱు నిశ్చింతగనుండుఁడు. ఈ మృణాళిని శరీరమునఁ బ్రాణముండువఱకు దానినోటివెంబడి సత్యమునకు విరోధమగు నొకమాటయేని వెలువడదు.

మదా. మృణాళినీ! ఇప్పుడైన బాగుగ నాలోచింపుము. యువకులగు విక్రాంతుని మిత్రుల నీ కష్టమునుండి విడిపింపుము. ఇట్టిపురుషశ్రేష్ఠుల నేలకష్టముల పాలుగావించెదవు?

మృ. సూర్యకుల సంరక్షణమునకై యిపుడువీరిని బలిగనొసఁగవలసియున్నది. అందుల కేమిచేయనగును?

మదా. హఠవాదినీ! హాగరెక్కినదా? వెఱ్ఱిపట్టెనా? (సేవకులంజూచి) వీరింగొని పొండు. వీరిశిరములపై శిలలవర్షింపఁజేయుఁడు. తలలబ్రద్దలు గావింపుఁడు. (సేవకులు బంధితులతోఁ బోవుచున్నారు). మృణాళినీ! ఆ చంద్రశేఖరుని కొఱకు మీరందఱింతకష్టముల ననుభవింప సిద్ధముగనున్నారుగా! ఆ యధముఁడు మీ కేమి మేలొనర్చెను?

మృ. వాఁడుమేలుచేసినను లేకున్నను మాకురాజగునుగదా? కాఁబట్టి యతనికొఱకు వచ్చునాపదల ననుభవించుటకు మేముసిద్ధముగ నున్నారము. ఇదిరాజనిష్ఠ గలిగిన ప్రజలయొక్క ధర్మము.

మదా. చంద్రశేఖరుఁడు మీకురాజా! అట్లైనినేనెవరు?

మృ. నీవా! నీవొక యమానుష వికారములచే సృజింపఁబడిన విషజంతువు.

అమంగళకరపాపరసములచే నిర్మాణముగావింపఁబడిన యొకయెముకలబొమ్మ. మహారౌరవమునఁ బడఁబోవునొక యధమస్త్రీ. పాతకరాశివయ్యు రాజ్యలక్ష్మియను మందిరము ప్రవేశించిన యొకదొంగవు. అట్టి నిన్ను రాణియని యెవరుచెప్పఁగలరు?

మదా. మృణాళినీ! నోరుమూయుము. నీకుఁదెలియులేదా? ఎట్టిస్త్రీయెడ నీకువైరము గలిగియున్నది?

మృ. స్త్రీయను పవిత్రనామము నీవుచ్చరింపవలదు. నీవుస్త్రీవెట్లగుదువు? నీవు పిశాచివి. బ్రహ్మావర్త సామ్రాజ్య సింహాసనమును నీ వెటుల బలాత్కారమున హరించితివో యదే రీతి స్త్రీయను పవిత్రనామమును వహింపఁజూచుచున్నావు. ఎవతెకు హృదయమందావంతయు మృదుత్వములేదో ఎవతెదయాగుణమునకు దృఢవైరిణియో, ఎవతె మనుష్యులరక్తమునకై యెల్లప్పుడు నాతురపడుచుండునో దానిని స్త్రీయని యెవరుచెప్పఁగలరు?

బంధితులు. (నేపథ్యమున) మృణాళినీ! మేముమరణించుచున్నాము. నీవు నీసత్యమునుండితొలఁగవలదు. దేవుఁడు నీ సద్బుద్ధిని స్థిరముగ నొనర్చునుగాక.

కో. (ప్రవేశించి) దేవీ! వారందఱిని నలఁగఁగొట్టిచంపితిమి.

మదా. ఇపుడీసర్పిణికిఁ ద్రోవఁజూపవలయును.

మృ. నీ యిష్టానుసారమున గొంపొమ్ము. నేనొకతె పోయిన నాకుఁ బిమ్మట నగ్నితో సమానలగుచు విషము గ్రక్కెడిసర్పిణులు పదుగురుదయింతురు. ఎంతవఱకు నీవీసద్గుణములను నిర్మూల మొనర్పయత్నించుచుందువో యంతవఱకిట్టి సర్పిణులసంఖ్యాకములుగఁ బుట్టుచునేయుండురు. దీని నెఱుంగుము.

మదా. ఈ బ్రహ్మావర్తమున స్త్రీలుగూడ నిట్లుచరింతురని నేనెన్నలేదు. దుర్జయా! పొమ్ము. ఇపుడే రాజగృహ బహిః ప్రదేశమున దీనింగాల్చివేయుము. పొగతో దాని ప్రాణము పైకెగయునపుడు నేనానందముతో నా మేడపైనుండి చూచెదను. దీనిసర్వాభరణములను దీసివేయుఁడు. దీనినగరిని నేలమట్టముగావింపుఁడు. దీనియాప్తులను బంధింపుఁడు. ఇట్టివారిని సమూలముగ నాశమొనర్పఁ గంకణముగట్టుకొనియున్నాను.

(అందఱునిష్క్రమింతురు.)

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము

అంకము. 4 రంగము. 3

స్థలము. దర్బారు వెలుపలిచోటు:—(మదాలస యాసనమున నాసీనయయి యుండును. దర్బారునకు ముందగ్నిగుండము ప్రజ్వరిలుచుండును. పలువురు పౌరులుచేరుచున్నారు. కోదండుఁడు, దుర్జయుఁడు మున్నగువారు నిలువఁబడియున్నారు. వచ్చినపౌరులలో శిష్ఠజను లనేకులు దీనవదనములతో మదాలసను వేఁడుకొనుచున్నారు.)

మొ-పౌ. దేవీ! దీనురాలగు మాయాజనని నిట్లువధించుట యనుచితముగాన మన్నింపుఁడని రాజనిష్ఠావిష్టులమగు మేము మీదివ్యపాద పద్మముల చెంత విన్నపించుకొనువారము.

మదా. దీనినిప్పుడే చితిపై నెక్కింపుఁడు. (సిపాయీలట్లొనర్తురు. అడ్డముగనొక గోసాయినిలుచును.)

మొ-గో. దేవీ! వలదు. వలదు. ఈమెపై నింతకోపము వలదు. ఈ దీనురాలిపై దయచూపుము. ఈమెకింకను లోకానుభవము గలుగకున్నది.

కో. దీనియపరాధ మంత్యతము. కాఁబట్టి క్షంతవ్యురాలుగాఁజాలదు. మీరేమి చెప్పినను మేమువిననొల్లము.

రెం-పౌ. ఈ యమజనకుల యసమాన గౌరవమును నీమెసద్గుణపుంజమును మీచిత్తమునకుఁ దెలియునుగాన నీ ఘోరకార్యము మానింపుఁడు.

మూ-పౌ. పౌరవంశసంసేవనమున నీ బిడసాటిలేనిది.

మొ-పౌ. ఈమెయపారమగు రాజసేవనొనర్చెను.

రెం-పౌ. మనరాజ్యమున నొక్కొక్క నగరమునను నీమె యౌదార్యముఁగొనియాడనివారలెవరు?

మూ-పౌ. మనరాజ్యమందలి ప్రజలెల్లరు నీ బిడయాచరించి యుండునుపకారమునకు బద్ధులై యీామెకు ధన్యవాద మొనర్చుచున్నారు.

మొ-పౌ. మనరాజ్యమున మాత్రమకాక యన్యరాజ్యముల యందును నీమె యశోగీతములు పాడఁబడుచున్నవి.

రెం-పౌ. అట్టి మహాభాగురాలికా యిట్టిఘోరమరణము? ఇది మాకెవ్వరికి నంగీకారముగా నేరదు.

దుర్జ. అపరాధిని నిట్లుస్తుతించి, తప్పును మన్నింపవేఁడుట యీ యాస్థానము నెడ నపరాధము గావించి నట్లగును. ఇదియసభ్యమగును.

మూ-గో. మీ యిచ్చు చొప్పున నిదియసభ్యమైనను, మాకిట్టివేఁడికో లెంతయు సభ్యమయగును.

మదా. దాని నింకనేల యిచటికిఁదోడ్కొని రాకయున్నారు ?

కో. దేవీ ! అదియిపుడే యిచటికిఁదోడ్కొనిరాఁబడును.

మదా. పొమ్ము. శీఘ్రముగఁదోడుకొనివచ్చి నా యెదుట నిలుపుము (మృణాళినిగొని రాఁబడును.) ఓసీ ! అయోగ్యరాలా ! విక్రాంతుఁడెచటనున్నాఁడు ? చెప్పుము.

మృ. నా జిహ్వాశతవిధముల ఖండింపఁబడినను నా వృత్తాంతము వెలువడఁజాలదు.

పౌరులు. బాగు ! బాగు !

మదా. నీ విట్లుపిశాచివలెఁజరింపకుము. ఎదుటనుండునగ్నిగుండ మెవరికొఱకనుట యెఱుఁగుదువే ? అదినిన్ను స్పర్శింపకమున్నే నీతనువును గాపాడుకొన యత్నింపుము. ఇదిమృత్యులోకమునకుమార్గము. మార్గమననేల ? మృత్యు లోకమ యిదియగును.

మృ. నశ్వరమగు నీ లోకమున మృత్యువ్యసనమున భీతిలువారు పామరలు. ప్రాణి కోటిజనించునపుడే మృత్యుముఖమును నిరీక్షించుచుండును. ఇదియొకటిగాదు. ఇట్టివి నూఱుగుండములున్నను నా హృదయమును గంపింపఁజేయనేరదు.

మదా. సేవకులారా ! ఈ గోసాయిని వెంటనే దూరముగఁదొలఁగింపుఁడు (వానిని సిపాయిలావలకుఁ గొనిపోవుచున్నారు. అప్పుడు మఱియొక గోసాయి ప్రవేశించును.)

రెం-గో. మహారాజ్ఞీ! మీరుగొప్పవారు. మహారాజ్ఞియనగుచున్నారు. గొప్ప వారికి దయయే భూషణము.

మదా. వీనినిగూడ దూరముగఁ గొనిపొండు.

కో. వీనినిద్రోసివేయుము. (ఇరువురను సిపాయీలుత్రోసికొని పోవుదురు. అప్పుడు మూఁడవ గోసాయి ప్రవేశించును. జనసమూహామునఁ గలకలము గలుగును.)

మూ-గో. అశాశ్వతమగు నీ ప్రపంచమున నీవొక్కరితశాశ్వతముగ నుందువనితలఁచి మఱియొకరిని గష్టపెట్టుట యుక్తముగాదు.

నా-గో. (ముందఱికివచ్చి) దేవీ ! కాలము కొంచెము సేపు జనులకు సుఖమునుజూపి నరకమునకుఁ గొనిపోవుచున్నది. కాఁబట్టి యెట్టియపరాధులకును దండన మొనర్చునపుడు మనముమిక్కిలి పరిశీలించి చేయవలయును.

మదా. కోదండా ! ఆస్థానమంతయు గోసాయీల వారములతో నిండియున్నదేమి ? ఏల మనసేవకు లట్లజాగ్రత్తతోనున్నారు? ఈ దహనకార్యము పూర్తి యయినపిదప సేవకుల నా యెదుటికిఁగొనిరమ్ము. ఈ మూఁకనంతయు వెనుక

కుం దఱిమింపుము. ఏమీ! వీరందఱు గలహామున కుపక్రమించునట్లు తోఁచెడిని. నీవు నిట్టిసమయమున నేల జాగరూకుఁ డవుగాకుంటివి? (సేవకులు గోసాయీలను వెనుకకుఁ ద్రోసెదరు.)

మూ-గో. మీకిష్టమయిన మమ్మీరాజగమునుండియే తొలఁగింపుఁడు. కాని యీ కార్యమువలనఁ బశ్చాత్తాపముగలుగక యుండదు. మహారాజ్ఞీ! మీరు మీయొక్క, మీ రాజ్యముయొక్క గౌరవమును గోలుపోవుచున్నారు. దీనిని బాగుగ నెఱుంగుఁడు.

మదా. (మృణాళినింగాంచి) ఎవనికొఱకు నీ సకలసౌఖ్యములను గాల్చి వేయనున్నావో వాఁడు నీ యీనిష్ఠకుఁ బాత్రుఁడుగాఁడు.

మృ. నా నిష్ఠకుఁ బాత్రుఁడగు వాఁడు మహాత్ముఁడు.

మదా. మహాత్ముఁడా! ఓసీ! బేలా! మృణాళినీ! నీవిషయమున నాకనుతాపము గలుగుచున్నది. స్వార్థమునకై నీయట్టితరుణ వయస్కురాలిని బలియిచ్చుటకు సిద్ధముగ నున్నవానిని మహానీయుఁడ నెదవా? ఇట్టి నిన్నేమందును?

మృ. అమ్మా! సమయానుసారమగు నీ వార్తలకు నే మోసపోవుదాననుగాను ఎందుకీ వృథాలాపములు? (జనులలో దుఃఖము. కలఁత).

జనులు. బుద్ధిమంతురాలగు నీ స్త్రీ పురుషునివలె మాటలాడుచున్నది. మిక్కిలి బాగు.

మదా. బాగు బాగని యఱచువాఁడెవఁడు? ఇఁక నెవ్వరైన నీ రీతింగూఁత లిడినవారు బంధింపఁబడుదురు. (సేవకులంజూచి) కట్టెలను బాగుగవేసి నిప్పురగులఁ గొల్పుఁడు. (నౌకరులట్లు చేయుదురు) (మృణాళినింజూచి) మృణాళినీ! నిన్ను జుట్టుకొనియుండు నీ భటులు సామాన్యులుగారు. వారుభయంకర రూపముల ధరించిన యమదూతలు. వారినిజూచియైన బుద్ధి తెచ్చుకొనుము. స్వర్ణసమానమగు నీ యౌవనమును మంటఁగలుపకుము.

మృ. విశ్వాసఘాతుకులగు మీ యానందమును జూచుటకంటె రాక్షసివగు నీచేఁగల్పింపఁబడిన యీ యగ్నిగుండమున యువతినగు నేను బడిచచ్చుటయే మేలు.

జనులు. బాగు-బాగు. (కరఘోషములు చేయుచున్నారు)

మదా. కోదండా! వీరీలాగునఁ గలఁతయొనర్చిరేని వీరికి శిరశ్ఛేద మొనరింపవలసి యుండును.

కో. (జనులనుజూచి) జనులారా! మీరు మర్యాదమీఱి ప్రవర్తించితిరే నదిమహారాజ్ఞి యెడనొనర్చిన గొప్ప యపరాధమగునని మాయభిప్రాయము.

మదా. కాదు: కాదు. మీవర్తనలు చూచు నెడ నవి నాకొనర్చు ద్రోహమనియే తోఁచుచున్నది. ఇఁక మీఁద నెవరైన మాటలాడినఁగాని కలఁతయొనర్చినఁ

గాని యీ క్షణముననే వారినీయగ్నిగుండమునవైచి జీవముతో దహింపఁ జేయుదు. మృణాళినీ! ఇపుడా విక్రాంతుని బిలువుము. అగ్నిగుండమున నీవుఁ గాల్పఁబడు నపుడు వాఁడు నిన్నెటులఁ గాపాడునో చూచెదఁగాక.

గోసా: (జనస్తోమమునుండి) విక్రాంతుఁడు బ్రతికియుండ నీమెకు మృత్యుభయ మావంతేనిం గలుగనేరదు.

మదా. ముంజేతికంకణమున కద్దమేల? విక్రాంతుఁ డీదేశమున-కాదు-ఈ లోకమున నెచ్చటనుండినను మదాలసనుండి యీ నీచురాలిని గాపాడ నతనికి సాధ్యముగాదు. మృణాళినీ! చచ్చుటకు సంసిద్ధవుగమ్ము.

మృ. నేనుమరణింప సిద్ధముగనున్నాను. జనులారా! నాకు సెలవిండు. మీసాను భూతికిఁ గృతజ్ఞురాలను. ఇట్లెల్లప్పుడు నాపై నభిమానముండనిండు. పవిత్రమగు రాజకార్యమునకై నాకు మరణముగలుగుచున్నది. కావుననిది నాకు సంతోషకరము. చంద్రశేఖర విక్రాంతమహారాజుల విషయమున మీకుండుఆను నెక్కుడు శ్రద్ధయుండనిండు-బాలవసంతునియొక్క యాత్మయజ్ఞము-దేవాంగనా దేవియొక్క రాజభక్తి-రాణీసరోజినియొక్క సత్యప్రియత్వము.

మదా. చాలును-దాని నింక మాటలాడనీయకుము.

మృ. ఓ బంధువులారా! ఈశ్వరుఁడు మిమ్మెల్లపుడు సుఖింపఁజేయును.

మదా. చాలును. నోరుమూసికొనుము.

జనులు. ఆమెను బలుకనిమ్ము (జనులలోఁగలకలము)

మదా. కోదండా! ఇపుడే వీరికిఁదగుశిక్ష సేయవేల?

జనులు. మృణాళినీ! దేవుఁడునీకు సద్గతియొసఁగుఁగాత-దేవా! దేవా!

మదా. దేవుని నామమునాస్మరించెదరు? మిన్నువిఱిగిపైఁ బడువఱకు దిజరుగనిండు. ఏల యింకనగ్నిని బాగుగఁబ్రజ్వరిలఁ జేయకున్నారు?

మృ. విక్రాంతమహారాజా!

జనులు. విక్రాంతమహారాజా! విక్రాంతమహారాజా!

మదా: (బిగ్గరగ) విక్రాంతా! ఏమూల నెచటనుండినను నీ భక్తురాలిని గాకాపాడుటకై వెంటనేరమ్ము. నీసహకారిణియగు దీనిసుఖానుభవము పరికించితివా?

మృ. విక్రాంతమహారాజా! విక్రాంతమహారాజా!

విక్రాం. (గోసాయివేసమునఁ బ్రవేశించి యావేషముతీసివైచి తన్ను బ్రకటించుకొనును. విక్రాంతుని భటులు తమవేషములఁదీసివైచి కరవాలములు

గైకొని చితిచుట్టుకొనిచల్లార్పుచున్నారు) చూడుము. చూడుము. మదాలసా! ఈ విక్రాంతునిజూడుము. తనభక్తురాలియొక్క యార్తధ్వనినివిని యిచ్చటికిఁ బరుగిడివచ్చియున్నాఁడు. నీవు నీసర్దారులు నిలుచు చుండఁగనే యీ నా సహకారిణిని యముని బారినుండి తప్పించియెత్తుకొని పోవుచున్నాఁడు. ఇపుడు నీకు సామర్థ్యముగలదేని వెల్లడింపుము. ఇదెచూడుము. నేనుబోవుచున్నాను. (చితిపై నెక్కి మృణాళిని నెత్తుకొనిపోవును. శంఖనాదములు జయఘోషములు వినఁబడును.)

మదా. (బిగ్గరగ) పట్టుఁడు. అందఱనొక్కతూఁటియే బంధింపుఁడు. కొందఱిని శిక్షింపుఁడు.

కో-దుర్జ. శిక్షింపుఁడు. శిక్షింపుఁడు. సింహనాదముచేయుఁడు. యుద్ధమునకు సైనికులసిద్ధపఱుపుఁడు.

విక్రా. (చితినుండి క్రిందదిగి) జనులారా! నాకు మార్గమువదలుఁడు. రక్తపాతము-నా బంధువులలో రక్తపాతము నాకరవాలమునకుఁ గలుగఁగూడదని నా యభిప్రాయము. నాకువిరుద్ధముగ జరిగియందువలన రక్తపాతము గలిగినయందు నా దోషమేమియునుండదు (జనులు త్రోవవదలుదురు. సింహనాదము, శంఖనాదము. జయఘోషము. విక్రాంతుఁడు మృణాళినిని దీసికొని తనపరివారముతో వెడలిపోవును).

మదా. (బిగ్గఱగ) వానివెంబడింపుఁడు. పరుగెత్తుఁడు. పొండు. నాయశ్వమునుగొనితెండు. నా కఠారిని గృపాణమును దెండు. (స్మృతితప్పి పడనున్న మదాలసను గోదండుఁడు దుర్జయుఁడును బట్టుకొందురు)

రంగము ముగియును.

# రాజభక్తి నాటకము.



## అంకము. 5 రంగము. 1

స్థలము. మదాలసయొక్క రాజమందిరము

(మదాలస-కోదండుఁడు-దుర్జయుఁడు సర్దారులు మద్యపానము చేయుదురు. సంగీతము నాట్యముజరుగును)

మదా. (లేచినిలువఁబడి) ఏమిచేయవలయును? నేఁడేమిచేసినను మనస్సున కుల్లాసము గలుగకున్నది.

కో. ఏల యట్లున్నది?

మదా. విక్రాంతుఁ డెటనుండునదియు, నేమి చేయుచుండునదియు మనకావంతయుఁ దెలియకున్నదికదా? అదే లోకోవాఁడెప్పుడువచ్చి మనకెట్టిసంకటము గలిగించునోయను సంశయమునన్ను భీతిలఁజేయుచున్నది?

దుర్జ. అట్లుభీతిల్లుటకుఁ గారణమేమియు నాకుఁదోఁపదు.

కో. ఈవిషయమున జాగ్రత్తతోఁ దగునేర్పాటు లెల్లగావించి యున్నాను.

దుర్జ. నాభటులు నిద్రసహితమును మాని వానిని వెదకిపట్టుటకు నలుదెసలఁ దిరుగుచున్నారు. మహారాజ్ఞి చింతయావంతయేని లేకయుండవలయును.

మదా. సరి. సంగీతము, నాట్యము జరుగనిమ్ము. (మదాలస యాసీనయగును. దుర్జయాదులుమరల మద్యపానము సేయుదురు. పూర్వమువలె సంగీతము, నాట్యమును జరుగుచుండును. మదాలస మరల లేచి నిలువఁబడి) కోదండా! చండవర్మయొద్దనుండి వార్తయేమైన వచ్చెనే?

కో. కూర్మదుర్గము ముట్టడి వేయఁబడెను. సరోజిని శీఘ్రమున మనకుశరణాగతురాలగునని తోఁచెడిని.

మదా. మృణాళిని యుదంతమే మేనిందెలియునే?

దుర్జ. తెలిసెను, ప్రస్తుతమామె మణినగరమున నున్నది.

మదా. అచట నేమిసేయుచున్నది?

దుర్జ. ఏమిసేయును? ఆ విక్రాంతుని నామస్మరణ సేయుచుండును. కాక మఱేమి చేయును? గర్వపరవశయగు దానికి వేఱేమిపనిగలదు?

మదా. ప్రేమపాశమునఁ జిక్కియుండు స్త్రీకేనిం బురుషునకేని నిట్టిదుర్దశయే పట్టును. జరుగనిందు మీ నృత్యగీతములు (మరలమద్యపానము నృత్యము గానము

జరుగును. ఇట్లు వా రానందమగ్నులుగనుండుతఱి నొకసేవకుఁడు భయకంపితుఁడై ప్రవేశించుచున్నాఁడు.)

సేవ. మహారాజ్ఞీ! మోసము-మోసము-జాగ్రత్తతోనుండుఁడు. లెండు. విక్రాంతుఁడు గొప్పసైన్యముతో మీపైదాడివెడలివచ్చుచున్నాఁడు.

అందఱు. (భయముతోనులికిపడి) విక్రాంతుఁడు వచ్చుచున్నాఁడా? విక్రాంతుఁడు వచ్చుచున్నాఁడా?

మదా: ఎక్కడ? ఎక్కడ నున్నాఁడు వాఁడు?

సేవ. మణినగర మార్గమునందు వచ్చుచున్నాఁడు. వాఁడువచ్చుసంగతి తెలిసినవెంటనే ప్రజలందఱు వానికెదురేఁగి స్వాగతమొసఁగుచున్నారు: వాఁడు వచ్చుతఱి జనులు వానికి నమస్కరించి చంద్రశేఖరునధికారమును స్వీకరించుచున్నారు. రెండుదినములలో వానిసైన్య మత్యధికమాయెను. వాఁడు వచ్చుమార్గమున నుండువారందఱు వానిపక్షము నవలంబించుచున్నారు. నేను జూచునపుడు వానిపక్షమువారు రమారమి యైదువే లుందురని తోఁచెను. వెంటనే పరుగుపరుగున నీ వార్తదెలుప నిటకు వచ్చితిని.

మదా. ఇంతశీఘ్రమున వానిసైన్య మెట్లింత యధికమయ్యెను?

సేవ. అచ్చటచ్చటనుండు సైన్యములు వానిని జూచినవెంటనే యాతనికిలోఁబడుచున్నది. వానిపేరు వినినమాత్రమున జనులుకేలుమోడ్చి తమయూర విశ్రమింపవలయునని వానిని వేఁడుకొనుచున్నవారు.

మదా. (కోపముతో) కోదండా! విక్రాంతు నెదరించుటకు మనసైన్యమునంపి ప్రక్కలనుండునూళ్ల వసించువారిని హెచ్చరించిరమ్ము. ఏయేపురముల నేయేజనులు వానికనుకూలముగనుండుటకు సిద్ధమగుచున్నారో యట్టిపురములను గాల్చి భస్మమొనర్పుము. అట్టిజనులకుఁదగుశిక్షయొనర్పుము. అట్టిచోటులనుండు నాడువాండ్రను, బిడ్డలను, ముదుసళులను జీవములతోనుంపవలదు. నిర్మూలము గావింపుము. (రెండవసేవకుఁడు వచ్చుచున్నాఁడు)

రెం-సే. దేవీ! విక్రాంతుఁడు కుంతలపురమునకు వచ్చెను.

మదా. ఏమీ! కుంతలపురమునకు వచ్చియున్నాఁడా!

మొ-సే. మొన్నమణిపురమునకుఁ బదిక్రోశములదూరమున నుండెఁగదా! ఇంతలోఁ గుంతలపురమున కెట్లువచ్చెను?

మదా. ఒకదినముననే ముప్పదిక్రోశములు రాఁగలిగెనే?

మొ-సే. దేవీ! విక్రాంతునివేగము వాయువేగమును మీఱియున్నది.

రెం-సే. వాఁడుసేనలులేక కొన్నిచోటుల జయమొందియున్నాఁడు.

ము-సే: వానిశక్తి యపారము. వేగము గణింపరానిది.

రెం-సే. కాఁబట్టి వాఁడెప్పు డేచోట నేమిచేయుచున్నాఁడనుట కొన్నిసమయములఁ దెలియరాకున్నదిని. వానివేగశక్తి వైద్యుత శక్తింబోలియున్నది.

మదా. నా వేగశక్తి వానిమీఱఁగలదు. వాఁడు వేగమున మెఱుములట్లు తోఁచును. నేను సాక్షాద్విద్యుల్లతయే యగుదును. నేనే విక్రాంతుని నెదరింపఁబోవుచున్నాను. వానిశౌర్యము నాయెదుటఁ గొఱగానిదగును. వానిసైన్య పరాక్రమము నాయెదుట సూర్యునెదుటి మిణుఁగుఱుపురుగుల కాంతింబోలును.

రెం-సే. వానిసైన్య మిప్పు డేబదివేల సంఖ్యకలదిగ నుండవచ్చునని తోఁచెడిని.

మదా. ఉండనిండు. ఎంతయైననేమి ! నేనందులకు భయమొందు దానను గాను-కోదండా ! మహారాజ్ఞిస్వయముగ యుద్ధమునకు బయలుదేరనున్నదని నలుదెసలఁ జాటింపుము. రాజ్యమునందలి యొక్కొక్క యువకుఁడును మనపక్షమున యుద్ధమునకు రావలయునని నా యాజ్ఞయయ్యెనని యందఱకెఱిఁగింపుము. మీరందఱు సిద్ధముగండు. విక్రాంతా! అసాధారణమగు జనప్రీతియను బలమునునమ్మి నాతో యుద్ధమునకు వచ్చుచున్నావు. ఈ మదాలస నిన్ను ఛిన్నాభిన్నములు నేయక వదలదను విషయము బాగుగ నెఱుంగుము.

రంగము ముగియుచున్నది.

# రాజభక్తి నాటకము.

అంకము 5. రంగము 2.

స్థలము. విక్రాంతునిగుడారము.

(ప్రవేశము - విక్రాంతుఁడు.)

విక్రా. (స్వగతము) నేఁడుగూడ మృణాళిని నాతోయుద్ధమునకు వచ్చెదననుచున్నది. ఆహా! దీనికినాపై నుదయించిన ప్రీతి యనివార్యముగనున్నది. ఒక్కనిము సమేని నన్నువీడియుండ నేరకున్నది. నిజమాలోచింప నిట్టిలోకోత్తరవని తారత్నముయొక్క యనుపమప్రేమ యభాగ్యశాలియగు నాకుఁదక్క నింకేపురుషనకేని లభించియుండిన వాఁడెంతయు ధన్యుఁడగును. ఔరా! కఠినతరమగు నా హృదయమునుగూడ నాప్రీతి యాకర్షించుచున్నదిగదా! దానియందు నాకు విశ్వాసముగలదు. నాయెడ దానికిభర్తృభావముగలదు. కాని దానియెడ నాకుఁబత్నీభావము వహింపసాధ్యముగాకున్నది. ఆమెదన పతిప్రేమ యనుజడివాన నాపైఁగురిపించినను నాకామెయెడ వాత్సల్యముదక్క నింకెట్టిభావమును గల్గుటలేదు. సాంసారికమగు తుచ్ఛసుఖములందు నా మనముప్రవేశింపకున్నది. కాని యొక్కొక్కసమయ మామెప్రీతిన న్నామె యధీనముగావింపుచున్నది. ఇప్పుడేమి సేయుటకుఁదోఁపకున్నది. ఏమొనర్చిన దీనినుండి తప్పనగును? ఈ వలకీమెయెడఁ జనువుగలిగి చెంతఁజేర్చుటచే నిట్టికష్టముగలిగెను, నేనట్లుచేర్చుటచేతనే యామెకు నాయెడల నిట్టిభావము దయించుట కవకాశమయ్యెను. కాఁబట్టి దీనికి నేనేకారకుఁడను. ఇవియెల్లను స్వయంకృతాపరాధములే యగుచున్నవి. ఇంకనైన నామెయెడఁ గాఠిన్యము చూపవలయును. అదెట్లుసాధ్యమగును? నిష్కపటప్రీతికిఁ గాఠిన్యమా ప్రతి ఫలము? అదిమిక్కిలి యన్యాయము.

(మృణాళిని ప్రవేశించును.)

మృ. మహారాజు నాకొఱకింతఁలకాలము ప్రతీక్షించి యుండవలసివచ్చెను.

విక్రా. అట్లునేను బ్రతీక్షించియుండలేదు.

మృ. నేనెంతయు శీఘ్రముగవచ్చుటకుఁబ్రయత్నించియుఁగొంచెమాలస్యమయినది. అందులకు మహారాజు క్షమింపనగును.

విక్రా. ఇటక్షమింపఁదగినట్టి యపరాధమేమియుఁ గన్పట్టుటలేదు. మృణాళినీ! నేఁడు నీవురణరంగమునకు రాకయుచటనయుండరాదే?

మృ. నేవచ్చుటయందభ్యంతరమేమేనిఁగలదా?

విక్రా. కడచినయుద్ధమున నీకుఁదగిలిన గాయమింకను మానకయున్నదిగదా ?

మృ. మహారాజుగారి గాయములు మాత్రమాఱియున్నవా ?

విక్రా. మృణాళినీ ! మేమురణదేవతయొక్క దాసులము. ఇదిమాకుఁ బ్రతిదినము గలుగు సుఖవిలాసము.

మృ. మహారాజా ! నేనును మీవలె రణదేవతయొక్క దాస్యము నంగీకరించి యున్నదానను.

విక్రా. నీవునేఁడు నాతోనరుదెంచుట సరిగాదని తోఁచుచున్నది.

మృ. మహారాజుగారి కోమలహృదయము నాయవస్థఁజూచుట కోర్వలేకున్నదని నేనెఱింగియున్నాను. మిమ్మువిడిచియుండుటకంటె మీతోనున్నపు డెట్టికష్టముగలిగినను నందులకు నేఁజింతనొందను. దానినధికసుఖముగనే భావింతును.

విక్రా. మృణాళినీ ! నీశరీరమింకను జక్కఁబడుకున్నది. కాఁబట్టి నీకు రణరంగమునకు వచ్చుశ్రమ నేనెట్లొసంగఁగలను ? జనులు నన్ను నిందింపరా? కావున నీవు నేఁడుశిబిరముననే యుండవలయునని తోఁచుచున్నది.

మృ. మహారాజ లాజ్ఞాపించిన నాకు వేఱుదారిలేదు. అయిన, శిబిరముననుండుట కంటె మహారాజుతో యుద్ధభూమికి వచ్చుట నాకుఁగౌతుకదాయకమగును.

విక్రా. (స్వగతము) దీనిమధుర వచనములువినినంత నామనము సంకటముల పాలగుచున్నది. ఎట్లైననుగఠినోక్తులచే నీమెనునిలిపియే వెలువడవలయును. నేఁటియుద్ధమున నీమెనాతోరాఁజనదు. ఈ శిబిరముననే యుండవలయును. (ప్రకాశముగ) మృణాళినీ ! క్షమింపుము. నిన్ను గఠినోక్తులకు లోఁబఱచినందులకు నా మన సాయాసము నొందుచున్నది. కాని నేనేమిచేయుదును ? నిన్ను నిరోధింప నాకిష్టములేదు. అట్లయ్యు, నేఁడు రణభూమికి నీవురాఁగూడదని నిన్ను నిరోధించుచున్నాను.

మృ. సరియే. మహారాజు నాజ్ఞ నేను శిరసావహింప వలసినదియ యగును. నా శరీరమున గాయ మేమేనిం దగులునో యనికదా మీరు దలంచుచున్నారు? నా మనోనిశ్చయమునుగూర్చి శంక యేమియు లేదుకదా ? ఎట్లేని రావల యుననుటయ నాయాశయము. అయినను మీయాజ్ఞానుసారముప్రవర్తింతును. నా శరీరమున గాయములు కలిగి యున్నను నా మనస్సు మీతో యుద్ధమునకువచ్చు విషయమున దృఢనిశ్చయము గొనియున్నది. దీనిని మహారాజెఱిఁగి యుండుట నాకు మిక్కిలి సంతోషము.

విక్రా. మృణాళినీ! నీ మనోనిశ్చయము నాకు బాగుగఁ దెలియును. నిజమువిన నభిలషింతువేని మనస్సునసైన నీవచటికి రావలయుననితలంపఁ గూడదు. కాని యట్లు జరుగుట...............

మృ కేవలమశక్యము. మీ యాజ్ఞ యుండినను, లేకున్నను నా మనస్సు మీతో యుద్ధభూమికి వచ్చును. యుద్ధమునమాత్రముగాదు. మీ రెచ్చోటికేగినను మీతో నది మీ నీడవలె సర్వకాలముండును.

విక్రా. మృణాళినీ! నీ మాటలు చంద్ర కిరణములవలెఁ జల్లఁగ నున్నను నాకుఁ దాపదాయకములుగ నున్నవి.

మృ. తాపదాయకములా? అదేల?

విక్రా. అది నేను నీకేమని చెప్పఁగలను? అమృతాశనమున, మనుజుఁడు చచ్చుటయు, గుసుమస్పర్శమున ముల్లుతాఁకినట్లు పోటుగల్గుటయు నిట్టివానికిఁగారణములు నుడువ నెట్లగును?

మృ. నా వచనములు మహారాజున కెట్లు క్లేశ కారణములయ్యెనో నేఁ దెలియఁ జాలకున్నాను.

విక్రా. నేనేమందును! మృణాళినీ! నీమాటల నేవిషయము ముఖ్యముగ నున్నదో యది వీడిన బాగుండును. అర్థము తెలియక మాటలాడినను గొన్ని మాటలు విషమయ శబ్దములై పరిణమించిన నపాయము గలిగింపకుండునా? నీ యమృతమయ వాక్యముల నట్టివిషమెట్లు కలిగెనో తెలియకున్నది?

మృ. నామాటలలో మహారాజునుగూర్చిన ప్రేమోక్తులుదప్ప వేఱేవియున్నవి?

విక్రా. అదే. అదే. ఆప్రేమ. ఆ యమృతము. అదియేవిషము. నీమాటలలో నుండఁ గూడని విషయమునదియే. పలుమాటలేల? నామనసున నట్టి విషయము లుద్భవింపకుండిన యెడల మిక్కిలి బాగుగ నుండును. కాని యది యెట్లగును? ఈ దేవతను వదలి యెచట నామదికాశ్రయము గలుగును? దాని నిశ్చయమును విచారింప నది యెచటికిఁ బోనగును?

మృ. ఏమి! ఏమిచెప్పుచున్నారు. మహారాజా! నాప్రేమ మీ కేవగింత గలిగించుచున్నదా?

విక్రా. ప్రేమవలన నేవగింతగల్గుటయా? అగును—అయిన నీవిషయ మిప్పుడు చర్చింప వలదు. వేఱొకప్పు డద్దానింగుఱించి ప్రసంగింతము. నిజమాలోచించినఁ బ్రేమ యెంతయు నానందప్రదమ యగును. మృణాళినీ! నే వెడలి వత్తును. (సింహనాదము వినఁబడుచున్నది) అదె వినుచున్నావా? యుద్ధ భేరి మ్రోఁగుచున్నది. నేనిపుడే పోవలయును. నేఁడు నిన్ను యుద్ధ

మునకుఁ దోడ్కొని పోవకుంటినను దాని వేఱువిధముగ భావింపకుము. నీతోఁ గొన్ని ముఖ్యమైన విషయములు మాటలాడవలయును. ఆవల నా మనసు నీకు వ్యక్తము చేయఁబోవుచున్నాను. నాకు సెలవిమ్ము. నీ కృపాదృష్టి నాపై నుండిన సర్వమంగళప్రదురాలగు దేవతానుగ్రహము నాకుఁ గలిగినట్లెన్నుకొనుచున్నాను. నీవు శిబిరమున సుఖముగ విశ్రమింపుము. యుద్ధము ముగియఁగనే నేను నీదర్శనమునకై యిచ్చటికి మరల వచ్చెదను.

మృ. మహారాజుయొక్క ప్రతాపము గల కరవాలము నేఁడు యుద్ధమునఁ బూర్ణ విజయము పొందుఁగాక!

(విక్రాంతుఁడు పోవును.)

(స్వగతము) విక్రమశాలురగు వీరులశిరములపై విజయశ్రీయను మకుటము నిడు నుదారశీలురగు రణదేవతలారా! నా ప్రియునియెడఁ బ్రసన్నులై యుండుఁడు! విక్రాంతుఁడు నాకు నిజముగఁ బ్రియుఁడా? అగును. నా ప్రియుండనుటలో సందియమేమి? నాకతనియెడల నిశ్చల నిర్వ్యాజ ప్రేమ యున్నందున నాకతఁడు ప్రియతముఁడుగా కెట్లుండును? నా మాటల వలన నతని మనసునకాయాసము గలిగినదని నుడివెనే? అది యెందులకు నామనసున నాతనిపైఁ బ్రేమగలుగకుండిన బాగుండుననెనే? అది యేల? ప్రేమించు జనుల ప్రేమపూరితశబ్దములచే నొకరి మనసున కాయాసము గలుగుట యనుదాని కర్థమేమి? నాకాతనిపైఁ బ్రేమ గలిగి యుండుట దోషమనియాతని కేల తోఁచెను? అతఁడిదివఱ కీరీతిం జరింప లేదు. అతఁడు చేయు నొక్కొక్క కార్యమువలన నతనికి నాపైనత్యంత ప్రేమగలదని స్పష్టముగఁ దెలియుచున్నది. కాని నేఁడీతని ప్రవర్తన యేలమిక్కిలి వ్యత్యాసముగ నుండెను? ఇపుడామాట వలదు. ఇంక యుద్ధగర్జనము విననగును. మనుజుల యంతఃకరణమును భేదించి భయమను పిశాచ మందు దూఱును. నా ప్రేమను నేను గడుజాగ్రత్తతోఁ గాపాడుకొనవలయును. రణరంగమునఁ బ్రేమకు మరణమెప్పుడైన సిద్ధించునా? సిద్ధింపదు. ఇతర సకల సౌమ్యమధుర విషయములకు యుద్ధభూమి స్మశానముఁబోలి యుండినను బ్రేమయను దేవత కది నందనవనము. ప్రతి దేవతను సర్వాలంకారభూషితగఁ జూడవలయుననిన నది యీ శుద్ధవీరుల కరవాలములందు శోభితముగ నుండి యీ రణరంగమునఁ బ్రసన్నచిత్తయై విహారము సేయుచుండ దానిని జూడవచ్చును. బిడ్డలమనస్సు లెటుల నిష్కపటములుగ నుండునో యారీతిగ నగుచుసంగ్రామదేవతర చియించియుండు నీ రణ

ప్రాసాదము ప్రతి దేవత కత్యంతప్రియకరమగు క్రీడాగృహముగ నుండును. రణస్వామినియగు భవానీదేవి మిత్రురాలగు ప్రేమలత యుద్ధమునఁ గలుగు నుష్ణముచేఁ గాల్పఁబడునా? అట్లెన్నటికినిగాదు. (నేపథ్యమునఁ గోలాహలము) యుద్ధము ప్రారంభ మయ్యెను. శిబిరమునకుఁబోక ప్రక్కననుండు ప్రాసాదముపై నెక్కి యుద్ధమును జూచెదను. ప్రేమలీలకు సదృశముగ నుండు నీ యుద్ధక్రీడ ప్రేమమయాంతఃకరణముగల నాకెల్లపుడు సుఖదాయక మగునుగాక. (పోవును.)

రంగము ముగిసెను.

# రాజభక్తి నాటకము

అంకము. 5 రంగము. 3.

స్థలము. రణరంగము. [ప్రవేశము. విక్రాంతుఁడు.]

విక్రా. అదెయా ప్రక్కనుండు సైన్యము నశించెను, ఇఁకఁ బాతిక గడియలో శత్రులీరణరంగమునుండి తొలఁగి పరుగెత్తి పోవఁగలరు. మదాలస నిజముగ నొక శూరురాలయగును. నేడు తనశౌర్యముయొక్క తీవ్రతను బాగుగ వెల్లడించెను. యుద్ధభూమి మధ్య నొంటరిగ నశ్వమును సైఁతము వదలి నాసైన్యము నెదిరించినపుడు దాని యావేశము చూడ నామనసునకు మిక్కిలి యాశ్చర్యము గలిగినది. స్త్రీలతో యుద్ధము చేయుట పౌరుషహీనమైనను మదాలసతోఁ బోరాడవలయునని యొక క్షణమున నాకాశ జనించెను. ఈ సమయమున నింతశీఘ్రగతిని నేనిచటికి రాకుండిన నసాధారణ శౌర్యముగల యాస్త్రీ విజయలక్ష్మిని దనపక్షము చేసికొనియుండును. ఏ విక్రాంతునితో బోరువారీవఱకు రణరంగమున విజయము గాంచకుండిరో యట్టి వానిని జయించు భాగ్యము దీనికి మాత్ర మెట్లు లభించును? ఇంత పరాక్రమము చూపియుఁ దుదకావనిత యపజయము గాంచెను. నేనిష్టపడిన దాని

శిరము నీ కరవాలమున ఖండించియుందును. ఛీ! హీనురాలగు నాకస్త్రీరక్తముచే నీకరవాలము నపవిత్రముగావింప నాకిష్టములేదు. ఇప్పటికి నాయాడుది నాతో ద్వంద్వయుద్ధము సేయుటకెంతయుం బ్రయత్నించుచున్నది! కాని, దాని ప్రయత్నములు సఫలములగునట్లు నేనొనర్పను. ఆహా! అది యిచ్చటికే వచ్చుచున్నది. కనుక నేను వేఱొకవైపునకుం బోయెదను. (పోవును) (వెనుక ప్రక్కనుండి మఱియొక దారిని మదాలస వచ్చును.)

మదా. విక్రాంతా! ఉండుము. ఉండుము. ఇట్లు గర్వోక్తులాడకుము. నేను నిన్ను వదలను. నేఁడు నా సర్వసైన్యము రణభూమిని నాశమొందినను నేనొంటరిగనైన నిన్ను సంధించి యుద్ధము సేయక యీరణభూమిని వీడి పోవను. ఈ నాలుగు దినములు జరిగిన యుద్ధమున నేను నీతో సమానముగఁ బోరి యున్నదానను. ప్రతి సమయమందును నాకంటె నించుక యధికముగనే నీవు రణము జరిపియున్నావు. ఈ దినమెట్లనియు నిన్ను జయింపక విడువను. ఒకవేళ నాకు మరణము తటస్థించునే నది నీచేఁగలుగ వలయును. ఒకక్షుద్రకీటకముచేయిఁజిక్కి మరణించుదాననుగాను. ఒక్కెడ నాకేజయము గలుగవలసి యుండిన నిన్నన్యులకప్పగింపక నేనే చంపుదానను. నీచేత నేనుగాని, నాచేత నీవుగాని మనమిరువురము నీ రీతిగనే చావవలయును. కొంచెము ండుము. నాతో యుద్ధము చేయుము. మన యిరువురలో నెవ రీపృథ్విపై జయమొంది సంతోషముతో మనెదరనుట నేఁడు వ్యక్తపడవలయును. ఛీ! వాఁడు పోయెను. చాలదూరము పోయి యుండును. తన సైనికులతోఁ జేరియుండును. అదృశ్యుఁడయ్యెను. ఇపుడు వానినెట్లు సంధింపఁగలను? (నేపథ్యమున విజయదుందుభిధ్వానము) ఆహా! ఈ విజయదుందుభి ధ్వాన మేపక్షమునందుండి వచ్చుచున్నది? నాకుఁబరాభవము కలిగెనా? (మదాలసా దేవికి జయము జయము) ఛీ! ఈ జయఘోషము నన్నే పేర్కొనుచున్నది. కావున నేవిజయమందితినా?

మొ.స. (ప్రవేశించి) దేవీ! సంతోష వార్త. దేవిగారు విజయమొందితిరి.

రెం.స. (ప్రవేశించి) విక్రాంతుని ముఖ్యసైన్యము చీలికలైనవి. కృతాంతసింహుని కోదండుఁడు బంధించెను. చంద్రశేఖరుని పతాక మనవారిహస్తగత మాయెను.

మదా. ఈ యానందదాయక వృత్తాంతములను దెచ్చినందున మీరు నా కృపకుఁ బాత్రులైతిరి. (అవైపుఁజూచి) కాని యిదేమిటి? విజయదుందుభి ధ్వానము తటాలున నేలయాఁగెను? జయఘోష మేల వినఁబడుట లేదు?

యుద్ధాగ్ని శాంతపడు సమయమున మరల నేల దహింప మొదలిడెను
(మూఁడవ సర్దారు ఆొమ్ము బాదుకొనుచుఁ బ్రవేశించును.)

మూ. స మహారాజ్ఞీ! ఇపుడే వెడలుఁడు. కోదండునికి సహాయ మొనర్పుఁడు. ఆలసించిన నింతదనుక మనవారు యుద్ధమున సంపాదించియుండు జయ మంతయు వారిప్రక్క వ్రాలును. మఱియు మీయెడ నెల్లరకు సంపూర్ణా లక్ష్యభావముదయించును.

మదా. ఏమీ! మరల వేఱురీతిం దిరిగెనే? జయాపజయము లొకనిమిష కాల మున మాఱుచుండును? విక్రాంతుఁడింతలో మావారి కపజయము గల్గింప సమర్థుఁడైనా?

నా. స. (ప్రవేశించి) దేవీ! వెడలుఁడు. మృణాళిని కోదండుని గాయపఱచెను. మనవారికిఁ గొంతశక్తిహీనత గలిగెను. మృణాళినియుఁ గృతాంతసింహుఁ డును జంద్రశేఖరుని పతాకం దీసికొనిపోయిరి.

మదా. మృణాళినియా! చీ! అది మృణాళినిగ నుండదు. విక్రాంతుఁ డయయి యుండనోపును. కృతాంతసింహుని కృత్యమాయిది—శూరుఁడగు నా కోదండుని మృణాళిని యెట్లు జయింపఁగల్గెను?

ఐ. స. (ప్రవేశించి) దేవీ! పొండు. పొండు. మనవారు కోదండుని ననాథునిగ రణ భూమిని వదలి పాఱి పోవుచున్నారు. మృణాళినియొక్క యనుచరులు కోదండుని మిక్కిలి హింసించుచున్నారు. కృతాంతసింహుఁడు పోఁగొట్టు కొనిన విజయశ్రీని మృణాళిని దనహస్తము లం గ్రహించుకొని పోవుచున్నది.

మదా. మృణాళినీ! మృణాళినీ! ఎచటఁజూచినను విక్రాంతుఁడు మృణాళినియా. మీరందఱు నీపార్శ్వమునుండి వెడలి విక్రాంతుని ముట్టడింపుఁడు. నే నిపుడే యా మృణాళినిని బాగుగ శిక్షించి వచ్చెదను. ఈ మదాలసా హస్తగతమైన జయశ్రీ నితరులు గ్రహించుకొనిపోవుట యెట్లు? మీరందఱు నాకుమఁడి విక్రాంతు నెదిరింపుఁడు. పొండు. పొండు శీఘ్రముగ. (అందఱు పోయెదరు) ఓ రణదేవతా! నీ పుత్రికయగు జయశ్రీ విక్రాంతునిపై నా సక్తురాలై తన సవతియగు మృణాళిని శిరముపై నెక్కియాతని నారాధింపఁ దొడఁగెను. కాఁబట్టియే వానిప్రేమ జయశ్రీకంటె మృణాళినిపై నధిక ముగనున్నది. ఇది యా వెఱ్ఱిదానికిఁ దెలియకున్నది. కనుక లెమ్ము: జాగ్రత్త వహింపుము. ఇట్టి సమయమున మోసగత్తియయగు సవతినుండి నీ కుమార్తెను దూరము సేయుము. మృణాళినిని మంటఁ గలుపుటకు బయలుదేరి యున్నాను. నీవు నా కరవాలమున నావహింపుము. నీ సహా యమున నీకుమారితె కడ్డువడుచుండు మృణాళినిని నశింపఁ జేయుట కనుగ్రహింపుము. (కోపముతోఁ బోవును.)

## అంకము 5 రంగము 4

స్థలము:—మృణాళినియొక్క శిబిరము:—[ప్రవేశము. విక్రాంతుఁడు-మృణాళిని.]

విక్రా. మృణాళినీ! నా కీదినము మనస్స్వాస్థ్యము లేకున్నది:

మృ. మహారాజట్లుండుటకుఁ గారణమేమి?

విక్రా. మృణాళినీ! ఈదినము నా పక్షమునకు నీవలన గొప్పయశము లభించినది. అందులకుఁ దగు ప్రత్యుపకారము చేయకుంటినిగా యనుచింత నను జెంది యున్నది.

మృ. మహారాజా! ఇది యెట్లుపకారమగును? ఆది నాకర్తవ్యమే కదా?

విక్రా. నీ వొనర్చిన కార్యమునకు నీకుఁ బారితోషిక మొకటియొసంగవలయునని యున్నవాఁడను.

మృ. మహారాజా! పారితోషకము నభిలషించి నేను మీ సేవ సేయుటలేదు.

విక్రా. పారితోషికము నపేక్షింపకయే నీవు సేవచేయుచుండుట నీగొప్పదనమును వెల్లడిసేయుచున్నది. అట్లేనిం బారితోషిక మొసంగుటంత యావశ్యకమని నాకుఁ దోఁపదు. నీవుచేయు సేవకై నేనెల్లపుడు నీకుఁ గృతజ్ఞుఁడై యుండవలయునని మాత్రముతోఁచెడిని.

మృ. అదేల?

విక్రా. కారణమేమన? నాకు సేవచేయుట నీకుఁ గర్తవ్యముగాదు.

మృ. అటుగాదు. అదినాకుఁ గర్తవ్యమే. దానికిఁ బ్రత్యుపకార మొనర్పవలయునని మీకుఁ దోఁచునెడల మీ కృపనాయెడ నెల్లపు డుండినఁ జాలును.

విక్రా. కృపయెల్లపుడునుండును కాని యసమర్థునికృప యున్నను లేకున్నను నొకటియే కదా.

మృ. మహారాజా! మీరసమర్థులని యెట్లు చెప్పనగును? దేవర వారసమర్థులైన నింకెవరు సమర్థులగుదురు? మీరు ప్రసన్నులై యుండునపుడు మీదాసినగు నాచే మీయిష్టానుసారమగు కార్యమును గ్రహించుకొండు. మీవంటి నిగ్రహానుగ్రహసామర్థ్యముగల పురుషులనసమర్థులని యెట్లుచెప్పవచ్చును?

విక్రా. ఇతరులవిషయమున నేనెంతసమర్థుఁడైనను నీ విషయమున నేనుసంపూర్ణముగ నసమర్థుఁడనే-నేను బ్రసన్నుఁడై యున్నను నీకొందగు ప్రత్యుపకారము చేయుశక్తి నాకులేకున్నది. నీకిచ్చుటకు నీయోగ్యత కుచితమగువస్తువు నాయెడల నేదియులేదు. నాయట్టి యోధులకుఁ గలద్రవ్యము సమరాంగణమునఁ గరవాలసహాయమున సంపాదించిన యశమే. ఇయ్యది జనులపొగడికవలనఁ దెలి

యనగును. అట్టియశ మీావలనకే నీ కర్పించియుండుటచే దానిపై నాకధికారములేదు. నీవుచేసిన సేవకు సర్వదా నామూర్ధము నీ పాదముల కడనిడివందన మొనర్చుటయే నాచేనగుకార్యము. నేడు మొదలు నీపాదధూళి ని నా శిరముపైఁజల్లుకొని యెల్లపుడు మృణాళినికి నేనుఋణస్థుఁడనని జగము నకు వెల్లడించుచుందును. నేటివఱ కెవనిశిరము దేవునికి, రాజునకు, గురువు నకు దక్కఁదక్కినవారలకు నమ్రభావము వహింపకుండెనో యట్టినామస్తక ము నీచరణములపై నిడుచున్నాను. దానిని గృపచే స్వీకరింపుము.

(మృణాళినీ చరణము పైఁదనశిరము నిడఁ బోవుచున్నాఁడు).

మృ. (కొంచెము దూరముగఁబోయి) మహారాజా! వలదు. నా చరణములు మీా శిరముచేఁబూజింపఁబడుటకుఁ దగుయోగ్యతగలవికావు.

విక్రా. కాదు-మృణాళినీ! ఈచరణములయొక్క యోగ్యతయత్యధికము. (నమ స్కారముచేసి దానిపాదధూళి శిరసావహించి) దేవా! ఈ పవిత్రమగు పాదధూళి నాశిరమును పావనముచేయుఁగాక. మృణాళినీ! నేఁబోయివచ్చె దను. నీవీదినము మిక్కిలి యలసట నెందియున్నావు. గనుక నిలువిశ్రమిం పుము. (పోవుచున్నాఁడు)

మృ. (స్వగతము) పరమేశ్వరా! ఈ యుదారస్వభావు నెల్లపుడు సుఖయుతునొన ర్పుము. ఇతని చమత్కారము-కాదు. ఉదారస్వభావము నామదిని బ్రతి నిమిషము నత్యధికముగ నాకర్షించుచున్నది. నా కిప్పుడీతఁడు ప్రత్యక్షదైవ ముగఁ గనఁబడుచున్నాఁడు. ప్రియునియెడల దైవభావ ముత్పన్నమైనందున బ్రేమ పరమావధి పొందుచున్నదికదా! నేఁడుదయమున నాతోనతఁడు సంభాషించినరీతిఁ జూడ నాయం దుదాసీనతకలిగినట్లు తోఁచెడిని. ఇప్పటి యాతనివర్తనలచే నదిపొరపాటనితోఁ చుచున్నది-క్షణమున సుఖమును క్షణమున దుఃఖమును గలిగించు నీప్రేమను పెద్దలు, యువతులగు మాకుఁ దుష్టికరమని నుడువుచున్నారు. కాని యదితరుణవయస్కులగు మాయట్టి వారలకుఁ గలిగెడు నొకదురవస్థయని తోఁచెడిని. నేఁడుదయమునుండి చిత్త మాకులత నందియుండి యిపు డూరటనొందినందునఁ గొంతవిశ్రాంతి గలుగు నట్లు చగోరించుచున్నది. (పోవుచున్నది)

(రంగము ముగియును).

# రాజభక్తి నాటకము

## అంకము. 5 రంగము. 5

స్థలము—విక్రాంతుని శిబిరము (ప్రవేశము విక్రాంతుఁడాలోచించుచు)

విక్రా. (స్వగతము) ఇప్పటి స్థితి మిక్కిలి కఠినమైనది. తెలివిలేకయొక్క తరుణికి గొప్ప ప్రేమ గలుగఁ జేసి మరల దానిని నేనే ఛేదింపఁ బూనుట దయారహితమగు ఘోరరాక్షసకృత్యమ యగునుగదా? కాఠిన్యమున నిట్టియాసుర కర్మ యొనర్చినచో నీ విక్రాంతుఁడు కృతఘ్నుఁ డగునుగదా! కాని మార్గాంతరము లేకుండుటచే నట్టి ఘోరకార్య మొనర్పవలసి యున్నది. ఇంక దాని నతిజాగరూకతతో నొనర్పవలయును. దేవా! ఈకఠిన సందర్భమునుండి నన్ను దొలఁగింప వలయునని నీ పాదములకడ విన్నప మొనర్చుచున్నాఁడను. ఈ ప్రేమ నామదిని మొట్టమొదటినుండి కలుగకుండిన నీభయంకర సందర్భములు గలుగకుండెడివి. (మృణాళిని వచ్చుచున్నది) మనసా! నీపూనిన మనోనిశ్చయము నుండి మరలకుము. స్థిరముగనుండుము. ఎవని మనసు ఘోర యుద్ధసమయములంగూడఁ జాంచల్యము వహింపకుండెనో యట్టి నా మనస్సుదీనిం జూచినపుడచలన మొందు టేల? మనుజుల శిక్షించు సందర్భమునకంటె స్త్రీసందర్శన మధికభయంకరమైనదికదా? ఎవరైన నీ సందర్భమునుండి తొలంగించి నూఱు యుద్ధములు చేయుమన్నను జేయ సంసిద్ధుఁడనై యున్నాఁడను. కాని యిట్టి సందర్భము దాఁటు టెట్లు?

(ప్రవేశము-మృణాళిని.)

మృణా. మహారాజుగారెప్పుడిచటికి వచ్చితిరి?

విక్రా. నేనిపుడే వచ్చితిని.

మృ. దేవరవారారోగ్యవంతులే కదా?

విక్రా. ఇపుడు నామనమున భావాంతరము గలుగక యుండిన నీ శరీరమునకు సౌఖ్యమే.

మృ. కాని మహారాజు మనసునకు దుఃఖ మేదేనిం గలిగెనే?

విక్రా. అగును. ఆకారణముననే నిన్నిటకుఁ బిలువనంపితిని.

మృ. అట్లేని దేవరవారాజ్ఞ సేయుఁడు. నేను సేవకు సంసిద్ధురాలుగ నున్నదానను.

విక్రా. మృణాళినీ! ఇదిమొదలు నీకు నాకుఁ గలిగియుండు సేవ్యసేవక భావము తొలంగవలయును.

మృ. అదేల?

విక్రా. కడచిన యుద్ధమునుండి యాభావము మాత్రను. నిజమాలోచించిన నీ యెడ నట్టిభావముతో నేను వర్తించియుండలేను. కాని నీవింక నట్టిభావమునే వహించియున్నావు. అయ్యది యిపుడు మాఱవలయును. సరి. అది యట్లుండనిమ్ము. ఇచటఁగూర్చుండుము. ఇపుడు నేను జెప్పఁబోవు దానిని శాంతముతో వినుము. మృణాళినీ! ఆదినము నీకొసంగిన పారితోషికముచే నామనసునకు సమాధానము గలుగలేదు. మఱియు నేఁడే నొసంగవలయునను నాశచే నేనిచటికి వచ్చినవెంటనే నిన్ను బిలువనంపితిని. నేనీచోటువదలి రెండు దినములు మఱియొక చోటికిఁ బోవనున్నాఁడను. కాఁబట్టి దాని నిపుడే నీకొసంగ వలయునని యాలోచించియున్నాను. నిన్ను నేనొక విషయమునుగూర్చి హెచ్చరింప వలసియున్నది. పారితోషికము లభించినందున నానందమున మునిఁగి గర్వము వహింపనలదు. నేను నీ కిపుడియ్యఁబోవున దమృతముకంటె మధురమైనది. చంద్రునికంటె శీతలమైనది. మఱియు స్వర్గమునకంటె గొప్పది. కాని దాని దానముచేసిన నిచ్చువారికిం బుచ్చుకొనువారికి నత్యంత సంతాపముద్భవిల్లును.

మృ. అట్లైనావస్తువును మీరు నాకియ్యకుండుటయే మేలు.

విక్రా. దాని నీకియ్యనేవలయు. ఇదె దాని నీకిచ్చుచున్నాను.

మృ. మహారాజు మానస మట్లుండిన నది యెట్టి తాపదాయకమైనను నే స్వీకరించెదను. మహారాజా! ఆవస్తు వేదియో తెలుపుఁడు.

విక్రా. ఆదినము నీ పాదమున నాశిరమునుంచితినిగదా. దానికంటె శ్రేష్ఠమగు నతఃకరణమొకటి నాయెడనున్నది. దానిని నేఁడు నీకొసఁగఁబోవుచున్నాను.

మృ. ఏమి? ఏమి చెప్పెదరు? మహారాజా! మీయొక్క శ్రేష్ఠమైన యతఃకరణము నాకొసఁగఁబోవుచున్నారా? ఆహాహా? దేవా! ఎట్టి యానంద సమయమిది! నాసర్వాశలు సఫలములయ్యెను. నా సకల మనోరథములు సంపూర్ణత నొందెను. మహారాజా! నేను మిక్కిలి కృతార్థురాలను. (అతని పాదము కడఁదన మోకాలిడి కూర్చుండును.)

విక్రా. మృణాళినీ! ఆఁగుము. ఇంతలోనానందమొందకుము. నాయతఃకరణము నీకిత్తునని నేఁజెప్పలేదు. నా యంతఃకరణముపై నాకధికారము లేకుండుటయే యందులకుఁ గారణము. ఇంతకు పూర్వమే దానిపై మఱియొకరికి స్వామిత్వము గలిగియున్నది. ఒకవేళ దానిపై నాకధికారముండినను నీ వొనర్చిన యమూల్య సేవకుఁదగు పారితోషికమగుటకు దానికి యోగ్యత లేదు. ఏ యంతఃకరణము నీకధీనము సేయఁ బోవుచున్నానో యది నీకుఁ దగుపారితోషికము.

మృ. మహారాజా! మీయంతఃకరణమునకంటె మఱియొకటి శ్రేష్ఠమని నాకుఁ దోఁపదు.

విక్రా. అది మిక్కిలి గొప్పదియు, సుదారగుణము గలదియునగు దేవాంగన యొక్క దివ్యాంతఃకరణము.

మృ. అది మీరిచ్చుటకుఁ బూర్వమే నాకు లభించియున్నది. దేవాంగనాదేవి యొక్క యాత్మనాయందుఁ బూర్ణముగఁ దన్మయత్వమొంది యుండుటచే నాదేవియొక్క యంతఃకరణము నాయొద్దనే యున్నది. నిజమాలోచించిన నాయమ కరుణవలననే మీపై నాప్రేమ యభివృద్ధిఁ జెందుచున్నది.

విక్రా. మృణాళినీ! అది నీయెడనున్నప్పటికిని దానిపై నధికారము నాకుఁగలదు.

మృ. అది నాకును సమ్మతమే.

విక్రా. అయిన నిపుడు నాప్రియురాలగు దేవాంగన యంతఃకరణమునుగూర్చి మాటాడలేదు. ఏలన? దాని యంతఃకరణము నితరుల కర్పించిన దానియెడ ద్రోహమొనర్చినట్లగును.

మృ: అట్లని, మఱి యేదేవాంగనయంతఃకరణము మీ యధీనమైయున్నది? అట్టి భాగ్యశాలినియగు రెండవ దేవాంగన యెవతె?

విక్రా. మృణాళినీ! అది మిక్కిలి రహస్యమగు విషయము. కాని నీకు దానిని వెల్లడించుట కించుకైన నామది సంకోచింపదు. అది వినిన నీకాశ్చర్యము జనించును. కాఁబట్టి చెప్పెద వినుము. మృణాళినీ! ఈ చండాలుఁడగు విక్రాంతుని మదిని స్త్రీప్రేమకుఁ బ్రతియొనర్చు భావము లేనందున దేవతాసమానురాలు సుదారస్వభావురాలునగు నొక స్త్రీయొక్క యంతఃకరణమును నిరాకరించుచున్నాఁడు.

మృ. మహారాజా! మీరు చెప్పునదేమి? మీకు—విక్రాంత మహారాజునకు—నిర్దయగలిగెనా?

విక్రా. అగును. నిర్దయగలిగెను. అందులకు వేఱుమార్గములేదు. నాకా యంతఃకరణమునొందు నభిలాషలేదు. నేను దానిం బొందఁదగు యోగ్యత లేనివాఁడనని నాకు బాగుగఁ దెలియును. కనుక నేనిపుడొనర్చు కార్యము.

మృ. మీరిట్లు చేయుటచే నిరాకరించు పాతకమునకుఁ దోడు విశ్వాసఘాతుకరూప పాతకమునుజేరి వాని భారములు మీపైఁబడలేదా?

విక్రా. నిజముగ నట్టి భారము నాశిరముపైఁ బడవలయును. అయిన నాపాతకములు నాకుఁగలుగవు. కాని నేఁజెప్పఁబోవులాగున నా నిరాకరణరూప పాతకమున్నైతము నాకుఁగలుగక పోవును.

మృ. యితరుల యంతఃకరణము నాకొసంగుట వారియెడ విశ్వాసఘాతుక రూప పాపమొనర్చుట యగునుగదా?

విక్రా. అగును. ఒకరి సొమ్మును మఱియొకరి కిచ్చినటులయగును.

మృ. అయిన, నీసందర్భమున?

విక్రా. అటుగాదు. ఈ విషయమున వారి సొమ్ము వారికే యిచ్చినట్లగును.

మృ. అట్లనిన? మీమాటల కర్థమేమి?

విక్రా. అర్థమేమనిన? మృణాళిని విక్రాంతునిసమ్మతిలేకయు, నతఁడిచ్ఛగింపకుండి నను నతనికొసంగిన యంతఃకరణము నా విక్రాంతుఁడు నేఁడు మృణాళినికిఁ మరల నొసంగుచున్నాఁడు. దాని నామె యానందముతో స్వీకరింప వలయును.

మృ. అయ్యో! దేవా! తుదకిట్టి పారితోషికమా నాకులభింపనేయును?

విక్రా. మృణాళినీ! ఏమనివచింతును? నీవు నీయుజ్జ్వలప్రేమను నా కర్పించియుండి నను నావస్తువు నాహృదయమున నండగొనకయున్నది. అట్లుండ దానిపై నధికారమెట్లు నేనువహింపఁగలను?

మృ. కాని మహారాజా! నాయెడల మీకుఁగొంచెమేనిం బ్రేమలేదుకదా?

విక్రా. ప్రేమలేదని యెట్లుచెప్పనగును? నీపై నాకత్యంత ప్రీతిగలదు కాని మృణాళినీ! నీవెట్టిప్రేమను నాయెడఁ గలిగియుంటివో యట్టిప్రేమనాకులేదు.

మృ: మహారాజా! ఇదివఱ కట్టిప్రేమను మీరునాయెడఁ జూపుచుంటిరిగదా?

విక్రా. లేదు. అట్టిప్రేమ నా భావమున నీశ్వరసాక్షిగ లేకున్నది. ఆకారణముననే నీకిప్పుడిట్టి విషాదకరవార్తఁ దెలుపవలసి వచ్చెను.

మృ. అట్లేని నేను మిమ్ముబ్రేమించుట యొకగొప్ప యపరాధమయగును.

విక్రా. కాదు. అపరాధమని నాకుఁదోఁపలేదుకాని యిందుఁ దప్పొకటి కలిగియున్న దనుట మాత్రమునిశ్చయము.

మృ. తప్పా! మిమ్ముబ్రేమించుట యొకతప్పా? మహారాజా! మీరుచెప్పునదేమి? మిమ్ము బ్రేమింపరాదనిన మఱియెవరిని బ్రేమింపవలయును? మహారాజుం దప్పనితరు నెవ్వనినైనఁ బ్రేమించియుండిన నదిగొప్పనేరమని నేనెన్నుదును. మహారాజుచరణములయెడ నాచిత్తము లయమునొందియుండుట నేఁజేసిన పరమభాగ్యము.

విక్రా. నీగొప్పప్రేమకు నేనుబాత్రుఁడనుగానని నా మనస్సాక్షి చెప్పుచున్నందున మృణాళినీ! నాకు వేఱుపాయములేదు. స్త్రీప్రేమకు నాహృదయమున

నావంతేనిఁ జోటులేదు. ఆ దేవాంగనతో నావికారమంతమైనది. మృణా
ళినీ! నీవుతరుణివి. వేఱెవ్వని నేనిందరుణవయస్కుండగు పురుషుం బ్రేమించి తేని
నీజీవితమును సుఖమయముగఁ జేసికొనఁగలవు. ఈబ్రహ్మావర్తమందు నీప్రేమకుఁ
బాత్రుఁడుకాఁగల యొకభాగ్యశాలియగు తరుణుఁడు నీకుసులభముగ
లభింపఁగలఁడు.

మృ. మహారాజా! మిమ్ముదప్పని తరునెవనిని నేనుబ్రేమింపఁజాలను.

విక్రా. నాకువేఱుమార్గము లేదు. ఇఁక నేను సన్న్యాసముస్వీకరించి వేదాంతజ్ఞాన మల
వరచుకొని లోకమునఁ బ్రచారముచేసెదను. ఇదియే నానిశ్చయము, కాఁబట్టి
యట్టియుత్కృష్టసంకల్పము వదలి నేనెట్లు లౌకికవ్యవహారములందుఁ బ్రవేశిం
పఁగలను?

మృ. నా యొనర్చిన నేరమును మన్నింపుఁడు. దుర్లభవస్తువును నేనభిలషించుచున్నా
నను విషయమునాకు మున్నె తెలిసియుండియు నాప్రేమమీపైఁ బ్రసరింపఁ
జేయుట నాయొక్క యపరాధమే. అనివార్యమగు నాప్రేమను నిరాశనొం
దింపవలయునని ప్రయత్నించితిని. ఆఱునెలలక్రిందట మిమ్ము మొట్టమొదట
సంధించినప్పుడు మీయొక్క ప్రియసహవాసము నాకు లభించినదినమునుండి
యాప్రేమ మరల నామనంబున నధికముగఁ గిగ్గెను. అదిసర్వాంగముల వ్యాపిం
చియుండెను. మహారాజా! మీయొక్క ప్రియయుతమును నిష్కపటమునగు
వర్తనములు చూఁచియు నాయాశ నిరాశనొందియుండిన నాకిట్టి హృదయ
తాపము గలిగియుండదు. ఆ విషయమట్లుండనిండు. నాదురదృష్టమది. అందు
లకుదోషము మీపైనా రోపింపఁజాలను.

విక్రా. మృణాళినీ! ఈ సమయమున నాహృదయమున దుఃఖతరంగము లెట్లు
విజృంభించుచున్నవనుట నీవు తెలియకున్నావు. ఏ స్త్రీ నాయశముకొఱకహో
రాత్రములు మిక్కిలి దేహశ్రమనొందెనో, తాను స్త్రీయగుట మఱచి రణ
రంగముననెట్టి సాహసకార్యాచరణమునకును వెనుకంజయ వేయకుండెనో-మఱి
యునసేక సమయముల నాప్రాణము రక్షింపఁ దనప్రాణమును సరకు గొనకుం
డెనో—యట్టి యుదార చిత్తయు సత్యశీలయునగు నాయువతియెడ—నా
సర్వమంగళాధిష్ఠాన దేవతయెడ - నాప్రేమసర్వస్వత్యాగశీలయగుదానియెడ
నీ కృతఘ్నత చూపుట కీహతభాగ్యునినుదుట వ్రాసియున్నది. కావున
నీ విషయమున విక్రాంతుని యంతఃకరణమున నెట్టిక్లేశము గలుగుచున్నదో
నీకెట్లు తెలియును? మృణాళినీ! నాకు వేఱుపాయము లేకున్నది. నీప్రేమ
నంగీకరించు నీ యకార్యము నేనెట్లొనర్తును? నా హృదయమున స్త్రీప్రేమ
యావంతయు లేనప్పుడు నీయెడ మిథ్యాపత్నీప్రేమంజూపి నిన్నెట్లుమోస

గింతును? ఇది కపటాచరణముగదా? ఇదినీతిబాహ్యము నగునుగదా? మఱియు నీయెడ విశ్వాసఘాతుక మొనర్చి నట్లగును.

మృ. మహారాజా! నన్నంగీకరించిన పిమ్మట మీమానసమున నట్టి ప్రేమ యుద్భవింపదని యెట్లు చెప్పఁగలరు?

విక్రా. కాదు. మృణాళినీ! నీవు పొరబడుచున్నావు. అనురాగలేశమేని లేని నాయంతఃకరణమున నట్టి భావము గాలత్రయమునను నుదయింపదు. నాఁగూడి క్రోలు నీకసత్యముగఁదోఁచును—నిజమాలోచించిన నాప్రియురాలగు దేవాంగనయెడంగూడ నట్టి యనురక్తి క్రమ క్రమముగఁ దగ్గుచునేయున్నది. సర్వస్త్రీలయందువలె నిపుడు దేవాంగనయందును సోదరీభావము వహించియున్నాను. నేనీశ్వరసాక్షిగ నీకు—

మృ. వలదు. వలదు. మహారాజా! మీరు చెప్పఁబోవు విషయములు నేను వినఁజాలకున్నాను. నేనిచట వసింపనేరకున్నాను. నాచిత్తము స్వాధీనము దప్పియున్నది. నాకు సెలవిండు. నేనెటకేనిం బోయెదను.

విక్రా. పొమ్ము. పొమ్ము. ఓయుదారశీలా! పొమ్ము. నివలె నేను నోర్వలేకున్నాను. వజ్రముకంటెఁగఠినములగు నావాక్యములచేఁ గోమలమగు నీహృదయము నొవ్వఁజేయుటకు నాకు సమ్మతములేదు. పొమ్ము. ఒక క్షణమాత్రమైన నా దృష్టిపథమునుండి తొలఁగిపొమ్ము. నీ యీదీనస్థితిని నేను జూడఁజాలను-నీనేత్రములనుండి కారునశ్రువులు నా హృదయమును భేదింపుచున్నవి. పొమ్ము. మృణాళినీ! పొమ్ము. ఈ కృతఘ్నుఁడగు చండాలుని సహవాసము నీకు క్షణమాత్రమైనవలదు. ఈకసాయివాఁడు నిన్నుమిక్కిలికష్టములకు లోఁబఱచి నీప్రాణములు తీసివేయును. నీవిషయమునఁ గొంచెమైనదయ వీనికిఁగలుగదు. వేలకొలఁది జనులయుద్ధమున సంహరించి కాఠిన్యమొందిన వీనిహృదయమును కరుణాయుతమగు నీ మాటలుకరఁగింపఁజాలవు. నేను కృతఘ్నశిఖామణిని. చండాలాగ్రణిని. విశ్వాసఘాతుకులలో మున్నెన్నఁదగినవాఁడను. ఈ మహానీచుఁడగు దైత్యుఁడు నీయందనురాగమునొందఁడు. బాలా! పొమ్ము. నీవిచటనుండిపొమ్ము. వలదు. వలదు. నీవు ప్రేమపూర్వకమగు దృష్టితో నన్ను జూడవలదు. దీనవగుచు నాతో మాటలాడవలదు. దానను ద్భవించు ప్రణయామృతవృష్టిని స్వీకరించుటకీ పాషాణహృదయమునకు సామర్థ్యములేదు. దేవా! దేవా! ఎట్టిసమయము! కరుణారసభరితులైన యోస్వర్గీయ దేవతలారా! నిర్దయచే నిట్టియమానుషకృత్య మొనర్చుటకుమున్నే నన్నీభూమినుండి తొలఁగించి యుండరాదా?

మృ. (వాని నాలింగనము చేసికొని) మహారాజా! మహారాజా! దయచేయుఁడు. నన్ను దొలఁగింపవలదు. నన్నువిడ నాడకుఁడు.

వి|క్రా. (ఓసరిలి) వలదు. వదలుము. మృణాళినీ! నన్ను వదలుము. నేన నిన్నిది వఱకుఁ బుత్రికానిర్విశేషముగఁ జూచుచుంటిని. మఱియుఁ దోఁబుట్టువునందువలె నీయం దతిప్రేమతోఁ జరించుచుంటిని. నీపైనింత ప్రేమ నాకుఁ గలిగియుండియు నీకు నేఁడు గలిగిన సంకటమును నివర్తింపఁ జేయుట కశక్తుఁడను. నిన్ను బ్రియవచనములతో శాంతపఱచి నీ నేత్రములనుండి స్రవించున శ్రువుల నాపుటకు శక్తిలేకున్నాఁడను. కాఁబట్టి నేఁ జెప్పునదేమనిన? ప్రియ కుమారీ! ఇపుడే పొమ్ము. నేనిచట నొంటరిగ నే పడియుండెదను.

మృ. మహారాజా! ఇపుడు మిమ్ము వదలి నే నెచటికిఁ బోవఁగలను?

వి|క్రా. నీకిష్టమగు చోటికిఁ బొమ్ము. ఇచట మాత్ర మొక క్షణమైనను నుండకుము. పొమ్ము. నాదృష్టిపథమున నిలువకుము-వలదు. అగుము. నీవీ దుఃఖముతోడను గష్టము తోడను నెచటికిఁ బోయి సంచరింపఁగలవు? నీమనమును వెల్లడించి నీదుఃఖము నెవరితోఁ జెప్పుకొనఁగలవు? నిన్ను బ్రియవాక్యములచే నెవరు శాంతిపరతురు? వలదు. నీవిచటనుండి పోవలదు. రమ్ము. మరల రమ్ము. నా ప్రేమ పాత్రయగు మృణాళినీ! నా ప్రియకుమారీ! నీ కత్యంత మిత్రుఁడును, బ్రియసహోదరుఁడు-నపరిమిత వాత్సల్యముగల నీ తండ్రియు నగు నేను నీకొక్కొక సంకట సమయమునను సహాయము చేసియున్నాను. అట్లుండ నేఁడు స్మశానముఁబోలె భయంకరమగు నీభూమియం దనాథయు ననాశ్రయయు దీనురాలగు నిన్నొంటరిగ నెచటికిఁ బంపఁగలను? ఈ వి|క్రాంతుని హృదయమున స్త్రీ ప్రేమ యనునది యణుమాత్రము లేకపోయినను నగియింకను శుష్కముగాకున్నది. నేఁటివఱకును నీవి|క్రాంతుని హస్తము దుఃఖభరితుల నెందఱనో కాపాడియున్నది. అట్టి యీహస్తము పీడితులవిడువఁజాలదు. అహస్తము నిష్కపటురాలును, నిష్కళంకురాలును గుమారికామణియునగు నిన్ను గౌర్యముచే దుఃఖము పాలొనరించి దూరముగాఁజాలదు మృణాళినిని ద్యజించు నీదుర్భర కార్యమున కదియొట్లియ్యకొనును? రమ్ము నా ప్రాణప్రియురాలగు కన్యకా! రమ్ము. నిన్నాలింగనముచేసి కొననిమ్ము. నీకోమలాశ్రువులను నా వాత్సల్య పూర్ణములగు హస్తములచేఁ దుడువనిమ్ము. నీకు శాంతము కలిగించు వాక్యములనీకర్ణములనన్ను నుడువనిమ్ము. నాథుఁడను విషయమున వి|క్రాంతుఁడెట్టి పాషాణహృదయుఁడైనను జనకుఁడను బాంధవ్యమున వానియంతఃకరణ మధమస్థితి నొందలేదు.

మృ. (దూరముననిలిచి) మహారాజా! మిమ్ముఁ జూచుటకుఁ గూడ నశక్తురాలగుచున్నాను, నాథుఁడను బాంధవ్యముతో మిమ్ముల నాహృదయమున సేవచేసి

యిపుడన్యభావమున మిమ్ముస్పర్శింపఁజాలకున్నాను. దూరముగఁబొండు. మహారాజా! పితృవాత్సల్యముతో నిండినహస్తములతో నన్నుస్పర్శింపవలదు. నేనెచటనైన నేకాంతమున నేడ్చుచుండెదను. నాదుఃఖమునకు నేనేయూరట చెప్పికొనెదను. నేనేనన్నుశాంతపఱచుకొనెదను. నన్నిచటనుండి పోనిండు. నాకు మీమాట-మీస్పర్శము-మీసహవాసము నీసమయమున నిక్కలి దుస్సహముగనున్నది.

విక్రాం. అదిసరియే. అగ్నికణములరాల్చు ఘూత్కారయుత కాలసర్పము నెవరాలింగనముచేసికొందురు? ప్రకటజ్వాలాభీల ప్రళయాగ్ని నెవరుకౌఁగిలించుకొనఁగలరు? ప్రాణముల హరించు భయంకరపాశమును ద్రిప్పుచువచ్చు సర్వభక్షకమగు మృత్యువు నెవరాలింగనము చేసికొందురు? మృణాళినీ! నీవిచటనుండి వెడలిపొమ్ము. ఏకాంతముననుండి దుఃఖోపశమనమును చేసికొనుము. వివేకసంపన్నమగు నీ బుద్ధియొక్క యుపదేశముచే నీశోకాకుల చిత్తమును శాంతపఱచికొనుము. మృణాళినీ! ఈవిక్రాంతుఁడిదివఱకునీకత్యంత స్నేహితుఁడుగనుండెను. ఇదిమొదలు వీఁడు నీకు దృఢవైరిగాఁదోఁచును. అయినను వీనిని క్షమించి నీదయాదృష్టి నాతనిపై నిలుపుము. నీకుద్రోహమొనర్చినందులకు వానినెంతేనిందిట్టుము. వానికిశాపమొసంగుము. కానివాఁడునిన్ను నిరాకరింపలేదు-నిన్ను గపటమున వంచనచేయలేదు-ఇదిమాత్రమునీకు జ్ఞప్తియుండనిమ్ము. నేను నీచచండాలుఁడనను మృణాళిని! నీవిషయమున నాకత్యంతస్నేహభావము గలిగియున్నది. నేను నీకు మరలఁజెప్పుచున్నాను. నీవిదిమొదలు నాపై నెంతకోపముండినను, నన్నెంతతుచ్ఛుఁడని తలంచినను నీ విక్రాంతుఁడు నీకెప్పటికిని మిత్రుఁడుగనే యుండును. ఇదినిశ్చయము. నీ యుపకారము నేనెన్నటికిని మఱువను. నీవు దూరముగఁబోయినను నీవైరాగ్యసద్గుణసంపన్న పవిత్రమూర్తి నాహృదయమునందు నిజముగ నిలిచియుండును. పొమ్ము. ఈ హృదయమును గరఁగింపఁజేయు నీ దుఃఖావస్థను నేను జూడలేకున్నాను.

మృ. మహారాజా! తుదకు నాయుత్కృష్టమైన ప్రేమ యిట్టిస్థితికి వచ్చెనా. దేవా.

(పోవును)

విక్రాం. (స్వగతము) ఉదారదేవతపోయినది. ఈ కాఠిన్యము వహించిన విక్రాంతుని మనసునకు శాపమిడుచుఁ బోవుచున్నది. ఇదిమొదలీదీనురాలి సుఖము నాశమొందినది. ఇదిమొదలద్వితీయలావణ్యయుతమును జంద్రసమానమునగు నీమె ముఖము ప్రసన్నతతో నుండఁజాలదు. అమెచర్యలయందిదిమొదలుదాసీనతయేయుండును. విక్రాంతా! విక్రాంతా! నీనెటులీరీతినధమ

చండాలుఁడవైతివి ! నీయౌదార్య మెచటఁబోయినది ? సదాదయాపూర్ణ మగు నీహృదయమిట్టికాఠిన్యము నేఁడెట్లువహించెను ? విశ్వములోనుండు సకలక్రూర దేవతలారా ! ఈచండాలు నొకనిమునమున జగమునుండి తొలఁగింపుఁడు-వీనిపై నత్యంత సంకటములవైచి గ్రుక్కింపుఁడు-వీనినధఃపతితుం గావింపుఁడు ! ఓకృతఘ్నా ! నీవుచేసియుండు క్రూరకర్మము లనెడియగ్నింబడి భస్మీభూతుఁడవుగమ్ము—(క్రిందఁబడును)

రంగము ముగియుచున్నది.

---

# రాజభక్తి నాటకము.

అంకము 5. రంగము 6.

స్థలము:—మృణాళిని యొక్క—గృహము.

(ప్రవేశము-మృణాళిని.)

మృ. (స్వగతము) అయ్యయో ! (ప్రవేశము-కుముద.)

కుము. దేవీ ! ఏమయినది ?

మృ: ముగిసినది. అంతయుఁదెలిసినది. ఆవిషయమిపుడు మాటలాడవలదు.

కుము. అయినను మహారాజు మిమ్మంగీకరించెనా ?

మృ. లేదు.

కుము. ఎట్టినిర్దయాత్ముఁడతఁడు ! విక్రాంతమహారాజుస్వభావమింత కఠినమగునదని నాకిదివఱకుఁ దోఁపలేదు.

మృ. కుముదా ! ఆకరుణాసాగరుని గఠినుఁడని నేనెట్లు చెప్పనగును ? కానిగొప్పవారిమనస్సులు చమత్కారయుతములు. ఇదిమాత్రమునిజము.

కుము. అట్లని మీమనోభావ మాతనికిఁ దెలియదా ? లేక, తెలిసియు మిమ్మిట్టికష్ట ములకు లోఁబఱచెనా ? దేవీ ! ఇఁక మనము చేయవలసిన దేమి ?

మృ. కుముదా ! మతేమున్నది ? వేఱుమార్గములేదు.

(ప్రవేశము సేవకుఁడు)

సేవ. దేవీ ! విక్రాంతమహారాజు మిమ్ముందన శిబిరమునకు రావలయునని విన్నపము చేసికొనుచున్నారు.

మృ. ఇదేవచ్చుచున్నాను. నీవుముందు నడువుము. (సేవకుఁడుపోవుచున్నాఁడు నేవేసికొను ముసుఁగుగొని తెమ్ము. నేఁబోయివచ్చెదను. (కుముదముసుఁగు దెచ్చియిచ్చును. ఇద్దఱుపోవుచున్నారు.)

రంగము ముగియును

---

# రాజభక్తి నాటకము.



అంకము 5. రంగము 7.

స్థలము:—విక్రాంతునిశిబిరము.

(విక్రాంతునిభటులు మదాలసను శిబిరములోనికిఁ గొనివచ్చి కూర్చుండఁబెట్టుదురు)

మదా. (భటులువెలుపటికిఁ బోయినపిమ్మట స్వగతము). ఇదినాయొక్క కడసారి ప్రయత్నము. ఈదినము విక్రాంతుఁడు నాదాసుఁడైనం గావలయు, లేక ప్రాణములైనను వదలవలయు. (కఠారిని జేతనెత్తికొని) ఓ శస్త్రమా ! నీవు మంచిసమయమున నన్ను మోసగింపవుగదా ? ఒకవేళ నీ కార్యముగూడఁ గలుగకుండునేమో ? నావంటి లోకోత్తరసౌందర్యముగల స్త్రీయొక్క క్రీగంటిచూపు నీకంటెఁబెక్కుమడుంగులు తీక్ష్ణమగునది. నీవంటిశక్తిహీనములైన యస్త్రములెట్టి మహాధురంధురులగు వీరులహృదయములను వశముచేయలేక పోవునో యట్టివారి హృదయములను మాయట్టివారి వీక్షణములందలి తీక్ష్ణత

ఖండమొనర్చి వారినిజయించి మాావశముగావించియున్నది. వలదు నాకు నీసహాయము. నా సౌందర్యము, వచోనైపుణ్యమును గార్యమును సిద్ధింపఁజేయును. ఒకవేళ వానికి జయముకలుగకపోయిన ? చీ! అసందేహాము వలదు. వానికి జయముకలిగియే తీఱవలయు. మున్ను రెండు పర్యాయముల విక్రాంతుఁడునన్ను బ్రణయయుద్ధమునఁ బరాజితను గావించెను. ఆసమయమున స్త్రీలు పురుషులను దమవశము చేసికొనుట కుపయోగించు శృంగార సాధనముల నేనుపయోగింపలేను. కాని నేఁడువానిలోనొకదానినైన నుపయోగింపక వదలను. కనుక నీవుపొమ్ము. మరలి నీస్థానమున స్వస్థముగఁబడియుండుము. (దానినొరయందుంచును-వినుట నభినయించి) విక్రాంతుఁడు వచ్చునట్లు తోఁచుచున్నది]

(ప్రవేశము. విక్రాంతుఁడు)

విక్రా. మదాలసా! నీకు నాయెడనేమిపనియున్నది ?

మదా. విక్రాంతా! నీవు నన్నింతవఱకేల సంధింపకుంటివి ?

విక్రా. నిన్ను సంధించుటకు నిజముగ నాకిష్టములేదు. కాని నా ప్రజల యాగ్రహముచూడ నాకు వేఱుపాయము లేకపోయెను.

మదా. అయిన, మనవైరము స్థిరముగ నుండవలయునని నీ యిచ్ఛయా ?

విక్రా. అగును-నాయిష్టమదియే.

మదా. అట్లుండుటకుఁ గారణమేమి ?

విక్రా. అదితొలఁగుట సాధ్యముగాదు.

మదా. ఎందులకు ?

విక్రా. ఎందులకా ? నితోవైరముమాని స్నేహముగ నడచుకొనుటకు నీవు మాకేమి యుపకారమొనర్చియున్నావు ? అమానుషపాతకరూప కళంకమును శిరముపై భూషణముగ ధరించికొని చరించుచుండు రాక్షసితో సఖ్యముచేసికొనుట కెట్లుశక్యమగును ?

మదా. నాసర్వపాతక క్షాళనము చేసికొని పవిత్రనగుటకు సిద్ధముగనుండినచో ?

విక్రా. హత్యలు, రక్తపాత మొనతెకుఁబాతకమనితోఁ పదోయాూమె వానినెట్లు క్షాళనము చేసికొనఁగలదు ?

మదా. అటుకాదు. ఆకృత్యములు పాతకములని యిపుడునాకుఁదెలియుచున్నవి ?

విక్రా. నీమాటలు నీచర్యలునాకు మిక్కిలి పరిచితములైయున్నవి కనుక నీవిట్టికపటములచే నన్నెప్పటికిని మోసగింప శక్తురాలవుగావు.

మదా. కాదు. కాదు. ఇప్పుడు నాకునిజముగఁ బశ్చాత్తాపముగలిగెను. మఱియుఁ బాపక్షాళనముకొఱకు నా మన సాతురత నొందియున్నది.

విక్రా. రక్తపాతహత్యలచే బలాత్కారమున హరించిన నీ రాజ్యాధికారము మంటఁ గలియువఱకు నీకుఁ బాపప్రక్షాళనము కాఁజాలదు.

మదా. నీకట్లుతోఁచిన నీసామ్రాజ్య మకుటమును నీపాదముపై నిడెదను. మనమిపు వురము రాజ్యభోగము లనుభవింతము. నీకు సహధర్మచారిణియగుటకు నేను సిద్ధముగ నున్నాను.

మ. సీ॥ ననుభార్యగాఁగొని నాకిరీటముదాల్చి లీలతో భువిని బాలింపరాదె.
వి. స్త్రీపిశాచంబును జేపట్టినేనట్లు, మగదయ్యమై భూమిమనఁగఁగలనె.
మ. వీరాధివీరుఁడై వెలయునీయందు నామదిచిక్కి విడలేక మడియుఁగాదె.
వి. నాశౌర్యమెపుడు నీ నాశకారియు కాని యొకట సహాయమై యుండఁగలదె.
మ. మదనార్తిఁదపియించు మగునకుదయఁజూపి యార్తత్రాణకీర్తినందరాదె.
వి. అశీవిషంబవై యందఱఁజంపు నీవబలవౌదువెమ త్తబలగాక.
మ. మొగములావణ్యంబు సొగసుసోయగ మెల్లఁగనివైన నాపొందుగనఁగరాదె,
గీ॥ వి. తుచ్ఛసుఖమును నెదఁగోరిస్వచ్ఛకీర్తి, గొంతవిడుతునె, దుర్దాంత ! కపటశీల !
మ. కుసుమకోమలగాత్ర ! నాకూర్మితోఁడ ! నెమ్మిఁగనుమింక నన్నుమన్నించుప్రోడ !

విక్రా. నీయట్టి పిశాచినాకు సహధర్మచారిణి గానేరదు.

మదా. నన్ను భార్యగా స్వీకరింపనేమి యాటంకము ?

విక్రా. నీవంటి మహాపాపాత్తురాలికిఁ బ్రియుఁడనియుఁ హితుఁడనియుఁ జెప్పుకొనుచు నగౌరవముతో సిగ్గులేక యీ భూమినిజరించు నపేక్ష నాకెప్పటికిని గలుగదు.

మదా. నాకు నీ యట్టి ప్రతాపశాలియగు వీరునికరవాల సహాయమత్యంతాపేక్ష ణీయముగనున్నది.

విక్రా. నా కరవాలమూలముననా యన్యాయమగు నక్రమ కార్యములఁ జేయింప నాన గొనియున్నావు ?

మదా. నీపై నను రక్తియుంబ్రేమయుంగల యీయబలకే నది సహాయ మొనర్చును గదా ?

విక్రా. మదాలసయును బ్రేమయును నెట్లు చేరియుండనగును ? విషవల్లిగర్భమున నమృతమయమగు క్రిమియొకటి జనించినదనిన నిజమని యెవరునమ్ముదురు ?

మదా. అటుకాదు. అటుకాదు. విక్రాంతా ! నీవు తప్పుతలఁచుచున్నావు. ప్రేమతోఁ బరిపూర్ణమగు నీశరీరము సౌందర్యముచే భూషితమైయున్నది.

విక్రా. విధాత యిట్టిపాతకముల సంపాదించుటకీసౌందర్యమును నీకుఁగల్పించి యున్నాఁడు. ఇట్టివికారములచే నిండినరౌరవ కూపముపై నిట్టిలోకోత్తర

సౌందర్యమును మూఁతను బరమేశ్వరుఁడు నిర్మించుటకుఁ గారణమేమో నాకుఁదెలియకున్నది. అదియట్లుండనిమ్ము. నీసౌందర్యమునుగూర్చి చర్చ నేయుటకు నాకిష్టములేదు.

మదా. కానినేను నా సౌందర్యచర్చ నీతోఁజేసియే తీఱవలయును.

విక్రా. అటులేని నీయిష్టమునింక నిలుపుము. (శిబిరములోనికిఁబోవును).

మదా. (వానిని నడ్డగించి) నా సౌందర్యము నవమాన పఱచెదవా? విక్రాంతా! నిలువుము. తారుణ్యముచే నిండియుండు లావణ్యలతికయగు నన్నిట్లనాదరముచేయకుము. నా యీయున్నత వక్షముపై, నీశిరము నిడిక్షణమాత్రము విశ్రమింపుము, నీ సుందర బాహువులచే నా కంఠము నాశ్లేషించి క్షణమాత్రము ప్రేమలోల దృష్టిచే నన్నుఁజూడుము. ప్రేమాతురయగు నన్ను నీ దాసిగఁ జేసికొని యథేచ్ఛముగ సుఖముల ననుభవింపుము.

విక్రా. మున్నొకనాఁడు నేను వేఁటకరిగియుండ విషాగ్నులం గ్రక్కుచుండు నొక్కయాడుత్రాఁచుచేఁ జుట్టఁబడియుండు నొకచెట్టుక్రింద రేయెల్లంబరుండి నిదిరించుచుంటిని. అప్పుడది గాటువైచినను నోర్చియుంటునుగాని, యోమదాలసా! విషపూర్ణమగు నీ వక్షముపై శిరముంచుకొని పరుండఁజాలను, ఇట్టిదురాశలు నన్నెప్పుడును గలఁచివైవఁజాలవు.

మదా. విక్రాంతా! ఇంతకోపము నీకుఁదగదు. నీవునన్నంగీకరించియే తీఱవలయును.

విక్రా. జగమంతయు నాశమొంది యీ పృథ్విపై నీవునేను మాత్రము జీవముతో నుండినను నిన్నంగీకరింపను.

మదా. (వానికంఠము కౌఁగిలించుకొని) ఈ యప్సరసయొక్క సుందరబాహుపాశము ను నీవెట్లువిడఁ దీసికొనఁగలవో నేఁజూచెద.

విక్రా. (చేతులను విడదీయుచు) నీయట్టి యప్సరసల గర్వభంగమొనర్చుటకు నాకు సామర్థ్యముగల దనువిషయము నీకుఁ బ్రత్యక్షముగఁ జూపెదఁగాక - ఈ నీచురాలి హస్తపాశముల విక్రాంతుఁడు తనబలముచే నిట్లుత్రోసి వేయుచున్నాఁడు. (దానిచేతులను విడిపించును)

మదా. విక్రాంతా! వలదు. వలదు. నన్నిట్లుధిక్కరింపకుము. (మరలఁగౌఁగిలింపఁ బోవును)

విక్రా. చాలును నీహఠము. ఇపుడేయిచటినుండి వెడలిపొమ్ము. లేకున్న యుద్ధ నియమములమీఱిన నిన్నిపుడే బంధితం గావించెదను.

మదా. నేనొనర్చిన యుపాయములెల్ల వ్యర్థములయ్యెనని యీ మాత్రమునకే నీవు నన్ను జయించినట్లు భావింపకుము. ఈ మదాలస యట్టి సత్వహీనగాదు.

విక్రా. నేనొకవేళ నస్త్రముచేజయింపఁబడవలయుననిన రణరంగమునఁ గదవాల బలమున జయింపఁబడుదునే కాని యేకాంతమునం బ్రణయబలాత్కారమున జయింపఁబడను. దీనిని నిక్కముగ నమ్ముము.

మదా. అయిననిన్ను బ్రాణముతోనుంచినఁగదా (వానినిగఠారితోఁబొడువఁబోవును. తటాలున మృణాళినియటకువచ్చి దానిచేయిపట్టుకొని శస్త్రమును దీసి వేయును.)

విక్రా. (దానిచేయిపట్టుకొని) మదాలసా! మర్యాద యతిక్రమించెను. అయినను బొమ్ము. నేనునిన్ను బ్రాణముతో విడిచిపెట్టెదను. నీవంటి హీనురాలగు స్త్రీయొక్క రక్తముచే నాకరము నశుద్ధఁజేసికొన నిష్టపడను. నిన్నువిడిచి పెట్టిన నాకార్యమున కెంతయు హానిగలుగును, నిన్నిపుడు బంధించిన నన్ను దుర్బలుఁడని జనులందురు. ఋజుమార్గమున నిన్నుశిక్షింపఁ జాలక యీ కవటయుక్తియొనర్చితిననున గౌరవమునాకుఁ గలుగును. దానివలన నాకార్యమున కెక్కుడుహానియుఁగలుగును. అయినను, బొమ్ము. నేను నిన్ను మన్నించియున్నాను. సూర్యకులమునను ద్భవించినస్త్రీయెడ - విక్రమాదిత్య మహారాజుయొక్క సోదరియెడ - నా ప్రియమిత్రుఁడగు శశాంకరాజుయొక్క పత్నియెడ - నిట్టి సమయమునఁగూడ వేఱువిధముగఁ జరింప నీ విక్రాంతున కిష్టములేకున్నది. నీ చోటికి నీవు మరలిపొమ్ము. యుద్ధభూమియం దీవిక్రాంతుని జయింపవలయు నను మహత్త్వాకాంక్షవహింపుము. ఇట్టియల్పమార్గముల నవలంబించి, నీ గౌరవము పోఁగొట్టుకొనకుము. (గంటకొట్టుచున్నాఁడు. సిపాయీలులోనికి వచ్చుచున్నారు. సిపాయీలనుజూచి) మాసమాగమము ముగిసినది. ఈ యమను మనశిబిర బహిఃప్రదేశమున వదలుఁడు. (మదాలస గొణిగికొనుచుఁ బోవుచున్నది). మృణాళినీ! నీవుచేసిన యీనూతనోపకారమునకై నేను మిక్కిలి కృతజ్ఞుఁడను.

మృ. పుత్రికచేసిన కార్యమునకై తండ్రి కృతజ్ఞుఁడై యుండవలయునా?

విక్రా. ఏమి. ఏమి. ఏమివినుచున్నాను నేను? మృణాళినీ! చెప్పుము. ఆమాట మఱియొకసారి చెప్పుము. మఱియొకసారి దానిని నావీనులార వినెదను - చెప్పుము.

మృ. మహారాజా! మీ యిష్టానుసారము - మీ యాజ్ఞానుసారము, నేను - ఈ మృణాళిని - ఇప్పటినుండి, మీపుత్రికనగుచున్నాను.

విక్రా. నాపుత్రికయగు మృణాళినీ! నాప్రియపుత్రికా! మృణాళినీ! ఆహాహా! ఎంత యానందమునాకుఁ గలిగించితివి. మృణాళినీ! బాలా! రమ్ము. ఇపుడు నను నీ - తండ్రి నాలింగనము చేసికొనుము. నిన్నెంతయు స్తుతించెదను.

మృ. తండ్రీ - తండ్రీ - అవును. నేటినుండి మీరునాకుఁదండ్రియే - తండ్రీ! ఈ పుత్రికపై దయయుంపుఁడు. (ఇద్దఱు నాలింగనముచేసి కొనెదరు).

విక్రా. పుత్రికా! పరమేశ్వరుఁడు నిన్నెల్లపుడును సుఖముననుంచుఁగాత.

రంగము ముగియును

---

# రాజభక్తి నాటకము

—:o:—

అంకము 6. రంగము 1.

(స్థలము:—యుద్ధభూమి,
ప్రవేశము - మదాలస కోదండుఁడు )

మదా. ఇఁక నేయుపాయమున విక్రాంతుని జయించుటయో నాకుఁదెలియకున్నది.

కో. మహారాజ్ఞీ! ఇట్లునిరాశపడుట బాగుగాదు.

మదా. అలభ్యవస్తువుపై మోహముగాంచుట బుద్ధిహీనతయగును. నిరాశయ యుచితముకాని యిప్పటికిని నామది తనప్రయత్నముల మానఁజాలకున్నది. దీనందప్పక మృత్యువే కలుగునని నామానసమెఱుఁగును గాని యదితన పట్టుదల వీడకున్నది. కష్టసమయ మాసన్నమైనపుడు దానినెదుర్కొన మను జుఁడెట్లుప్రవర్తిల్లునో యట్లే యా యాపదవలనం దప్పుటకుఁదగిన బుద్ధిబలము నుండవలయును. యశోభిలాషులై మార్గ్యమునఁ గార్యముల నాచరించుట కంటె నపయశము గలుగునను నిశ్చయము దోఁచినపుడుఁగూడఁ దనవిధినతి క్రమింపక జరుపువారు పురుషులైనను స్త్రీలైనను మిక్కిలి శ్రేష్ఠులని నా యా శయము. కావున నాచిత్తస్థైర్య మెప్పటికిని మాఱుపాటు నెందదు.

కో. అట్లేని ముందొనర్పవలసిన కార్యమేది?

మదా. నేనిదివఱకే యాలోచించికొంటిని. ఇదెవినుము (వానిచెవిలో నేదోర హస్యముచెప్పును) ఈ రీతిగఁజేసిన దురదృష్టవశమున నేను నాశమొందినను

విక్రాంతుని సర్వప్రయత్నములు వ్యర్థములగును. మఱియు వానిపై సంపూర్ణముగఁ బగతీర్చికొనినట్లగును.

కో. ఈ విషయమున దుర్జయుఁడు సిద్ధపడఁగలఁడా ?

మదా. దానింగూర్చి నీవుచింతింపవలదు.

కో. అట్లేనిపుడే యాకార్యమున కుపక్రమింపవలయును.

మదా. ఇపుడు వృథాకాలయాపనమునఁ బ్రయోజన మేమియులేదు. పొమ్ము. వానినిచటికిఁబంపుము. నీవుచండవర్మయుండు యుద్ధభూమికి శీఘ్రముగఁబొమ్ము.

కో. మదాలసా ! వాఁడీకార్యమున జయ మొందక పోయిన ?

మదా. వెంటనే వానికిమరణశిక్ష విధించెదను. మనయిరువురి సుఖమున కడ్డముగవచ్చు నీకంటకములేకపోవును.

కో. ఒకవేళ నాకార్యమున జయమునొందివచ్చిన నాకంటకము పెద్దదగునుగదా ? అపుడేమి చేయవలయు ?

మదా. కోదండా ! నీవు భయపడవలదు. ఆకార్యమును సాధించుకొని వాఁడు వచ్చినను జీవముతోనుండుటకు వానికధికారములేదు. ఇదివఱకు వాని యాయుష్యము నాయిష్టానుసారము పెరుగుచున్నది. ఏసమయమున నిష్టములేకపోవునో యాక్షణమున వానికాయువు ముగియఁగలదని తెలిసికొనుము. నీకేచింతయువలదు. ఎటులైనను వాఁడు చాలదినములు బ్రదికియుండఁడు. పొమ్ము. వాని నిచటికిఁ వెంటనేపంపుము. (కోదండుఁడు పోవును) పొమ్ము. ఓ పశువా ! నీవును శీఘ్రకాలమున మదాలసా మహత్త్వాకాంక్షకు బలియగుదువు. దీనిని బాగుగ నెఱుఁగుము. నేఁడు కాకపోయిన రేపు నీకు నదేమార్గము సిద్ధించును. నామైత్రి సంపాదించుకొనిన పిమ్మట నాకు బలిగాకయుండు యోగ్యతగలవాఁడు విక్రాంతుఁడొకఁడే. వాఁడు శత్రుత్వము సంపాదించుకొని నాకు బలియగువారి తెగలోఁజేరి యున్నాఁడు.

(దుర్జయుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దుర్జ. మహారాజ్ఞీ! ఏమియాజ్ఞ ?

మదా. నీకు నాపై నెంత ప్రేమయున్నది ?

దుర్జ. అదియేమి ? ఈ చమత్కార ప్రశ్న నన్నేలమీరడిగెదరు ?

మదా. నేఁడు నీప్రేమను బరీక్షింపఁ దలఁచితిని.

దుర్జ. అట్లని మీపై నాకుఁబూర్ణప్రేమగలదు. దేవి యాజ్ఞ యిడవలయును. అపుడే దానిం జేయ సంసిద్ధుఁడను.

మదా. అట్లైన సరోజినీ చంద్రశేఖరులఁజంపు చండాలకృత్యమునకు నీవుపూనవలయును.

దుర్జ. చండాలుని యుద్యోగమా ?

మదా. అగును. మదాలసా మహారాజ్ఞి ప్రేమకుఁ బాణిగ్రహణమునకు నిష్టపడువాఁడిట్టి సాహసము చేయకుండిన నాయనుగ్రహమునకెట్లుపాత్రుఁడు కాఁగలఁడు.

దుర్జ. మీ ప్రేమకు నేనట్టి ఘోరకృత్యమునేనిఁ జేయసిద్ధముగనున్నాను. కాని యీ కార్యమెట్లు సాధ్యమగును? నాకుఁ గూర్మదుర్గమునఁ బ్రవేశమెట్లులభించును ? అచట నీ కార్యమెట్లొనర్తును ?

మదా. అందులకుఁదగు నేర్పాటులు సేయఁబడును. ఈపనిచేయుటకు నిమనసుసిద్ధపడుచున్నదా ?

దుర్జ. మీ మనస్సును నామనస్సును దన్మయత్వ మొందియుండుటచే మీకుఁగలుగు నభిప్రాయములు నాకు సమ్మతములే.

మదా. అట్లైన శిబిరములోనికిఁబొమ్ము. అచట నన్నివిషయముల సవిస్తరముగఁ దెలిపెదను.

రంగము ముగియును (పోవుచున్నారు)

# రాజభక్తినాటకము.

—:o:—

అంకము 6. రంగము 2.

స్థలము:—కూర్మదుర్గమున సరోజిని రాచనగరులోని శయ్యాగృహము.

(మంచముపైఁ జంద్రశేఖరుఁడు గాఢనిద్రపోవుచుండును. ద్వారకముకడ సిపాయీలు కావలియున్నారు. వేషాంతరమున దుర్జయుండొకమూలనుండి వచ్చును.)

దుర్జ. (స్వగతము) నాలుగుగడియల కాల మీ చీఁకటిమూల నుండినందున నాకు మిక్కిలి యాయాసముగలిగియున్నది. ఇపుడు కాలయాపన మిక నుంతేనింజేయక చంద్రశేఖరు నిగ్గత ప్రాణు నొనర్చుటకుఁ దామసింపరాదు. (కటిప్రదేశమునుండి కఠారినిఁ గైకొని చంద్రశేఖరుఁడు మంచముపై నిద్రించుచుండ వానియురమునఁ బొడువఁబోవును. తటాలున "మోసము - మోస" మని యఱచుచునే యొకసిపాయి వెనుకనుండివచ్చి వానిచేతిని బట్టుకొనును. దుర్జయుఁడు చేయివదలించుకొని చంద్రశేఖరుని యురమునఁ బొడిచి పరుగెత్తిపోవును. సిపాయియు దుర్జయుఁడును బోరాడుదురు - సిపాయి మరల "మోసము. మోసమని" యఱచుచుండును. జగడమున దుర్జయుఁడు సిపాయినిజంపి పరుగెత్తిపోవనుంకించును. మఱికొందఱు సిపాయీలు గదిలోనికిఁబోయి వానిని బట్టుకొందురు.)

దుర్జ. నన్నుబట్టుకొనుఁడు. మీ యిష్టానుసారము నన్నుబట్టుకొనుఁడు. నాకపటము నాకు జయమొసఁగినది. మద్రాలసామహారాజ్ఞిశత్రువు చంపఁబడెను. ఆ యమసింహాసనము స్థైర్యమందెను.

(ప్రవేశము - సరోజిని.)

సరో. చంద్రశేఖర మహారాజు చంపఁబడెనా ?

దుర్జ. అగును. ఇపుడే యాపౌరుష కార్యము నేననాచేతులారఁ జేసిముగించితిని.

సరో. (మంచము కడకుఁబోయి చూచి యులికిపడి వెనుకకు వచ్చును) ఆహా ! అంత యుం బాడైనది. చంద్రశేఖరుఁడు గతించెను. నాసత్యము మునిఁగినది. నా గౌరవము మంటఁగలిసెను.

(ఉగ్రసేనుఁడు సిపాయిలతోఁ గరదీపములంగొని ప్రవేశించును)

ఉగ్ర. లేదు. లేదు. దేవీ ! మీరుస్వస్థముగనుండుఁడు. మీ గౌరవము సురక్షిత మైయున్నది.

దుర్జ. చూడుము. ఆమంచముపైఁజూడుము. నా కఠారిచే గాయపడి చచ్చిన

చంద్రశేఖరునిశవము చూతుము. పిమ్మట మహారాజ్ఞిగౌరవము సురక్షితముగ నున్నదని ప్రగల్భములాడుము.

ఉగ్ర. ఎవనిశిరముపైఁ బరమేశ్వరుని కృపాచ్ఛత్రమున్నదో యట్టివానిజీవమునకు నీయట్టిపామరునిచే నెట్టియపాయము గలుగఁగలదు ?

దుర్జ. ఈశ్వరుని కృపాచ్ఛత్రముమాట యిపుడేల? ఆ మంచమునొద్దకుఁ బోయి చూచి పిమ్మట ఈశ్వరునికి ధన్యవాదము లొనర్పుము.

ఉగ్ర. అట్లనింజూడు మీశ్వరలీలయొక్క యానందము. మదాలసా మహారాజ్ఞి యొక్క శత్రు వీశ్వరుని కృపాచ్ఛత్రముక్రింద సుఖముగ గాఢనిద్రయందు నిమగ్నుఁడై యున్నాఁడు. (కవాటము దెఱచి గుప్తస్థలమున లోపలిప్రాంత మున మంచముపైఁ జంద్రశేఖరుఁడు నిదురించుచుండ వానిప్రక్కనఁ గంద నుఁడాసీనుఁడైయుండును. మఱియు నలుప్రక్కల నొరలనుండి తీయఁబడిన కరవాలములఁ జేతనంది నలువురు సిపాయిలు కావలికాయుచుందురు).

సరో. ఏమి ! ఏమి ! చంద్రశేఖరుఁడు బ్రదికియున్నాఁడా ?

ఉగ్ర. అగును. దేవీ ! చంద్రశేఖరుని ప్రాణమున కేయపాయముం గలుగలేదు.

సరో. అట్లని నా కన్నులఁదనివిదీఱ వానింజూడనిండు (చంద్రశేఖరుఁడుండు గదిలోనికిఁబోవును)

దుర్జ. ఇదేమి చిత్రము ? చంద్రశేఖరుఁడు బ్రతికియున్నాఁడు ! అయిన నా కఠారి తో నేనెవనింబొడిచితిని ?

ఉగ్ర. వాఁడును జంద్రశేఖరుఁడే.

దుర్జ. ఏమి ! వాఁడును జంద్రశేఖరుఁడా ? అట్లు నీ రెండవచంద్రశేఖరుఁడెవఁడు ?

ఉగ్ర. మొదటివాఁడు చంద్రశేఖరు నాకారమున నమర్పఁబడిన మైనపుబొమ్మ.

దుర్జ. మైనపుబొమ్మయా ?

ఉగ్ర. అగును - మైనపుబొమ్మ - ఈరీతి నెప్పుడేనింజరుగునని నాకు మొన్నటినుండి యనుమానము గలిగెను. కాని, నామాటపై నెవరికిని నమ్మకముగలుగలేదు. కాఁబట్టి నేనెవరికిం దెలియకుండ నిట్టియేర్పాటుచేసితిని. (మంచముపైనుండి యా బొమ్మనెత్తి వానిముందఱ నునిచిదానిహృదయమున గ్రుచ్చియుండు కఠారినిబయటికిఁదీయును) చూడుము. చూడుము; నీ నీచప్రయత్నము నిన్నే మోసపుచ్చెను.

(సరోజిని, చంద్రశేఖరుఁడు, కందనుఁడు సిపాయీలతోఁ బ్రవేశింతురు)

దుర్జ. అయ్యయ్యో ! నా జీవమంతయు నాశమయ్యెను.

కంద. ఇట్టి యధమచండాలుఁడవగు నీ వెవఁడవు ? చెప్పుము

దుర్జ. ఇపుడు నేనేమనఁగలను ? వీనిముందు నా కంఠము రుద్ధమాయెను.

కంద. చండాలా ! నిన్ను వెల్లడింపకవదలను. (వానినిగొట్టును) చెప్పుము. చెప్పుము. నీ వెవఁడవు ?

ఉగ్ర. ఆగుఁడు. వాఁడు మాటలాడకపోయినను నీ చీఁకటి నా తెరమాటుననున్నను నేను వానిని బాగుగ గుర్తింపఁగలను. (వాని ముఖముపైనుండు వస్త్రము దీసివైచి) సుధీరా ! చీఁకటినిండెర మఱుఁగున దాఁగుకొనుటచే వివర్ణమౌ కళంకము వహించిన నీముఖముచూపుము. అందఱు నిన్ను జూడనిమ్ము. (తెర నెత్తివేయును.)

సరో. ఏమి ? సుధీరుఁడా ! అయ్యో దేవా ! సుధీరా ! సుధీరా ! ఏల విశ్వాసఘాతుకుఁడవైతివి. (వానిదగ్గఱ కామెపోవును. వాఁడుముఖము ద్రిప్పుకొనును)

ఉగ్ర. వానిముఖముపై వెలుతురుపడనిండు (వానిముఖముపై దీపపు వెలుఁగుపడును. అంత దుర్జయునియొక్క తాత్త్వికరూప మందఱకుం గనఁబడును. అందఱు నాశ్చర్యచకితులగుదురు.)

సరో. (భయపడి) ఏమి ! ఏమి ! ఏమిచూచుచున్నాను నేను ! కాని మీరిటకెట్లు వచ్చితిరి ?

దుర్జ. ఎట్లువచ్చితినో - ఏలవచ్చితినో - అంతయుముగిసినది. ఆవిచారమిపుడేల ?

ఉగ్ర. మీరు చెప్పకపోయినను మీవేషము మీకపటమును వెల్లడించుచునే యున్నది. సేవకులు వానిపై వస్త్రములఁ దీసివేయుదురు. అంత వతని వాస్తవమగు దుస్తులుగన్పట్టును.

సరో. మీరాసుధీరునివేసమున వచ్చితిరి ?

దుర్జ. అగును, సరోజినీ ! నీ యతిశయిత రాజభక్తినిష్ఠకుందగు గొప్ప ఫల మొసఁగనుంటిని. కాని, యాకార్యము సఫలముగాకపోయెను.

సరో. దేవా ! దేవా ! నేనేమి వినుచున్నాను ? (మూర్ఛనొంది క్రిందఁబడును.)

ఉగ్ర. మహారాజ్ఞి నిచటినుండి కొనిపొండు. మఱియు సర్దారుల నందఱంబిలువుఁడు. ఇపుడే యీ హంతకుని నేరమును దగురీతి విచారింపవలయును.

రంగము ముగియును

# రాజభక్తి నాటకము



అంకము 6. రంగము 3.

స్థలము—కొరాడ్మదుర్గమునందలి వధ్యశిల.

(దుర్జయునిం బరివేష్టించి రాజువయుద్యోగులు నిలుచఁబడియుందురు.
సరోజిని యుచిత వస్త్రములందాల్చి ప్రవేశించును)

మొ-సర్దా. దేవీ! రాజవధకుఁ బ్రయత్నించిన నేరము, విలంబుఁడను సేవకుని హత్య యొనర్చినపనేరమును దుర్జయునిపై నారోపింపఁబడియున్నవి.

రెం-సర్దా. దుర్జయుఁడు గపటవేషమున దుర్గము ప్రవేశించిన నాఁటిమొదలు చేసిన యెల్లదురాచారములకును దానమూలకారణమని యతఁడే యొప్పుకొని యున్నాఁడు.

సరో. మన దుర్గమునందలి గుప్తవార్తల బయలుపెట్టినవాఁడును, మన శస్త్రముల నాశమొనర్చినవాఁడును, మన సిపాయీలకు విషప్రయోగమొనర్చినవాఁడును దానేయని యంగీకరించెనా ?

మొ-సర్దా. అగును. అంతమాత్రముగాదు. ఈ కార్య మొనర్చినందున దన్నుదాను మిక్కిలి ప్రశంసించుకొనుచున్నాఁడు.

సరో. ఈ నేరములకు శాస్త్రమున నేమిశిక్ష విధింపఁబడియున్నది.

మొ-సర్దా. దేహాంతదండనము చెప్పఁబడియుడిన్నది.

రెం-సర్దా. బాగుగ నాలోచించునెడల-నాదండనమే యీయపరాధికిం దగునదగును.

మూ-సర్దా. దండనమొనఁగు స్వాతంత్ర్యము మహారాజ్ఞియెడ నున్నది ?

సరో. ధర్మాధికృతు లీవిషయమున నేమి నిశ్చయించియున్నారు ?

మొ-సర్దా. శాస్త్రమున విధించియుండుప్రకారము దేహాంతదండనమే యీ యపరాధికొసంగవలయునని వారి యభిప్రాయము.

రెం-సర్దా. అపరాధియొక్క భయంకరస్వరూపము వాని పూర్వచరిత్రమును జక్కఁగ బరికించియే వారిట్లు నిర్ధారణచేసిరి.

మూ-సర్దా. కాని శాసించుటయం దేమైని మార్పుచేయవలయునని మహారాజ్ఞికిష్టముండిన మాకెట్టి యాక్షేపణయులేదు.

సరో. శాస్త్రమున విధించియుండు దండనమును మార్పవలయుననిన మిక్కిలి బలవత్తరమైన కారణముగావలయును. కాని యీ విషయమున నట్టికారణమేదియుం గనబ్బటదు.

దుర్జ. అటులనే కానిమ్ము, ఆ దండనమునకు సమ్మతినొసంగి పతిహత్యయను పాతకమును నీవు శిరమున వహించుచున్నావను విషయము నీకుఁ దెలియుటలేదా?

సరో. సమరాంగణమునందు న్యాయసభయందును బాంధవ్యమును బాటింపరాదని ధర్మశాస్త్రము స్పష్టముగ నాజ్ఞ యిడుచున్నది. ఇది యందఱకుం దెలిసినదియేకదా?

సర్దారులు. దేవి చెప్పునదెంతయును యుక్తమగునది.

దుర్జ. ఆ ధర్మశాస్త్రము పతిహత్యయను పాతకము నత్యంతము నిషేధించుచున్నది. ఇది నీవు మఱచితివి కాఁబోలు?

సరో. జప్తియున్నది. ఈ సందర్భమున నొకస్త్రీ తనపతియొక్క జీవమును బోఁగొట్టుట కాదు. న్యాయపరిపాలనమను పవిత్రసేవను దన శిరముపై వహించియుండు నొకరాణి, భయంకరాపరాధ మొనర్చిన యతి నీచునకొకనికి శిక్ష నొసంగుచున్నది. దీనిని బాగుగ నెఱుంగవలయును.

దుర్జ. ఇట్టి కపటోక్తులచే నీవు చేయఁబూనిన పతిహత్యారూప పాతకమును దీర్ఘాలోచన చేసిచూచినయెడల నది మిక్కిలి నీచమయని తోఁచును.

సరో. విశ్వాస ఘాతుకమను భయంకరపాతకము నాచరించి సిగ్గుపిడి క్షమింప వేఁడుట మిక్కిలి పౌరుషహానికరమగును.

దుర్జ. కాని నన్ను దేహాంతదండనమునుండి విముక్తునిం జేయనేవలయును.

సరో. ఈ యపరాధము క్షంతవ్యముగా నేరదు. కాఁబట్టి దానికిందగు దండన విధింపకుండుట న్యాయహాని యొనర్చినట్లును పాపమును వర్ధిల్లఁజేసినట్లును సంఘమును నశింపఁజేసినట్లు నగును.

దుర్జ. నాకొఱకుఁ గాకపోయినను నీ గర్భమునుండి శీఘ్రకాలమున జనింపఁబోవు శిశువు నుద్దేశించియైన నేఁజేసిన యపరాధములను, నీవు క్షమింపవలదా?

సరో. ఇట్టి లోభమునకు లోఁబడు నట్టిచపలత్వ మీ సరోజిని కెన్నటికిని గలుగదు. ఈ సమయమున నా గర్భమునందలి శిశువు ప్రత్యక్షముగ నతిదీనముగ నేడ్చుచు వేఁడినను, నేను న్యాయబాహ్యురాలను గానేరను.

దుర్జ. అట్లేని, నాకుజన్మదాతయగు తండ్రిని మానహీనురాలై వధించె నీ యధమ చండాలియని వాఁడాజన్మము నిన్ను నిందించుచుండును. అదినీకుసమ్మతమా?

సరో. తన తండ్రిచేసిన దారుణపాపములకుందగు శిక్ష యొసఁగఁబడెనని విని, యది యుక్తమయని యాబాలకుం డెఱుంగఁగలఁడు. ఒకవేళఁ దనతండ్రి పాపము లనంతములని తెలిసియు నేఁజేసిన న్యాయపూర్వకమగు దండనము నీచమని వాఁడుచెప్పిన నిట్టి పాపికిఁబుట్టిన యా బాలకుని వాక్యములనే సరకుసేయను:

దుర్గ. సరోజినీ! నీ మనసు మిక్కిలి కోమలమని నేనింతకాలము దలంచియుంటిని. ఇప్పుడది మిక్కిలి కఠినమైనదని నా యనుభవము మూలమునఁ దెలిసికొను చున్నాను. నీకు నీపతియెడ మర్యాద లేదు. నీ బాలకునెడ నించుకేని దయ లేకయున్నావు. ఈ నీచర్యలు నిష్కళంకమైన స్త్రీజాతికిఁ గళంకము తెచ్చును.

సరో. వృథావాదమేల? ఇపుడు మృత్యువునుండి తప్పుటకుఁ దగుకారణము గాన రాకున్నది. భటులారా! ఈ యపరాధికి దేహాంత దండనము విధింపఁబడి యున్నది. వధ్యశిలపై నెక్కించి చండాలురచే శిరము ఛేదింపఁజేయుఁడు.

(పోవుచున్నది)

మూ-సర్దా. దేవీ! కొంచె మాఁగవలయును. ఈ యపరాధికి దేవియెడ నొక మనవి యున్నట్లు తోఁచెడిని.

సరో. ఏమది?

మూ-సర్దా. సామాన్య హంతకునింబోలెఁ జండాలురచేఁ జావనీతని కిష్టముగాకున్న దేమో.

సరో. అట్లైనీతని నేనుఁగు కాళ్లచేఁ ద్రొక్కించియేనిం, గోటబురుజుపైనుండి క్రిందికిఁ ద్రోయించి యేనిం జంపింపుఁడు.

మూ-సర్దా. అదియు లజ్జాస్పదమగునని యతనితలంపు.

దుర్గ. బహిఃప్రదేశమున జోదునకుందగు దుస్తులధరింపఁజేసి సిపాయీల ఫిరంగుల ప్రేటునఁ జంపింప నాజ్ఞయిమ్ము. ఇదియేనాప్రార్థన.

సరో. రాజద్రోహహత్యా పాతకములనొనర్చినవారికి, వీరులకుఁగలుగు మృత్యు వెన్నటికిని సిద్ధింపదు. కపటమున విశ్వాసద్రోహియై తనరాజును గుప్తరీతిని హత్యసేయనెంచి తనకీర్తిం బోఁగొట్టుకొనిన నరాధమునకు వీరులకుం దగిన పవిత్రమగు మరణముగోరుట మిక్కిలి యనుచితము. (పోఁబోవుచున్నది)

దుర్గ. (సిపాయీలనుండి తప్పించుకొని దానినడ్డగించును) వలదు. వలదు. నన్నిట్లు క్రూరరీతింజంపవలదు - నాకు జీవదానమిమ్ము - (దానికాళ్లంబడి పొరలును.)

సరో. మరణకాలమునందైన నిట్టి యగౌరవకార్య మొనర్చుట యయుక్తము.

దుర్గ. వలదు. నన్నుజంపవలదు. నన్ను జన్మముండువఱకుఁ జెఱసాలయందుంపుము. నీ యిష్టమువచ్చిన కష్టములకునన్ను లోఁబఱుపుము. కాని యీ యౌవన మున నా ప్రాణములందీయకుము. నేను సప్రాణుఁడనై యుండనిమ్ము.

సరో. విశ్వాసద్రోహము, రాజద్రోహము, స్త్రీహత్యాది మహాపాతకములు చేయు టచే నపవిత్రతనొందిన యీ యౌవనముపై నానపడరాదు. ఏ జగమున

రాక్షసకృత్యముల నొనర్చి తనకీర్తిని బోఁగొట్టుకొనెనో యట్టి జగముపై మన నాశగలుగరాదు. (సిపాయీలను జూచి) ఈ యపరాధిని దూరముగఁ గొని పొండు.

(సిపాయీలు దుర్జయునిదూరముగఁ గొనిపోవుదురు. సరోజిని వెడలిపోవును)

దుర్జ. సరోజినీ! సరోజినీ! అగుము. ఆగుము. నాపైఁ గరుణ రానిమ్ము - చీ! పోయెను. అది వెడలిపోయెను. దుర్జయా! దుర్జయా! ముగిసినది - నీ జన్మము పాడైనది.

మొ-సర్దా. పొండు. ఈ యపరాధిని వధ్యశిలపై నెక్కింపుఁడు. (సిపాయీ లట్లు చేయుదురు).

దుర్జ. వలదు. వలదు. అందఱు నాపై నిట్లు విరోధభావమును వహింపకుఁడు. మీ రందఱు నా యన్నముతినియున్నారు. ఇట్లు స్వామి ద్రోహ మొనర్చి మాన హీనులుగాకుఁడు. నన్ను విడువుఁడు - నాకు జీవదానమిండు. మీ కందఱకు నేనుశరణాగతుఁడ నయ్యెదను. (భయముతో వణఁకుచు నందఱ పాదములపైఁ బడును.)

మొ-సర్దా. ఇపుడీ ప్రలాపములచే నేమిప్రయోజనము? దుష్కార్య మొనర్చుటకుఁ బూర్వము దానింగూర్చి దీర్ఘాలోచన యొనర్చియుండవలయును.

దుర్జ. (వధ్యశిలపై నెక్కింపఁబడియుండునపుడు) చండాలురారా! నేను మరణించుచున్నాను. కాని దీనినిగూర్చి మదాలసామహారాజ్ఞి మీయందఱపైఁ గసి దీర్చుకొనకమానదు. మదాలసా! మదాలసా!

సీ॥ నీప్రేమఁ గడియింప నిర్మలరవివంశమును మంటఁగల్పి నేఁజెనటినైతి<br>
నామేలెయే వేళ నామోదమునుగోరు. విక్రాంతు వైరినై వెడఁగనైతి<br>
దేవాంగనా సతిం దీఱనియిడుమల మడియించిమునియును జెడుగునైతి<br>
చంద్రశేఖరు బాలుఁ జంప గాఁదివురుట, ధరలోన ఘోరపాతకుఁడనైతిఁ

గీ॥ జెప్ప నేటికిదుడుగులఁ జెప్పరాని. వెన్నియో చేసి ప్రజలెల్లనన్ను జూచి<br>
తిట్టికొంచునుదొలఁగంగ నిట్టులైతి. మఱువకుమువన్ను భావిజన్మమున నైన॥

నీ దుర్జయుఁ డీప్రపంచమునువిడిచి పోవుచున్నాఁడు. వానిని మఱువకుము.

రంగము ముగియుచున్నది.

# రాజభక్తినాటకము.

—:o:—

## అంకము 7. రంగము 1.

స్థలము:—రణరంగము.

(ప్రవేశము. మదాలసయొక్క సర్దారులు.)

మొ-సర్దా. ఛీ! నేఁటియుద్ధముయొక్క రీతిబాగుగలేదు. నేఁటిదినము విక్రాంతుఁడు మనలనామావశిష్టులుగఁ జేయుటకు నిశ్చయమొనర్చినట్లు తోఁచెడిని. ఈ యుద్ధభూమింజూచిన నొకక్షణమాత్రమున, మనసైన్యము పంచబంగాగ మగునట్లు తెలియుచున్నది. ఎక్కడఁజూచినను బరాభవమే.

రెం-సర్దా. విక్రాంతుఁడు నేఁడు ప్రళయకాలరుద్రుని స్వరూపము ధరించియున్నాఁడు వాఁడు కాలుపెట్టుచోట మనవారిని విగతప్రాణులం జేయుచున్నాఁడు.

మొ-సర్దా. మృణాళిని మనవారిప్రాణముల మహిషాసురమర్దనివలె హరించుచున్నది. మృణాళినీ విక్రాంతు లొకరినొకరు విడిచియుండరు. ఈ రీతిని యుద్ధ మెడతెగక జరుగుచున్నది. ఇదెయేల మనవారు పరుగిడుచున్నారు ? విక్రాంతుని భటులువారిని వెంబడించుచున్నారు. బంధవిముక్తములైన మర్కటములవలె నాలుగుదిక్కులకు మనవారు పరుగిడుచున్నారు. ఇపుడే ఘోరయుద్ధసమయము. రమ్ము. మనము పాఱిఁబోవుదము. (వారు పోవుచుండఁ గోదండుఁడు ప్రవేశించును)

కో. మిత్రులారా! ఆగుఁడు. రణరంగమును వదలిపాఱిపోకుఁడు.

మొ-సర్దా. సేనాపతీ! ఇపుడిచట నుండుటవలనఁ బ్రయోజనములేదు.

కో. మహారాజ్ఞి యెచటనున్నది ? అదిమాత్రము నాకుఁ దెలుపుఁడు. పాఱవలసి వచ్చిన నందఱము కలిసిపాఱిపోవుదము - మహారాజ్ఞి నొంటరిగ వదలి మనము మనప్రాణములఁ గాపాడుకొనుటయుక్తముగాదు.

రెం-సర్దా. ఆమె యీ యోధసమూహ మధ్యముననున్నది. అచటికిఁ బోయి యామెంజూడఁగోరుట స్వర్గమార్గమును ద్రొక్కఁ గోరుటయగును. నీకిష్టముండిన నీవు పొమ్ము. మేమిచటనుండియే వెడలిపోయెదము. (వెడలిపోవుచున్నారు)

కో. ఆగుఁడు! ఛీ! ఈ భయచకితులు పాఱిపోకుందురా ? ఇపుడు మదాలస నెచటవెదకుదును ? ఆ యమను విడిచిపోవ నాకాళ్లుకదలకున్నవి. రణభూమి నంతయు వెదకిచూచినను నామె నాకుఁ గన్పట్టుటలేదు. నాకుఁ బ్రాణము పోవునట్లున్నది. ఇపుడిచటనుండుట తగదు. ఇచటనుండి శత్రువులచేఁ జిక్కుసటకన్నం బరుగెత్తిపోవుట శ్రేయస్కరము. కాఁబట్టి మదాలసను మొట్టమొదట వెదకిరావలయు. (వాఁడు పోవును. మదాలస ప్రవేశించును).

మదా. ముగిసినది - నా ప్రపంచసుఖమంతయు నేఁటితో ముగిసినది.

సీ॥ ప్రాజ్యరాజ్యాపహారాశా పిశాచంబుసోఁక విక్రముఁజంపి పాపినైతిఁ
జంద్రశేఖరుఁజంపు జతనంబువిఫలమై యీవసంతునిఁ జంపియధమనైతి
పరమపతివ్రతాభివ్యచరిత్రను దేవాంగనను జంపిదిట్టనైతి
ఘోరకార్యంబులఁ గోరియెన్నియొ చేసి పాపశీలురమేలు బంతినైతి

గీ॥ విక్రమాధిపవిక్రాంతుఁ బెండ్లియాడఁ, గోరనను జంప నాతండు గోరనేఁడు
ఒకనిచేనిట్లు చచ్చుటయొప్పుగాదు, ఆత్మహత్యయెశ్రేయమౌనరసిచూడ॥

నాసైన్యమంత నాశత్రువులచే నోడింపఁబడియె. నా సర్దారులు నను విడిచి పోయిరి. ఇపుడు నాకుఁ దోడు నేనే. వేఱెవరు లేరు. మదాలసా! ముగిసెను. నీ యనతారకార్యము నీ ముఖమునకు మసిపూసికొనుము. ఈ ప్రపంచమున నెచటనైన నొకమూలదాఁగి యుండుము. ఇపుడే యిటనుండి పాఱిపొమ్ము. యుద్ధమునుండి పాఱిపోవుట యభిమానవతియగు నీ కీర్తికిఁ గళంక మాపాదించునుగదా యనిన శత్రువులకధీనవై బ్రతికియుండునటుకు వారియెడ సేవకాన్యత్తియను నీచపదవిని గైకొనుము. అయ్యో! శత్రువులయెడ సేవకాన్యత్తియా? కాదు. ఈ తలంపెంతయు నసహ్యముగ నున్నది. చీ! దానికంటె మరణామే మేలు. నేమరణము కోరుదాన. ప్రాణములతో శత్రువులకుఁ జిక్కఁజాలను - శస్త్రమా! సిద్ధముగమ్ము. ఒకపొడుపున - తొందరపడకుము. [మకుటము చేతికెత్తి] నేను మరణమొందినను నా మస్తకస్పర్శముచేఁ బవిత్రితమైన యీ సామ్రాజ్యమకుటము శత్రువుచేకొని నన్నపరాజయమొందించినందులకుఁ జిహ్నముగఁ దనశిరముపై ధరించుకొని ప్రపంచమున మిక్కిలి గౌరవముతోఁదిరుగును. కనుక నీ మకుటమునకు నూపనాశమొనర్తును. ఈ మకుట మాయధమాధముని శిరస్పర్శమున నపవిత్రముగాఁజనదు. స్వయముగ దీనిని మంటఁగలిపెదను. ఆవల నేను బృథ్వీమాతగర్భము నానందముతోఁ జేరెదను. (మకుటమునుద్దేశించి) మహాభాగ్యవంత మగునో సామ్రాజ్యమకుటమా! నీవిదివఱకు మదాలస మస్తకసాన్నిధ్యమొందియుండినందున నీ ప్రపంచమున శ్రేష్ఠమైనపదవిని బొందియుంటివి. అట్లుండ నధమాధముఁడు నీచుఁడునగు చంద్రశేఖర సమాగమమున భ్రష్టత్వమునొందనపేక్ష నీకువలదు. పొమ్ము. వసుంధరాదేవి గర్భమున సుఖముగ శయనింపుము. (మకుటమును ఖండఖండములుగ నొనర్చి మంటఁగలుపును) నా మనస్సిపుడు శాంతమొందినది. ఇంక సుఖముగఁ బ్రాణమువిడుచుటకు నా కెట్టి యభ్యంతరమును లేదు. (తన్నుదానుజంపుకొనఁ బ్రయత్నించును. అంతలోఁ గోదండుఁడు దానిచేయి పట్టుకొనును).

శశి. ఆఁ! ఆఁ! ఆఁ! మదాలసా! ఇట్టిసాహసమువలదు. నీకరమును మరల్పుము.

మదా. ఎవఁడు ? కోదండా ! పొమ్ము. దూరముగనుండుము. నన్ను విడువుము.

కో. నిన్ను వదలను. నీవు బ్రతికియే యుండవలయును.

మదా. ఛీ ! శత్రుదాస్యమున జీవముకడపుటకంటె మరణమేమిక్కిలి మేలు.

కో. మదాలసా ! మనము శత్రువులచేఁ జిక్కినఁగదా ?

మదా. శత్రువుచేఁ జిక్కకుండుటెట్లు ?

కో. ఎట్లా ! తెల్పెదవినుము ? మనమిప్పుడే యిచటనుండి పాఱిపోయిన వారిచేతిలోఁ బడక తప్పించికొనినట్లగును గదా ?

మదా. పాఱిపోవుటయా ? కోదండా ! నన్ను రణరంగమునుండి పాఱిపొమ్మనెదవా !

కో. అగును. ఇచటినుండి నిన్ను బిలిచికొనిపోవుటకొఱకే నేనిచటికి వచ్చియున్నాను.

మదా. ఇది యెన్నటికిని గానిపని. నా శత్రువులగు మృణాళినియు విక్రాంతుఁడును యుద్ధమున నాకెన్నడేని వెన్నుచూపియున్నారా ? అట్లుండఁనీ మదాలస వారికి వెన్నుచూపుచు రణరంగమును వదలిపోఁజాలదు.

కో. వారాత్మహత్య చేసికొనలేదు.

మదా. అట్లని జీవితురాలనై వారిచేఁజిక్కి జగమున నందఱు 'ఛీ' యని నిందించు రీతిం జేసికొని నేనుండవలయుననియా నీవు చెప్పుచున్నావు? ఇసీ! ఇది నాయిష్టమునకు వ్యతిరేకము - వారు నన్ను గ్రూరమృగమును గూఁటియం దునిచి చూపురీతిం బ్రదర్శింతురు. బ్రహ్మావర్తమునందలి యెల్లరును నన్ను ధిక్కరింతురు. కాఁబట్టి నన్నువదలుము. రానున్న దుర్దశలనుండి తప్పించుకొనుట మేలు.

(మృణాళిని ప్రవేశించును)

మృ. వీరిరువురను బట్టుకొనుఁడు. పాఱిపోనీయకుఁడు. వీరి యొద్దనుండు శస్త్రములను గైకొనుఁడు. (సిపాయీలు వారిరువురను బట్టుదురు. వారియొద్దనుండు శస్త్రములం దీసివేయుదురు.) మదాలసా ! కోదండా ! మీరు నాచేబంధితులైతిరి.

మదా. నన్నేలబంధింపవలయును ? తక్షణమ చంపివేయుఁడు. భటులారా ! నన్ను వదలుఁడు. నేను పాఱిపోవుదాననుగాను, నాచే నొకకరవాల మిండు. మీతోఁ బోరాడెదను. వలదు. నాకు శస్త్రమువలదు. మీ ఖడ్గదేవతకు నన్ను బలియిండు.

(విక్రాంతుఁడు సర్దారులును బ్రవేశింతురు)

విక్రా. మా కరవాలముల స్పర్శించుటకైన నీకు యోగ్యతలేదు. అట్లుండ మాకరవాలములచే నీకు మృత్యువుకలుగవలయునను నాశ యేల ? (మృణాళినినిం జూచి) బాగుబాగు ! మృణాళినీ ! నేఁడుమనకార్యము పూర్ణసిద్ధిం బడసెను. చంద్రశేఖరమహారాజునకు జయమని ఘోషింపుఁడు (జయఘోషము)

మదా. (బిగ్గరగనవ్వి) కూయుఁడు. గొంతులుచించుకొనుచుఁ గూయుఁడు. మీ రెంత కూసినను జంద్రశేఖరుఁడు స్వర్గమునుండి మీ కడకురాఁజాలఁడు.

విక్రా. మదాలసా! నీకు భ్రమపట్టియున్నది. చండవర్మసైన్యము నోడించి సరోజినీ చంద్రశేఖరులతో సర్దారు లిటకు వచ్చుచున్నారు.

మదా. విక్రాంతా! నేను భ్రమచెంది యుండలేదు. మొన్నటిరాత్రి దుర్జయరాజు కూర్మదుర్గ రాజగృహమునఁ జంద్రశేఖరుని జంపియున్నాఁడు. (ఉగ్రసేనుఁడు సర్దారులు ప్రవేశింతురు).

ఉగ్ర. నీ తలంచినయట్లు చంపఁబడియుండవచ్చునుగాని మదాలసా! ద్రోహియగు దుర్జయుని ప్రయత్నములన్నియు నిష్ప్రయోజనములయ్యెను. వానికపటము తుదకుఁ బ్రకటమయ్యెను. వాఁడు చేసిన ఘోరరాజద్రోహమునకై వానికి సరోజినిచే మరణదండన విధింపఁబడెను.

మదా. అయ్యయో! నా సర్వప్రయత్నము లెట్లు నాశమొందినవి? హా! దైవము నాకెట్లు ప్రతికూలమైనది?

ఉగ్ర. (విక్రాంతునిజూచి) మహారాజునకు జయమగుఁగాక! మహారాజా! రాజాధిరాజగు చంద్రశేఖరుఁడు సరోజినీరాజ్ఞియు మీదర్శనమునకై వచ్చుచున్నారు. (చంద్రశేఖరునిగూర్చి జయఘోషము)

మదా. ఔరా! రాజాధిరాజు చంద్రశేఖరుఁడా? మదాలసా! మదాలసా! నీ మహత్త్వాకాంక్ష చూర్ణీభూతమైనది. రాజాధిరాజు చంద్రశేఖరుఁడా! హా! చంద్రశేఖరుని గుఱించిన యీ జయశబ్దమును నేను వినఁజాలకున్నాను. శాత్రవ జయశబ్దమును బలాత్కారముగ వినిపింపు నోశ్రవణేంద్రియ మా నన్నువీడిపొమ్ము. ఇది మొద లీయింద్రియములు నా కావశ్యములుగావు మీరందఱేకమై ప్రతిక్షణమందును నాదృఢవైరియౌన్నత్యమును నామనంబునకుఁ దెలియఁజేయఁగలరు. కావున నోసర్వేంద్రియములారా! నన్ను విడిచితొలఁగుఁడు. మీకిదియే నాకడపటి నమస్కారము. ఆగుఁడు - ఇవి యన్నియు నిజముగనుండునా? లేక వీరందఱునన్ను మోసగించుటకై యసత్యపుమాటలు కల్పించియున్నారా?

వృ. నీవేల యిట్లాలోచించుచున్నావు? ఇంకను సందేహమా! ప్రత్యక్షముగ నిదె జూడుము. (నేపథ్యమునఁ జంద్రశేఖరునిగూర్చి ప్రచండజయఘోషము చంద్రశేఖరుఁడు - సరోజిని సర్దారులు మొదలగువారు ప్రవేశింతురు.)

విక్రా. రమ్ము. రమ్ము. బాలా! చంద్రశేఖరా! నిన్నునేను దృఢాలింగము చేసికొనెదను (ఒకరినొకరు కౌఁగిలించు కొందురు)

రంగము ముగియును.

# రాజభక్తి నాటకము



అంకము 7. రంగము 2.

స్థలము.—కూర్మదుర్గమున సరోజిని, రాజగృహము.

(ప్రవేశము - మృణాళిని సరోజిని.)

మృ. సరోజినీ! నీవృత్తాంతములను విన నా మనస్సునకు మిక్కిలి సంకటము గలుగుచున్నది.

సరో. మృణాళినీ! నే నేమని వచింతును? కడచిన నాలుగు నెలలు నామనస్సునకు మిక్కుటమగు కష్టములు గలిగెను. అవి నాకుఁ దెలియునుగాని యితరులకుఁ దెలియవు. అట్టి సమయమున నీశ్వరునికి కృపలేకపోయిన నా దశ యెట్టిస్థితిని జెందియుండునో నేఁజెప్పఁజాలకున్నాను.

మృ. ఉండనిమ్ము. అయినది. నీవు కడవఱకు మోహపాశమునఁబడక నీధర్మమును నెఱవేర్చినందుల కూరట నెందవలయును. ఇట్టిసంకటములు నీకుఁగాక మఱి యొక సామాన్యస్త్రీకిఁ గలిగియుండిన నామెసంకటమునకుఁజిక్కి తప్పుత్రోవ నవలంబించి యంతము నొందియుండును. ఇట్టి యసాధారణ సంభవములందు నీవు నీయశమును గాపాడుకొనుచుండిన దీశ్వరుని మహోపకారమనియే చెప్పవలయును.

సరో. అగును. ఇది యీశ్వరుఁడు నాకొనర్చిన యొక గొప్ప యుపకారమయగుచున్నది. కానిచో నెంతటితెలివి గలవారలకును భ్రమనుగలుగఁజేయు నీసంకటములు నాబుద్ధినిమార్చి నన్నునిక్కువముగ సర్వనాశమొనర్చియుండును. మృణాళినీ! ఇఁక మీఁద నీవేమార్గము నవలంబింప నిశ్చయించియున్నావు.

మృ. అయ్యది నీతోఁగలసి యాలోచించి నిశ్చయించుకొనఁదలఁచియున్నాను.

సరో. నేను శేషించియుండు నా జీవితకాలము నీశ్వరధ్యానమునఁగడుప నిశ్చయించియున్నాను.

మృ. నేనునటులనే నిశ్చయించుచున్నాను.

సరో. అట్లయిన, మనమిరువురమును హిమాచలమునకుఁబోయి వానప్రస్థాశ్రమదీక్ష స్వీకరింతము.

మృ. మొట్టమొదట నాకీయభిలాషయేయుండెను. కాని యీవిషయమున విక్రాంతమహారాజు నభిప్రాయమడిగితిని. అతఁడు వేఱుమార్గ ముపదేశించెను.

సరో. విక్రాంత మహారాజు నీకేమియుపదేశించెను?

మృ. అతఁడులోకసేవారూపమున నీశ్వరారాధనయొనర్పవలయుననియుపదేశించెను.

సరో. నీ కాయుపదేశము సమ్మతమకదా?

మృ. అగును. నేనుదానినిగూర్చి మిక్కిలి దీర్ఘాలోచన యొనర్చి బ్రహ్మచారిణినై లోకసేవచేసిన నీశ్వరునకుఁదృప్తియొనర్పఁగలనని నిశ్చయించియున్నాను.

సరో. నీవుచేసియుండు నిశ్చయము మిక్కిలి సమంజసమని నాకును దోఁచెడిని.

మృ. విక్రాంత మహారాజునైఁతము కొన్ని సంవత్సరములకుఁ బిమ్మట సన్న్యాసము గైకొని తనజీవితకాలమును ధర్మకార్యములఁగడపునట్లు నిశ్చయించియున్నారు. అపుడు మన మిరువురము నతనికి శిష్యులమై లోకసేవయను ధర్మకార్యమును జేయుటకు వీలుగలుగును. ఈ విషయము నీవునించుక యాలోచింపుము.

సరో. ఈ విషయమున నాలోచింపవలసిన దేమున్నది. ? విక్రాంత మహారాజును నీవును నేమార్గ మవలంబించెదరో యది శ్రేయస్కరమని నాకుఁ దెలిసియుం డుటచే నట్టిమార్గమునే నేను నవలంబించెదను.

మృ. నీ మాటలువిన నాకత్యంతానందము గలుగుచున్నది. సరోజినీ ! ఇటురమ్ము. నిన్ను నేను దృఢాలింగనముచేసికొనఁదలంచుచున్నారు. ఇదివఱకు మనమిరు వురము తోడఁబుట్టువులవలెఁ జరించుచుంటిమి. అయిన నవియైహిక బంధు త్వము. ఇపుడు మనము పారమార్థిక జ్ఞానసంపాదనమునకుఁ దొడఁగుచున్నా ము. ప్రాపంచిక బంధుత్వమునకన్న శ్రేష్ఠమును శాశ్వతమునగు పారమా ర్థిక బంధుత్వము నవలంబింతము. (ఆలింగనము చేసికొందురు. అంతలో నొకసేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సేవ. దేవీ ! మదాలసా కోదండులకు శిక్షనునిర్ణయించుటకై సర్దారులు దర్బారున నాలోచన సభయొనర్పనున్నారు. మీరిరువురు నచ్చటికి విచ్చేయవలయునని విక్రాంత మహారాజు మిమ్ముం బ్రార్థించుచున్నారు.

సరో. నీవుపొమ్ము. నీవెంబడియే వచ్చుచున్నారము. (సేవకుఁడు పోవును) మృణాళినీ ! మదాలసా కోదండుల కెట్టిశిక్ష నొసంగవలయునని నీకుఁ దోఁచుచున్నది.

మృ. సరోజినీ ! ఇపుడు మనయిరువురికుఁ బ్రాపంచిక జీవితము సమాప్తమైనది. కాఁబట్టి ప్రాపంచిక జీవితమును జేరిన రాగద్వేషాది వికారములనుండి మన ము తొలఁగవలయును. ఈ పరమార్థ విచారమను సామ్రాజ్యమున నీశ్వరుఁ డొక శిక్షయేనియమించి యున్నాఁడు. అదియే:య. కాఁబట్టి యాశిక్షయే విధింపవలయునని మహారాజునకు సూచింపనున్నాను. నీ మనసున కేమి తోఁచుచున్నది ?

సరో. మృణాళిని యాత్మయందు లీనమైన సరోజినియొక్క జీవాత్మకు మృణాళిని తో భిన్నాభిప్రాయము గలుగనేరదు.

మృ. ఈశ్వరుఁడు నీకెల్లపుడు మంగళమొసఁగుఁగాత. (పోవుచున్నారు)

రంగము ముగియును.

# రాజభక్తి నాటకము.



అంకము 7. రంగము 3.

స్థలము:—కూర్మపురమునందలి రాజగృహము.

(ప్రవేశము - విక్రాంతుఁడు - చంద్రశేఖరుఁడు - సరోజిని - మృణాళిని. సర్దారులు. బంధితురాలైన మదాలసా కోదండులు)

విక్రాం. మదాలసా! నీ విదివఱకుఁ జేసినకార్యములకై నీకుఁబశ్చాత్తాపము గలుగుచున్నదా?

మదా. చేసినకార్యములంగూర్చి పశ్చాత్తాపనా? మానహీనులగు నల్పులకుఁబశ్చాత్తాపమనునది గలుగును. నావంటి శూరురాలగు స్త్రీకది గలుగదు.

మృ. ఇపుడు నీవు శౌర్యహీనురాలవై యున్నావు. గొప్ప విభవము లనుభవించుచుండిన కాలమున నీవు మఱచియుండిన యీశ్వరు నిపుడేని స్మరింపుము.

మదా. గొప్ప నైశ్వర్యముగల కాలమునంగూడ నెవ్వని నేను స్మరింపకుంటినో యాతని నిట్టి యాత్మకాలమునందు నేను దలంపఁజాలను.

విక్రా. మదాలసా! నీవు చేసియుండు దుష్కృత్యములఁగూర్చి యిపుడు నీ మనసునకుఁ గష్టముతోఁపక పోయినను ముందొక సమయమునందైనం బశ్చాత్తాపము గలుగక మానదు. అట్టి సమయము కలుగవలయుననియే నీ వొనర్చియుండు సర్వాపరాధములంగూర్చి నీవు క్షమింపఁబడుచున్నావు. ఇపుడు నీ వేదైన నొకమఠమునకుఁబోయి నీజీవిత మీశ్వరచింతయందు వినియోగింపుము.

మదా. విక్రాంతా! నీవౌదార్యమునుజూపు నెపమున నన్ను లజ్జకులోఁబరుపఁజూచెదవు. కాని నాదృఢవైరియగు నీకిట్టియశము గలుగునట్లొనర్పను. ఈశిరము నీక్షమకు నమ్రమగునను భావను నీకుండిన నది యొక పొరపాటు. ఇదె చూడుము. నీక్షమను నాకాలితోఁ దన్నెదను.

కృతాంతుఁడు. మదాలసా! నీవు మాకృపకు నిజముగ నపాత్రురాలవని మాకుఁ దెలిసియుండియు విక్రాంతమహారాజు మూలమున మేమునిన్ను క్షమించుటకు సిద్ధముగనున్నాము.

మదా. మీరునన్ను క్షమింపఁబోవుచున్నారా? మీ రెవరు? మీ యోగ్యత యెట్టిది? మీ రెల్లం గూటికొఱకుఁ గాచియుండు శునకములు. మీయట్టి యధములకు నాపాదరక్షలం దుడుచు యోగ్యతయును లేదు. అట్టివారలా నన్ను-మిక్కిలి గౌరవముగల యీ మదాలసను క్షమించు నధికారము చూపనున్నారు? పొండు. నేనీప్రాణమునైన వదలెదనుగాని కాసునకుఁగొఱగాని యయోగ్యులగు మీయట్టివారి దాస్యమునంగీకరించి మీరిచ్చు గ్రాసమునుదినుచు బీనుఁగువలె నా జీవితమును గడపుట కెన్నటికి నంగీకరింపను.

విక్రా. మదాలసా! కొంచె మాలోచింపుము. సూర్యకులమున నుద్భవించిన స్త్రీ కిట్టి నీచగుణము గలుగుటకు నేనురోయుచున్నాను.

మదా. చాలును. చాలును. సూర్యకులముయొక్క యభిమానప్రదర్శనముచాలును. సూర్యకులోద్భవురాలగు నేను - మదాలస - అంత్యకాలమం దితరుల దాస్యము నొప్పుకొనఁజాలను. నేనీవలె కెట్లు స్వతంత్రురాలనై మనియుంటినో మరణ సమయమునంగూడ నటులేయుందును. నేనేను మీయెడఁ బ్రాణభిక్ష వేఁడుటకు రాలేదు. నా యిష్టమునకు విరోధముగ మీరట్లుచేయ యత్నించినను నదినెరవేఱనియ్యను. నన్ను మీ కిష్టమువచ్చిన దుర్దశలకు లోఁబఱపుఁడు. నేను వాని ననుభవించుటకు సిద్ధముగనున్నాను.

కో. మదాలసా! ఈ రీతి బుద్ధిహీనవై చరింపవలదు.

మదా. నోరుమూయుము. ఇంక నొకమాటనైన నాడకుము. నాయట్టి వారెట్టి సమయముననైనను దమగౌరవమును గాపాడుకొనంజూతురుకాని నైచ్యమూనరు.

కో. ఇప్పుడు గౌరవమును గుఱించి మాటలాడుటకు సమయముగాదు.

మదా. సమయగాదా! పౌరుషహీనుఁడగు నీయట్టి శునకపుమాట విననొల్లను. ఈ విక్రాంతుఁడు నా చెఱనుండినపుడు తన శిరము నాయెదుట నెపుడైన వంచియున్నాఁడా? అట్లుండ నా దృష్టనైరియగు వానిదయను స్వీకరించి వాని దాస్యము నంగీకరించుట యెంతటి నీచస్థితి? పౌరుషమున నా శత్రువుకంటె నేను వెనుదీయుదానను గాను. కోదండా! నీవుగూడ నీగౌరవమును మఱచి ప్రాణములపై నాశయను పాశమునకుఁజిక్కి మోసముపోవలదు.

కో. వలదు. మదాలసా! ఇట్లు వెఱ్ఱిహఠముపట్టి యిహలోక సుఖముల వీడఁ దలంపకుము.

మదా. శత్రుదాస్యమున సుఖమా? కోదండా! నీ బుద్ధిచెదరియున్నదా?

కో. అగును. నీవలె నాకట్టిమూ వేశ మింకను బట్టియుండలేదు.

మదా. అట్లేనిట్టి పౌరుషహీనములైన మాటలు నీనోటనెట్లు వెలువడుచున్నవి?

కో. నా సామర్థ్యము నన్నింకను వదలలేదు.

మదా. ఓ మానహీనుఁడా! నీయధైర్యమును దాఁచుటకై యద్దానివి సామర్థ్యమని మార్చి చెప్పుటకు నీకు లజ్జగలుగుటలేదా?

కో. నీవేమేనిం జెప్పుకొనుము. నీ యీపట్టుదలవదలి వీరిచరణముల నాశ్రయించి యీజగమున సుఖముగ వర్ధిల్లం బ్రయత్నింపుము. నన్నునారీతిగ నేవర్ధిల్లనిమ్ము.

మదా. అట్లుచేయను. రౌరవనరకమున నాసందముతోఁ బడుదునుగాని యిట్టిదుస్థితి నంగీకరింపఁజాలను.

శో. నేనెంత చెప్పిన నేల నీ ప్రాణములపై నిట్లుదాసీనత వహించుచున్నావు?

మదా. నోరు మూయుము. ఓయజమా! నీకు నీ ప్రాణమంత ప్రియమైయున్న యెడల నీ నీచశునకముల పాదములపైఁబడుము. నాకు నా ప్రాణములంత ప్రియానహములుగావు.

శో. అట్లులాడకుము. ఈ జగమున జీవముకంటెఁ బ్రియతరమగు వస్తువెద్ది?

మదా. జీవముకంటెఁ బ్రియమైనది గౌరవము.

శో. సరి. గౌరవమును గాపాడుటకై నేఁ జెప్పునదివినుము.

మదా. దాస్యము గౌరవమును బోఁగొట్టును. దానికిం దాసులైన యెడల మిక్కిలి నీచత గలుగును.

శో. నీచత గలుగునా? నా మాటల నీవు వినవా?

మదా. నీ పలుకొకింత యేనివిననొల్లను.

శో. అట్లని గౌరవమును గాపాడుకొనుటకై నరకము నాశ్రయింపుము. నేను బ్రాణములకొఱకు వీరి పాదముల నాశ్రయించుచున్నాను. (చంద్రశేరుని యెదుట మోకాలొడ్డి) మహారాజాధిరాజా! మీ చరణములకడ నా ప్రాణములను వేఁడుచున్నాను.

మదా. అగుము. ఆగుము. ఇది నాకుఁజూడ నశక్యముగనున్నది. ఇట్లు గౌరవముగఁ బ్రాణములతో నీవుండుటకు నేనొల్లను. (వానియురమును గఠారితోఁ బొడుచును. మఱియు విక్రాంతునిపై కురికి) ఈ రెండవపోటు చండాలా! నీకు [విక్రాంతుని జంపుటకుఁ బ్రయత్నించును. విక్రాంతుఁడు దానిచేయి పట్టుకొనును. సిపాయీలు దానిచేతియందుండు కఠారినిదీసి కొందురు.]

చండ. చాలును. ఈ మెకొనఁగియుండిన ప్రాణదానమిప్పుడు గద్దైనది.

సర్దారులు. దీనిం గొఱతవేయుఁడు - ఏనుఁగు కాళ్ళచేఁ ద్రొక్కింపుఁడు (కలఁత)

విక్రా. దీనిని జాగ్రత్తతోఁ డీసికొనిపొండు. న్యాయానుసారము శిక్షవిధింపఁబడువఱకు దీనిని రాజగృహమునందలి చెఱసాలయందుంపుఁడు.

చండ. న్యాయము నీక్షణముననే నుడివెదను. సేవకులారా! దీనిని చండాలురకప్పగించి కోటకు బయటిప్రదేశమున శిరము ఛేదింపఁజేయుఁడు.

మదా. ఛీ! పొండు! తుచ్ఛులారా! మీరిచ్చిన యనుగ్రహము నేరీతిం దన్నివైచితినో యదేరీతిని మీరు నియమించియుండు శాసనము నా కాలితోఁ దన్నెదను. (ఒక సిపాయి యొద్దనుండి బలాత్కారముగఁ గఠారింగైకొని తన యురమునఁబొడిచికొని ప్రాణమువదలును.)

విక్రా. హత్య - రక్తపాతము మున్నగు ఘోరస్వరూపములచేఁ బుటము వేయఁబడిన రాక్షసీ! మహత్త్వాకాంక్షగల నీయొక్క యంతరాత్మ నాశమేయగును.

రంగము ముగియును

# రాజభక్తి నాటకము.

అంకము 7. రంగము 4.

స్థలము:—సరోజినియొక్క. రాజగృహము.

(ప్రవేశము మృణాళిని సరోజినియు)

మృ. క్షణభంగురమగు విషయాభిలాష మానవుల యంతరంగములం దెప్పటికిని నిండియుండి పరమేశ్వరుం బ్రాప్తించు తెరువున కాటంకముగలిగించి యహంకార మమకారములను మనసున నుద్భవింపఁజేయుచున్నది. అట్టిదానిం దొలఁగించి ప్రపంచమునునదలి పరమేశ్వరుని కృపారసము నెదురు చూచుచుండు నీయంతఃకరణ మెంత నెమ్మది కలిగియున్నది! సరోజినీ! నేఁడు నాకుఁ గలిగియుండు శాంతి సౌఖ్యము లీజన్మమున నింతవఱ కెన్నఁడు ననుభవించినదానను గాను.

సరో. నా హర్షము మిన్నుముట్టుచున్నది. ఏ రాజర్షి యొక్క కృపచే నీయలభ్యమైన లాభము నాకుఁ గలిగెనో యతని చరణదర్శనమే మనకు మిక్కిలి సుఖదాయకమగును.

(ప్రవేశము - వికాసింతుఁడు.)

వికా. బాలికలారా! ఈశ్వరుఁడు మీ యిరువుర పారమార్థిక చింతలఁ బరిపూర్తి మొనరించుఁగాక. సరోజినీ! నీవు నీ రాజ్యమును జంద్రశేఖరుని చరణముల కర్పించి ధర్మకార్యముకొఱకై తాపసదీక్ష వహించుటకు నిశ్చయించుకొంటివి. అందులకై నేను నీకు మనఃపూర్వకముగ నభివాదన మొనర్చుచున్నాను. సరోజినీ మృణాళినులారా! మీ యిరువుర లోకోత్తరచరిత్ర మాచంద్రతారార్కము మీ భూమండలమున వందనీయమగును. అందఱకు ననుకరణీయముగనుండును. నా ప్రియ పుత్రికలారా! నేను మిమ్మొకసారి యాలింగనము చేసికొనెదను. నిజమాలోచించిన మీ శ్రీపాద తీర్థప్రాశనముచేసిన నే నెంతయుఁ బవిత్రుఁడునగుదును. మీ సాంగత్యముచే వైమనస్యము నాకు మఱచిపోయెను. కాఁబట్టి యెల్లపుడు మీ సహవాసముననే యుండవలయునని నేను గోరుచున్నాను.

మృ. జ్ఞానదాతయగు మా జనకుని పాదములకు ముద్దిడవలయునని మాకు దోఁచుచున్నది. (ఇద్దఱు నమస్కారము చేయఁబోయెదరు.)

వికా. (వారిని నివారించి) అటు చేయకుఁడు. మీరు దివ్యవిభూతినందినవారు. మిమ్ము క్షుద్రమగు చరణములకు నమస్కరింపనియ్యకొనను. మఱియు నా

మస్తకమును మీ చరణములపై నిడెదను (నమస్కారము చేయఁబోవును. అతని నడ్డగించి యాలింగనము చేసికొందురు) పరమేశ్వరా! నాకుఁ బ్రాణములకంటెఁ బ్రియతరములగు నీ కన్యలపై నియభయ హస్తముండ నిమ్ము. పుత్రికలారా! పొండు. నేఁడు దేవాంగనాదేవియొక్క సమాధిని దర్శింపఁ బోవుచున్నాను. మఱియు సర్వప్రజలు చంద్రశేఖరునికి రాజమకుటము నర్పింపఁబోవుచున్నారు. మనము నచటికిఁబోవుటకు బయలుదేరవలయును.

మృ. మేమును నేఁడు మాతృదేవతయొక్క పూజ్యమగు సమాధిని దర్శించుటకై మిక్కిలి యానందముతో వచ్చెదము.

వికా. మంచిది. నేను మున్ను బోయెదను. (పోవును)

సరో. స్వల్పమగు నాయుష్కాలమును హేయమగు శరీరపోషణయందు వినియోగిం పక సమాజసేవయం దుపయోగించుటకై మనము నిశ్చయించుకొనియు న్నాము. గనుక నిపుడు మనకు మిక్కిలి యానందము గలిగియున్నది. దేవా! ఎల్లపుడును మాకిట్టి యానందము ననుగ్రహింపుము.

మృ. సరోజినీ! పరమేశ్వరుఁడు నీ కోరికను నెఱవేర్చును.

(పోవుచున్నారు)

రంగము ముగియును.

# రాజభక్తినాటకము.

అంకము 7. రంగము 5.

స్థలము. దేవాంగన సమాధి.

(ప్రజలు చంద్రశేఖరునకు స్వాగతమొసఁగవేచి గానముగావింతురు. గానావసానమున విక్రాంతుఁడు, చంద్రశేఖరుఁడు, మృణాళినీ సరోజినులు ప్రవేశింతురు. ప్రజలు జయఘోషము గావింతురు.)

చంద్ర. (సమాధికి ముందు నిలఁబడి) మాతా! ఈ బాలకుఁడు నీ చరణారవిందములకు దాసుఁడై యున్నాఁడు. (సమాధికి వందన మొనర్చును.)

ప్రజలలో-ముఖ్యుఁడు. ఈ జనులు సిద్ధముచేసిన యీ రాజమకుటమును రాజాధిరాజగు చంద్రశేఖరమహారాజు శిరముపై విక్రాంతమహారాజుంపవలయునని యీ రాజభక్తి పరులగు ప్రజలకోరిక.

విక్రా. (వారి చేతులనుండు మకుటముగైకొని) శాస్త్రోక్తముగ రాజ్యాభిషేకమహోత్సవము శీఘ్రకాలముననే జరుగఁగలదు. కాని, మహారాజాధిరాజును మొట్టమొదట స్వాగతముచేయువేళ మీ రీతని కిట్టి గౌరవముఁ జేయుటఁజూడ నాకత్యంతానందము గలుగుచున్నది. మీయందలి యత్యధికమగు రాజభక్తినిష్ఠనుగూర్చి మీకు ధన్యవాదముఁగొనర్చి మీ యిచ్ఛానుసారము మీ రాజభక్తి కుజ్జ్వలచిహ్నమగు నీ మకుటము చంద్రశేఖర మహారాజు మస్తకముపై నేనుంచెదను. (మకుటమును జంద్రశేఖరుని శిరముముపై నుంపఁబోవును.)

చంద్ర. ఆగుఁడు ఈ మకుటమును నా మస్తకముపై నుంపవలదు. ప్రజలారా! మీ. లోకోత్తర భక్తినిష్ఠనుగూర్చి మీకు నేనత్యంతము ఋణగ్రస్థుఁడనై యున్నాను. బంధువులారా! ఈ మకుటమును ధరించుటకు నా శిర మన్నివిధముల నపాత్రమని తోఁచుచున్నది.

విక్రా. మహారాజా! ఏమి యిట్లు చేయుచున్నారు? లోకుల సమ్మతిని గౌరవించుటకొఱకై యీ మకుటమును మీరు మస్తకముపై ధరించుకొననే వలయును.

చంద్ర. ఇది లోకసమ్మతి ననాదరము సేయుటగాదు. నాకు వేఱుమార్గము లేకయున్నది. సూర్యకులోద్భవుఁడగు విక్రమాదిత్యమహారాజు పుత్రుఁడగు నేను తన కరవాలము నించుకేనియు నుపయోగింపక లభించిన రాజ్యపదవి నెట్లంగీకరింతును? కాఁబట్టి యీ మకుటమును విక్రాంతమహారాజు మస్తక

[illegible] దేవియొక్క [illegible]
[illegible] బాలదాసినియగు మృణాళిని [illegible]
[illegible] దీనిని గానకళ నొసంగుడు.

మహారాజా! మేమందఱము రాజ్యపదవి కనధికారులమై యున్నాము. అట్లే నా మకుటమును నాకొసంగుడు. ఏయుమ యధికారసంబంధ[illegible] నెవరు నపవాదము సెప్పరో యట్టి విశుద్ధపావనమూర్తియగు దేవతయొక్క [illegible] చరణముల దీనిని మనమందఱ మర్పింతము (మకుటము గైకొని) ఓమాత! దేవాంగనా! ఈ బాలకుఁడు నమ్రిభావముతో బ్రహ్మావర్తసామ్రాజ్యమ[illegible] మును, సకల ప్రజల సమ్మతితో నీ దివ్యచరణముల కర్పించుచున్నా[illegible] దేవీ! మా యీ ప్రేమ పూజనమును వాత్సల్యపూర్ణమగు నీకృపాదృష్టి స్వీకరింపుము. (సమాధిపై మకుటమునుంచును) బంధువులారా! నేఁడు మొ[illegible] లీబ్రహ్మావర్తసామ్రాజ్యము దేవాంగనాదేవియొక్క పేరనే జరుపఁబడును. [illegible] యొక్క యభంగప్రతాపముచే బ్రహ్మావర్తసామ్రాజ్యమునొందిన మహాభాగ్య శాలినియు సామ్రాజ్ఞియునగు దేవాంగనాదేవియొక్క చరణములకు, సా మ్రాజ్యమునకు దాసాను దాసుఁడగు నేను—చంద్రశేఖరుఁడను వినయ పూర్వకముగ నభివాదనము చేయుచున్నాను. (కరవాలము పట్టుకొని వంద నము చేయును. అందఱు నటులనే చేయుదురు. పుష్పవృష్టి, జయఘోషము, నృత్తము, గానములు జరుగును.)

అందఱు. పరమేశ్వరా! (మంగళము పాడుదురు.)

రంగము ముగియును.

రాజభక్తి నాటకము సంపూర్ణము.

శుభమస్తు.



